జూలై 29 విడుదల!

అన్నాచెల్లెళ్ళ అనురాగానికి
అపూర్వ రూపకల్పన

ఏవి.యం. ప్రొడక్షన్స్ సమర్పించు
మురుగన్ బ్రదర్స్ వారి



# చిట్టి చెల్లెలు

దర్శకత్వం
యం. కృష్ణన్

సంగీతం
యస్. రాజేశ్వరరావు

రచన
డి.వి. నరసరాజు బి.ఏ.,

నిర్మాతలు
యం. మురుగన్
యం. కుమరన్
యం. శరవణన్



స్మృతి చిహ్నము



రుద్రావఝల ఇందిరాదేవి
మరణము : తేది 27—6—1970
May her Soul rest in Peace.

ఇట్లు: డా॥ మంత్రవాది గౌరీనాథ శాస్త్రి
శ్రీమతి మంత్రవాది శీతారామమ్మ
రావు రుద్రావఝల
రుద్రావఝల విజయమోహన్.



# ఉత్తరాలు

## కథలు

'పుష్పక విమానం' చదువుతూంటే విజయవాడరోడ్ల పరిస్థితి కండ్లకు కట్టినట్లుంది.

ఆర్. నాగరాజు, రామేశ్వరి [అంబుజ].

## సీరియల్

మమత' శ్రీ నండూరి విఠల్‌గారి సీరియల్ అయిపోయింది అని చూడటంతోటే నాకెంతో విచారమైంది. వాస్తవ సమాజ జీవితానికి చాల దగ్గరగా వుండి చక్కని స్టైలిలో ఎంతో బాగా వ్రాసి పాఠకులని సంతోషంపెట్టిన ఆ మమత అప్పుడే అయిపోయింది అంటే నాకెంతో కష్టంగా వుంది. వారు వ్రాసే తీరే వేరుగా వుంటుంది. మనుష్యులయొక్క విచిత్రమైన స్వభావాలను చక్కగా తెలియపరిచారు రచయిత. మరల అటువంటి సీరియల్ ఎప్పుడు ప్రచురిస్తారో తెలియదు.

పి. యం. శ్యామలాదేవి [రేపల్లె].

* * *

నలుగురు రచయిత్రులు వ్రాసిన 'అపరాజిత' చాల బాగున్నది. ముగింపు వాస్తవముగ ఉన్నది. 'మమత' కూడ చాలా బాగున్నది.

యం. సరోజిని [కలువాయి]

## న్యూఢిల్లీ లేఖ

3—7—70 ఉత్తరాల శీర్షికలో యస్. నజీర్‌గారి ఉత్తరం చదినాను. వారు "శ్రీకృష్ణ" గారి న్యూఢిల్లీ లేఖను సరిగా అర్థం చేసికొనలేదేమో అనిపిస్తుంది. ఆయన లేఖలో భారతదేశంలోని ముసల్మానులను ఐ. ఏ. యస్.కి కూర్చొనకుండా అడ్డుపెట్టాలని ఎక్కడా వ్రాయలేదే? అడ్డు పెడుతున్నారా? అని వ్రాశారు. వాక్యాన్ని సరిగా అర్థం చేసుకోండి. ఇకపోతే భారతదేశం ఖర్చు మీద ఎన్నో విదేశాలకు సాంకేతిక నిపుణులు దొరుకుచున్నారు. ఇది అందరికీ తెలిసినదే. దీనికి జవాబు ప్రభుత్వంవారివ్వాలి. శ్రీకృష్ణగారెక్కడా భారతదేశంలోని ముస్లిములను అమర్యాదన్నాలని అనలేదు. భారత ముస్లిములలో ప్రతి రెండవవారు వివాహం కోసం "పాకిస్తాను" వైపు చూడడాన్ని విమర్శించారంతే.

ఎంత మతాతీత రాజ్యమైనా [సమాజ కోసమైనా సరే] శత్రుదేశపు రాయబార కార్యాలయములోనికి పౌరుల ప్రవేశంపై కొన్ని ఆంక్షలు వుండటం అవసరం. ఇందువల్ల గూఢచారి కార్యకలాపములకు అవకాశం వుంటుంది. భారతీయ ముస్లిం లందరి చిత్తశుద్ధినీ ఎవరూ శంకించలేరు. చాగ్లాగారి లాంటి జాతీయ నాయకులకూ, అయూబ్ ఖాన్ లాంటి వీరసైనికులకూ కొదువలేదు. అయితే చైనా యుద్ధంలో మనదేశం నుంచి విమానంతో సహా పారి పోయి, పాకిస్తాను తరవున యుద్ధం చేయడానికి వచ్చిన వార్ని కూడా ఇక్కడ మనం గుర్తు పెట్టుకోవడం అవసరం.

భారతదేశంలోని ముస్లింలు కుక్కిన పేలలా వుంటారని నజీర్‌గారు భావించటం దురదృష్టకరం. మతోన్మాదం అనేది వుండాలే కాని కొన్ని వ్యాసాల వల్ల అణగారడం, రేకెత్తడం వంటివి జరగవు. ప్రస్తుత మతకలహాలకు తాత్కాలికోద్రేకము, అజ్ఞానమే కారణం. మతకలహాలు అనాదిగ వస్తున్నవి. వీనిని అధిగమించగలిగిన నాడే మతాతీత రాజ్యానికి మనుగడ. భారతీయులు తమ మత స్వాతంత్ర్యాన్ని గాని మరే స్వాతంత్ర్యాన్ని గాని దుర్వినియోగం చేయరని ఆశిద్దాము.

కుర్రే శేషగిరిరావు [శంఖవరం

* * *

17—7—70 సంచికలోని "శ్రీ కృష్ణ' న్యూఢిల్లీలేఖ చదివాక విజ్ఞుడైన పఠితకు ఆయన పాక్షికవైఖరికి, వక్రించిన విమర్శన దృష్టికి కోపం రాక తప్పదు.

దేశం ముందుకు పోతుంది, మనము పోవాలి మార్పు సహజం. కాలానుగుణ్యంగా అభిప్రాయాలు వైఖరులు మార్చుకోవాలి. ఆ లేఖ చదివాక ఆయన గారికి, భారతదేశంలోని నిమ్నజాతులపై, అల్ప సంఖ్యాక వర్గంపై ఆయనకు ఎంతటి నైచ్యభావం హీనభావముందో అర్థమవుతుంది. పెక్కు సంవత్సరములు ఆంధ్రసచిత్రవారపత్రిక అభిమాన పాఠకుడిగా నా అభిప్రాయమేమిటంటే, అది చాలామంది,మనస్సు కష్టపెడుతుందని. షానవాజుఖాన్ ఎంతమంది 'కసాయి వారిని రైల్వే కూలీలు'గా చేర్చారని వ్రాశారు. అది ఒప్పో, లేక తప్పో అదే శ్రీపూనాచాగారు లేక శ్రీ విజలింగప్పగారు చేసిఉండిఉంటే? షానవాజుఖాన్‌గారు కసాయివాడుగా పుట్టడం ఒక గొప్ప తప్పిదం. జగ్జీవన్ రాంగారు తన కులస్థులను ఎందరినో రైల్వేలోకి తోశారు అని వ్రాశారు. అది చదివే పాఠకులకు ఎంత మనస్సు కష్టం కలిగిస్తుందో గమనించారా? అలాగయితే శ్రీ కృష్ణ ఉద్దేశం ప్రకారం భారతదేశంలో, అగ్రజాతులు. అధిక వర్ణులు మాత్రమే పుట్టాలి, రైల్వే పని చెయ్యాలి.

విమర్శ అనేది ఆరోగ్యవంతంగా ఉండాలి. ఒక వస్తువును ఒకప్రక్కచూచి మాట్లాడ్డం తప్పు. హెచ్. జి. వెల్సు చెప్పినట్లు విమర్శకుడి దృష్టి ఎల్లప్పుడు తప్పుపైనే కేంద్రీకరింపబడగూడదు.

# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి

VIVA

ప్రొద్దున్న వివా త్రాగుతే...రోజంతా ఉత్సాహముగా ఉంటారు! మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో వివాలోని పూర్తి మీగడగల పాలు పుష్టివంతముగా చేయబడినవి.

రాత్రి వివా త్రాగుతే...రాత్రంగా గాఢముగా నిద్రపడుతుంది! వివా యొక్క పసందైన రుచి మరియు దానిలోని పోషకవంతమైన పదార్థములు స్నాయువులను బలపరుస్తాయి, నరములకు ఉపశమనమును కలిగిస్తాయి, కండరములకు సేదదేరుస్తాయి.

వివా సులభముగా జీర్ణమవుతుంది... రోగులకు మరియు రోగమునుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా సిఫార్సుచేయబడినది.

ఆరోగ్యమునకు త్రాగండి వివా!
నీళ్ళలో లేక పాలలో దాని రుచి అహా!

VIVA

ViVA
The Double Action Health Drink
FORTIFIES YOU FOR THE DAY
RELAXES YOU FOR THE NIGHT

భారతదేశములో తయారుచేయువారు:
జగత్ జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్,
జగత్ జిత్ నగర్, హమీర (పంజాబ్)

సోల్ సెల్లింగ్ ఏజెంటు:
హోమ్ ప్రోడక్ట్స్ మార్కెటింగ్ ఏజెన్సి.

నా ఉద్దేశంలో శ్రీకృష్ణగారి ధ్యేయమేమంటే, ప్రభుత్వం ఏం చేసినా, చెయ్యమనినా, అది చెడవని, మంచవని, విమర్శించటమేననుకుంటాను. ఇలాంటి విమర్శలు చదివే పఠితల నైతికవిలువలు దెబ్బతింటా యుంటంలో సందేహంలేదు.

వసంతకుమార్, [మద్రాసు]

*     *     *

17—7—70 సంచికలో శ్రీకృష్ణగారి లేఖ— 'అర్హతలేనివార్ని [షెడ్యూల్డు కులాలవార్ని] జగజీవన్‌రావ్, రైల్వేల్లో చేర్చటం వల్ల ఆ శాఖలో శిక్షణ బాగా దెబ్బ తిన్నది' అన్న శ్రీకృష్ణగారి విమర్శలో విజ్ఞత కనబడ్డంలేదు.

ఇటీవల పార్లమెంటులో దాఖలు చేసిన వివరాల ప్రకారం రైల్వేలో షె. కు. చెందిన రిజర్వేషన్‌లు పూర్తిగా భర్తీ కాలేదని తెలుస్తోంది. ఉదా. మొదటి తరగతి సర్వీసులో 1.6% రెండవ తరగతి సర్వీసులో 2.1% మాత్రమే షె. కు. ప్రాతినిధ్యం ఉంది. ఆయా ఉద్యోగాలకైనా, కనీస విద్యార్హతలు కలిగి, రాజ్యాంగబద్ధంగా, భర్తీ కాబడ్డవారేగాని, దొడ్డిత్రోవన ప్రవేశించిన వారుగాదు. కేవలం నూటికి నలుగురైదుగురు ప్రాతినిధ్యంగల షె. కు. వారి వల్లనే రైల్వేలో శిక్షణ లోపించిందని ఆరోపించి, వాపోవడం ఔచిత్యంగాదు.

షె. కులాలవారికి, కాగితాలమీద ఉన్న హక్కులు గ్యారంటీలు, నిర్మాణాత్మకంగా అమలు జరగటం లేదని, పార్లమెంటు సభ్యులు, అందుకు సంబంధించిన అధికార్లు పబ్లిగ్గానే ఒప్పుకుంటున్నారు. కాని దురదృష్టవశాత్తు, ప్రముఖ జర్నలిస్టు శ్రీకృష్ణగారి దృక్పథం షె. కు. విషయాల్లో యింత సంకోచంగా మారిపోవడం చాల శోచనీయం.

జనావళికి వెలుగు జూపే జర్నలిస్టుల రాతలు సమాజ ప్రగతికి దోహదం కావాలిగాని, ప్రతి ...కాలు కారాదు.

యం. వి. రమణ, [విశాఖ]

## నాటికల పోటీ

కోల్‌వెన్ను ఆర్ట్సు అకాడమి బెల్లంపల్లి వారి అధ్వర్యమున గత సంవత్సరములో వలెనే 'నాటిక' ఏకపాత్రాభినయ పోటీలు 1970 సం. సెప్టెంబరు ఆఖరి వారమున జరుపబడును. ఈ పోటీలు తెలంగాణా జిల్లాలలోని నాటక సమాజములకే పరిమితము, పారిశ్రామిక సంస్థల నుండి వచ్చు సమాజములకు ప్రాధాన్యత యివ్వబడును. తెలంగాణాలోని కార్మిక, యువజన, నాటకసమాజముల్ని ఇందులో పాల్గొని మాకృషి జయప్రదము గావించగలరని అభ్యర్థించుచున్నాము.

ప్రవేశ పత్రములకు, తదితర వివరములకు సెక్రెటరీ, కోల్‌వెన్ను ఆర్ట్సు అకాడమి, బెల్లంపల్లికి వ్రాయగలరు. ●

# ఉత్తరాలు

---



కుమారి ద్వివేదుల ఛాయారావు మిచిగన్ విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యాభ్యాసం కోసం ఆగస్టు 18వ తేదీ బయలుదేరి వెడతారు. ఈమె శ్రీ డి. ఎస్. రావు, శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి కుమార్తె. మదరాసులో ఎమ్. ఎస్. సి. డిగ్రీని కెమిస్ట్రీలో పుచ్చుకున్న కుమారి ఛాయారావు చిన్నప్పటినుంచీ విద్యాభ్యాసంలో ఉజ్వలమయిన మేధాశక్తిని ప్రదర్శిస్తూ వచ్చారు.

[ఒ. వి.]




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 7—8—'70
శ్రీసాధారణనామ సం॥ శ్రావణ మా॥ శుద్ధ పంచమి

సంపుటము : 63 సంచిక : 47

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక


రక్షించండి! రక్షించండి!
బియ్యం బస్తాలు
ఆంధ్ర రైతులు
రక్షించబడిన వాడు
బాదల్ మంత్రివర్గం
కొత్త కాంగ్రెస్
తమాషా చెయ్యకు యుద్ధం ఎదురుగా ఉంది
పాత కాంగ్రెస్
గొప్ప కలయిక
ఇప్పుడు నాకు ఒక గొడుగు అవసరమయ్యేలా వుంది

# విదేశాలలో భారతదేశం ప్రతిష్ఠ

భారతదేశానికి ఎన్నో దేశాలతో, అందులోనూ కమ్యూనిస్టు దేశాలతో, సాంస్కృతిక వ్యవహారాలకి సంబంధించిన ఒప్పందాలు ఉన్నాయి. నాట్యం, సంగీతం వచ్చిన వారు ఇతరదేశాలకి వెళ్లి తమ దేశం యొక్క కళాసంపదని చాటుతూ ఉంటారు. కాని, భారతదేశం పేరు ఎలా ఉందో ఆలోచించి గట్టి ప్రయత్నం ఏదయినా ఎవరయినా చేస్తున్నారా?

ప్రపంచంలో ఎక్కడ చూసినా భారతీయులంటే అసహ్యం, ద్వేషం. వారిని అన్నిదేశాల వారూ తరిమి వేస్తున్నారు. ఎందుకు? ఈ విషయం మీద విదేశాంగ వ్యవహారాలమంత్రిగారు ఒక పరిశీలన జరిపి, నివేదికని ఒకదానిని ఎందుకు ప్రచురించరాదు? బర్మా, సిలోన్, తూర్పు ఆఫ్రికా దేశాల ప్రగతికీ భారతదేశం నుంచి అక్కడికి వలస వెళ్లిన వారి కృషికీ ఎంతో సంబంధం ఉంది. అయినా ఆ దేశాల వారు అక్కడి భారతీయ జాతివారిని తరిమి వేస్తున్నారు. అతివేగంగా తరిమి వేస్తున్నారు కూడా!

## గాంధీరాష్ట్రం

తూర్పు ఆఫ్రికాలో స్థిరపడి ఉన్న భారత జాతి వారికి మూడు గత్యంతరాలు అక్కడి అధికారులు ఇచ్చారు—ఒకటి, తమ భారత పౌరత్వాన్ని నిలుపుకోనడం, రెండు, తూర్పు ఆఫ్రికా పౌరులు కావటం, మూడు, బ్రిటిషు పౌరులు కావటం. తూర్పు ఆఫ్రికాలో ఎందరో భారత జాతివారు మహాత్మాగాంధీ రాష్ట్రమయిన గుజరాతు నుంచి వచ్చిన వారే కాని వారు బ్రిటిష్ పౌరత్వం కోరుకుని తమ భారతదేశ భక్తిని రుజువు చేసుకున్నారు. ఇక భారత ప్రభుత్వం తూర్పు ఆఫ్రికా ప్రభుత్వంతో ఈ విషయమయి కనీసం నిరసన అయినా తెలిపిందా అంటే అదీలేదు. ఏమి చేసిందంటే బ్రిటిషు పాస్‌పోర్టులు ఉన్న భారత జాతి వారందరి బాధ్యతా బ్రిటిష్ ప్రభుత్వానిదే అని తప్పించుకుంది.

## భారతీయత

వాణిజ్యశాఖమంత్రిగా ఉంటున్నప్పుడు శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు విదేశీ సంస్థలలో 'భారతీయత' పెరగాలనే నినాదాన్ని లేవదీశారు. ప్రస్తుతం విదేశ బాంకులు, విదేశ విద్యాసంస్థలు, మతసంస్థలు, వైద్యసంస్థలకీ కూడా ఈ విధానాన్ని వర్తింప చేస్తున్నారు.

ఈ విధానం ప్రకారం—ఒక క్రయిస్తవ ఆసుపత్రిలో పని చేస్తున్న విదేశీ వైద్యుడికి 'వీసా' [దేశంలో ఉండేందుకు అనుమతి] దొరకాలంటే అదే పదవికి అర్హత ఉన్న భారతీయ డాక్టరు ఉండరాదు. నాలుగు దశాబ్దాలుగా భారతదేశంలో స్వార్థరహిత సేవ చేస్తున్న కొందరు స్విస్ డాక్టర్లకీ, సంఘ సేవకులకీ ఇక్కడ ఉండేందుకు వీలు లేకపోతోంది.

## బ్రిటిషుతత్వం

ఇదే రకం విధానం బ్రిటన్‌లో అనుసరిస్తే అది జాతివిచక్షణ అని గొడవ చేస్తారు. ఏ ఆసియా దేశమూ తన ఇల్లు చక్కబెట్టుకోలేదు కాని, బ్రిటన్‌ని వలస దేశంగా వాడుకోవాలని చూసే భారతీయులకి అడ్డంకులు ఉంటే మాత్రం భారత విదేశాంగ వ్యవహారాల శాఖవారు బెదిరింపులు ప్రారంభిస్తారు.

బ్రిటన్‌లో భారత జాతివారు ఏవిధంగా జీవిస్తున్నారో అక్కడి భారత రాయబార వర్గం వారు ఎప్పుడయినా పరిశీలించి, నివేదికని ఒకదానిని తయారు చేశారా?

## భారతీయ సంస్కృతి

బ్రిటన్‌లో బస్సు డ్రయివర్ల యూనిఫారమ్ ఒకటి ఉంది. భారత జాతికి చెందిన సిక్కులు బస్సు డ్రయివర్లుగా చేరి ఈ యూనిఫారమ్ పద్ధతులని మారుస్తామంటారు. తమ తలపాగాలు ఉండితీరాలంటారు. బ్రిటన్‌లో భారత రాయబార వర్గం వారూ, భారత జాతికి చెందిన ఇతరులూ ఈ రకం సిక్కులకి వంత పాడ్తారు. మాసిపోయిన పక్క చుట్టలతో బ్రిటన్‌కి విమానాలు ఎక్కి వెడుతున్న సిక్కులని ఈ విలేఖరి చూశాడు. వీరంతా భారతదేశం పేరుప్రతిష్ఠలని ఎంత బాగా కాపాడుతున్నారు? బ్రిటన్‌లో భారత జాతికి చెందిన పెద్దమనుష్యులు ఎలాగ బతుకుతున్నారో ఈ విలేఖరి కళ్లారా చూశాడు. భారతీయ సంస్కృతిని అనుసరించి చిన్నపిల్లలు రోడ్డు పక్కల మల విసర్జనానికి కూర్చోవటం చూశారు.

తన దేశాన్ని చక్కబెట్టుకునే హక్కు బ్రిటిష్ వారికి ఉందని భారతీయులు గుర్తించాలి. కాని, ఇక్కడ మనకి కావలసినది భారతదేశం ప్రతిష్ఠ ఎలాగ ఉన్నదీ, అన్న ప్రశ్నకి సమాధానం.

1969 లో 12,338 మంది భారతీయులని బ్రిటన్‌లోకి రానిచ్చారు. వీరిలో 4,467 మంది మగవారు; 3172 మంది ఆడవారు; 4699 మంది చిన్నపిల్లలు. 12,338 మందిలో 8286 మంది బ్రిటన్‌లో ఉంటున్న తమ కుటుంబ పోషకుల మీద ఆధారపడటంచేత అక్కడికి వెడుతున్న వారు, 1290 మంది ఇతర కారణాలచేత అక్కడికి వెళ్లేవారు.

కుటుంబ పోషకుడు బ్రిటన్‌లో ఉంటే అతని మీద ఆధారపడే వారికి బ్రిటన్ ప్రవేశించే హక్కు ఉంటుంది.

కొందరు బ్రిటన్‌లో వివాహం చేసుకుని స్థిరపోవటానికి వస్తారు. ఇది మరొక రకం వ్యక్తుల వర్గం.

## భారత రాయబారవర్గం

బ్రిటన్‌లో భారత రాయబారవర్గం చాలా పెద్దది. దీనికి చెందిన వారు కనీసం బ్రిటన్‌కి వచ్చే భారతీయులకి ఆదేశం యొక్క ఆచార వ్యవహారాలనయినా నేర్పటానికి ప్రయత్నిస్తున్నారా అంటే అదీ లేదు. వారు చేసేదల్లా భారతదేశ ప్రజల కర్చు మీద విలాసంగా బ్రతకటం.

బ్రిటన్‌లోకి ప్రవేశించాలంటే ఉద్యోగానికి వోచర్లు, పాస్‌పోర్టులు, మెడికల్ సర్టిఫికేట్లు మొదలయినవి కావాలి. వీటి ఉత్పత్తి ఒక లాభకరమయిన పరిశ్రమ అయిపోయింది. ఇవన్నీ దొంగతనంగా భారతదేశంలో అమ్ముడుపోతూ ఉంటాయి.

## వేళాకోళం

బ్రిటన్‌లో భారత జాతికి చెందిన కొందరు ఒక వారపత్రికని వెలువరిస్తూ ఉంటారు. దీనిలో బ్రిటిష్ వారిని వేళాకోళం చేస్తూ ఉంటారు. ఇటువంటి పత్రికని భారతదేశంలో విదేశాల వారు ప్రచురిస్తే ఇక్కడివారు ఊరుకుంటారా?

భారతదేశంలో ఉండే వారిలో అధికసంఖ్యాకులు ఎక్కడో కాఫీ, టీ తోటలలో కూలి చేసుకుని బ్రతుకుతున్నవారు కారు. భారతదేశం నేడు ఒక స్వతంత్ర దేశం. ఈ దేశ ప్రభుత్వం ఇకనయినా భారతదేశం ప్రతిష్ఠని కాపాడే చర్యలు తీసుకోవటం ఎంతో అవసరం.

## కొత్తప్రభుత్వం

ఈ జూన్‌లో బ్రిటన్‌లో కొత్త ప్రభుత్వం ఒకటి వచ్చింది. బ్రిటన్‌లో ఉండే వారందరికీ—జాతి విచక్షణ లేకుండా అన్నివిధాలయిన హక్కులనీ సమానంగా లభించేందుకు కృషి చెయ్యగలమని ఈ ప్రభుత్వంవారు వెల్లడించారు. బ్రిటన్‌కి వలస వచ్చేవారి పట్ల తమ విధానం ఎలాగ ఉండగలదో కూడా వివరించారు.

కొత్త ప్రధానమంత్రి శ్రీ ఎడ్వార్డ్ హెత్ జూలయి 2 వ తేదీనాడు ఇలాగ అన్నారు—

'వారి జాతి, వర్ణం, మతం ఏదయినా సరే— ఈ దేశంలో ఉండేవారందరికీ న్యాయం చేకూర్చటమే మా లక్ష్యం. ఆవేశాలు చెలరేగి, ఇక్కడికి వలస వచ్చిన వారికి భయం పుట్టకుండా ఉండేందుకు ప్రజలలో ఆందోళన లేకుండా ఉండేందుకు మేము కృషి చేస్తాము. ఇక్కడికి వచ్చి స్థిరపడిన వారు తమ మీద నిజంగా ఆధారపడేవారిని తెచ్చుకొనవచ్చు. వారికి ఎక్కడ ఉండాలని ఉంటే అక్కడే వాసం ఏర్పరుచుకొనవచ్చు.

'సాంఘికావసరాలు ఉన్నచోట ప్రత్యేక సదుపాయాలు కల్పించటానికి ప్రయత్నాలు చేస్తూనే ఉంటాము. వలస వచ్చినవారు ఎక్కువమంది ఉన్న చోట ఈ సదుపాయాలు మరింత అవసరం అని మేము గుర్తిస్తున్నాము.'

## శ్రీ మాడ్లింగ్ హామీ

హోమ్ సెక్రెటరీ శ్రీ రెజినాల్డ్ మాడ్లింగ్ జూలయిలో 3 వ తేదీనాడు పార్లమెంటులో మాట్లాడుతూ ఇలా అన్నారు—

'ఒకటేమిటంటే— మొదటి రకం, రెండవ రకం పౌరులు ఉండరాదు. విచక్షణ పనికిరాదు. ఈ దేశంలో ఉండే వారందరూ చట్టం ముందు సమానులే. ఈ దేశంలో నివసించే వారందరూ సాంఘికంగా కూడా సమాన హక్కులు కలిగి ఉండాలి.

'రెండవది ఏమిటంటే— పెద్ద సంఖ్యలలో బయటి వారు ఇక్కడికి వలస వచ్చి స్థిరపడినట్లయితే మనందరికీ, ఇక్కడ కొంతకాలంగా వచ్చి స్థిరపడిన వారితో సహా, మంచిది కాదు. లెక్కలు ఎలాగ ఉన్నప్పటికీ, కొన్నిచోట్ల వలస వచ్చేవారు గుమిగూడటం చేత ఆ చోట్లలో సమాజం స్వరూపమే మారిపోయి కొన్ని బాధలు, తీవ్ర పరిస్థితులు జనిస్తున్నాయి.

'మేము తీసుకు రాబోయే మార్పుల వల్ల ఇక్కడ ఉన్నవారికి కష్టం ఏమీ ఉండదు. వారు తమ భార్యలనీ, పిల్లలనీ తీసుకురావచ్చు. వెళ్ళిపోతామనే వారికి అన్నివిధాల సహాయమూ చేస్తాము. అయితే వారిని బలవంతంగా మాత్రం పెట్టివెయ్యము.

'ఇకముందు కొన్ని కట్టుదిట్టాలని ప్రవేశపెడ్తాము. పరిమితి లేకుండా విదేశీయులు రాకుండా కొన్ని కట్టుదిట్టాలు చేస్తాము.''

శ్రీ మాడ్లింగ్ తమ ప్రసంగంలో కొన్ని కొత్త నిబంధనలని గురించిన వివరాలు చెప్పారు. మొత్తం మీద తేలినది ఏమిటంటే, ఇకపయిన వలస వచ్చేవారి విషయంలో వర్ణానికి సంబంధించిన విచక్షణ మాత్రం ఉండదు. ●

# నాటకం ప్రారంభం!




పాత్రల వివరాలు :—

రాధ : కథానాయిక. కెప్టెను నానారావుగారి కుమార్తె.

శాంతమ్మ : కెప్టెను నానారావుగారి ద్వితీయం.

సీతారాం : కథానాయకుడు?

ప్రేమారావు : కెప్టెను నానారావుగారి ఇంట్లో ఆపనీ ఈపనీ చేసే కుర్రాడు.

కెప్టెన్ నానారావు : రిటైర్డ్ కెప్టెను. మతి స్థిమితం లేని మనిషి.

రాజశేఖరం : కథానాయకుడు?

పేరయ్యశాస్త్రి : పెళ్లిళ్ల పేరయ్య.

ఇంకా బేబీ లలిత, డాక్టరు, సింగినాథం, ఇన్‌స్పెక్టరు, ఇద్దరు పోలీసులు.

ఒ క టి

స్థలం : ఇంటి ఆవరణలో ఒక చిన్న గార్డెను పూలమొక్కలూ, క్రోటన్సూ, లతలతో చూడ ముచ్చటగా వుంటుంది.

[రాధ వచ్చింది. చేతిలో టెలిగ్రాం వుంది. చూసుకుని చూసుకుని మురిసిపోయింది. హాయిగా ఆనందంగా పాడుకుంది. చాటు నుంచి ప్రేమారావు ఆమెని కనిపెడుతూనే వున్నాడు. ఆమె ఆనందంలో పాలుపంచుకుంటూనే వున్నాడు.]

రాధ : [పాట]

కలలోన నెలరాజు కనిపించినటులాయెనే...
కనిపించి—మురిపించి నటులాయెనే— ॥కల॥
మనసు, వయసూ రెండు
కలసి మెలసిన చోట
మధురాలు వొలికాయిలే...
సుధలెన్నొ కురిశాయిలే ॥కల॥
వలపులో పులకింత
తలపులో గిలిగింత
వెలిగి చిగురించాయిలే..
తిరిగి కుసుమించాయిలే— ॥కల॥
అనురాగ జలధిలో
ఎన్నెన్నొ అందాలు
పరదాలు తొలిగాయిలే..
సరదాలు విరిశాయిలే— ॥కల॥
కోరికల తారకలు
కోరి దరి చేరాయి
హృదయ వీణియ పాడెనే..
మనసు వూయల లూగెనే— ॥కల॥
కలువ కన్నులలోని
కాంక్షలూరే చూపు
కమ్మగా నను పిలిచెనే..
రమ్మనీ నను తలచెనే..
రారమ్మనీ నను కొలచెనే— ॥కల॥

ప్రేమారావు : [చాటు నుంచి వచ్చాడు] అమ్మా..!

రాధ : [మధురోహల్లో నుంచే] వూ...

ప్రేమారావు : అమ్మా, రాధమ్మ తల్లీ..!

రాధ : [తేరుకుంది, వులిక్కిపడింది] ఆ..ఆ.. ఏం మాణిక్యం..?

ప్రేమారావు : [ఆమె కలవరాన్ని గుర్తించాడు. ఆనందంగా నవ్వాడు] అమ్మా.. రాధమ్మా.. తస్సారవలా, శంద్రుణ్ని సూసినంత ఆనందంగా వుందమ్మా నాకిప్పుడు...

రాధ : ఏం.., ఇప్పుడేం జరిగింది? ఎందుకంత ఆనందం..?

ప్రేమారావు : తస్సారవలా.., రాధమ్మగోరు నాకే మస్కా యేస్తున్నారు.. కనిపెట్టేశాను లేండమ్మా.. కనిపెట్టేశాను..

[టెలిగ్రాం వైపు దృష్టి సారించాడు.]

రాధ : వో..ఇదా..? ఇదీ..ఇదీ..

ప్రేమారావు పోనీలెండమ్మా.. అది ఏదయినా పరవాలేద .. మీ ముకంలో సంతోసం సూడగల్గాను.. అంతే సాలు.. తస్సారవలా.. నా జనమ పావనమై పోయిందనుకోండి..

రాధ : నా మీద నీ అభిమానం అలా అనిపిస్తోంది. ఎందుకు మాణిక్యం, నేనంటే నీకింత అభిమానం..?

ప్రేమారావు : పున్నెమమ్మా..పున్నెం.. పూర్వజనమంలో నేను సేసుకున్న పున్నెం. తస్సారవలా, ఏ గడియలో మీయింట్లో అడుగెట్టానోగాని, నన్ను మీలో వొకణ్నిగా కలిపేసుకున్నారు..ఇది పున్నెం కాకపోతే యేంది సెప్పండి.. సినిమాల్లో యేసాలకని నేను రావడమేంటి? ఆపెయత్నాలే లేకుండా మీయింటో వుండిపోవడమేంటి? వో సంగతి సెప్పనా రాధమ్మతల్లీ.. నాకూ మీలాంటి సెల్లెలే వుండేదమ్మా..మిమ్మల్ని సూత్తా వుంటే అదే కన్నుల్లో మెదుల్తా వుంటాది. మిమ్మల్ని యిడిసిపెట్టి యెక్కడికీ యెల్ల బుద్దే పుట్టదమ్మా.. మీరు నమ్మినాసరే నమ్మకపోయినా సరే.. పాపగోరూ మీరూ యిద్దరూ నా పేణాలమ్మా.. నా పేణాలు..

రాధ : కృతజ్ఞతగా నవ్వుతూ చూసింది.

ప్రేమారావు : తస్సారవలా, అదే..అదే.., మీరలా నవ్వుతూనే వుండాలమ్మా.. కలకాలం నవ్వుతూ వుండాలి. ఆముఖంలో ఆనవ్వు అలాగే నిలవాలి. ఎంత కాలానికి సూశానమ్మా ఆ నవ్వు..!

రాధ : అవును, నిజమే మాణిక్యం.. ఇవ్వేళ నా జీవితంలో వసంతోదయమైన పర్వదినం. ఆనందం తొలకరి జల్లులా కురిసి నన్ను మైమరిపిస్తోంది. ఆ మైమరపులో నన్ను నేనే మరచిపోతున్నాను.. [తన్మయురాలైంది]

ప్రేమారావు : ఏందమ్మా ఆ సంతోసమైన యిసయం..? నా సెవిన కూడా యెయ్యండి..నేనూ సంతోసిస్తాను..

రాధ : ఆ.. నువ్వే తెలుసుకొంటావులే.. కొంచెం వోపిక పట్టు..

ప్రేమారావు : అమ్మబాబో, నేను వోపలేనమ్మా. ఆ యిసయమేమిటో నాకు సెప్పితీరాలి. నేనిప్పుడే తెలుసుకోవాలి.

రాధ : తలంపే వుక్కిరిబిక్కిరి చేస్తున్న ఈ సమయంలో నీకేమని చెప్పను..? ఎలా చెప్పను..? [సిగ్గు పడుతుంది]

ప్రేమారావు : పోనీలెండమ్మా.. మీరు సెప్పకపోతే పోనీలెండి.. నేనే సదువుకుంటా. ఏదీ.. ఆ టెలిగ్రాం ఇలా యియ్యండి..

[రాధ తప్పించుకున్నా వీలులేకుండా—తెలివిగా టెలిగ్రాంని చేజిక్కించుకుంటాడు.]

రాధ : [తీసుకునే ప్రయత్నంలో] మాణిక్యం.. మాణిక్యం.. ఏదీ, ఆ టెలిగ్రాం యిలా యియ్యి.. ఇలా తే..ప్లీస్.. మాబాబు కదూ..నామాట విను.. అది చదవకు..

ప్రేమారావు : అయితే నన్ను మాణిక్యమని పిలవకుండా వుంటారా? ప్రేమారావని పిలుత్తారా.. ఇంకెప్పుడూ మాణిక్యమూ అని పిలవరుగందా..

రాధ: సరే, అలాగేలే.. ముందా టెలిగ్రామిలా ఇయ్యి.. ఇయ్యి..

ప్రేమారావు : మాణిక్యమని పిలవనని..ప్రేమారావూ అని పిలుత్తానని మాటివ్వండి మరి.. సినిమాలో యాసాలోస్తాయిగందా అని సక్కంగా ప్రేమారావూ అని పేరెట్టుకుంటే తస్సారవలా ఆ పేరుని కాస్తా మాణిక్యం సేసేశారు మీరు.. తెలీనోళ్ళు యామనుకుంటారు? ఇదేంట్రా ఆడంగోరి పేరూ అనుకోరూ? ఎన్నిసార్లు సెప్పినా మీరు యినుకోరు. తస్సారవలా..ఇప్పుడు దొరికారు అమ్మాయిగోరు.., సెప్పండి.. నన్ను ప్రేమారావూ అని పిలుస్తారు గందా?

రాధ : పిలుస్తానన్నానుగా.. ఏదీ, ఆ టెలిగ్రాం ఇలా ఇయ్యి..

ప్రేమారావు : నిజంగా పిలుస్తారా..?

రాధ : నిజంగా..

ప్రేమారావు : ఇదో అమ్మాయిగోరూ.. తిరిగి పోకూడదు మరి..

రాధ : సరే..

ప్రేమారావు : [టెలిగ్రాం తిరిగి ఇచ్చేశాడు]

రాధ : [పుచ్చుకుని గేలి చేసింది] వోయ్ వోయ్ మాణిక్యం.. మాణిక్యం..!, మాణిక్యం..మాణిక్యం..!

ప్రేమారావు : అరి తస్సారవల గొట్టా..! ఆ.. అమ్మాయిగోరి సంగతి నాకు ముందుగానే తెలుసు.. టెలిగ్రామం నేను సదవలేదనుకున్నారేంటి? ఇస్టార్టింగ్..టుమారో.. రాధాపతీ.. రాధపతీ.. రాధాపతీ.. రాధపతీ.. రాధాపతీ..[పాటలాగా పాడాడు]

రాధ : అయితే నువు 'టెలిగ్రాం చదివేశావా..?

ప్రేమారావు : ఏం..? సదవ లేననుకున్నారా..? ఏ సంగతి నాక తెలుసునమ్మా.. నాకు తెలుసు. అమ్మా..ఎవరమ్మా యీ రాధాపతి..?

రాధ: [మాట్లాడదు. సిగ్గుపడుతుంది]

ప్రేమారావు :తస్సారవలా.. మీరు సెప్పక్కర్లేదు లెండమ్మా.. నాకు అంతా తెలిసిపోయిందిలెండి.. రాధాపతీ అంటే రాధమ్మగోరి పతిగోరు! అమ్మా.. ఆయనగోరి అసల పేరూ అదేనామ్మా..?

రాధ : ఫో మాణిక్యం...

ప్రేమారావు పోతానులెండమ్మా.. పోతాను లెండి.. తస్సారవలా.. మా రాధాపతిగోరు రానివ్వండి! మరీ.. రాధాపతిగోరు.. [ఏదో అడగబోయాడు]

రాధ : అబ్బబ్బా.. ఆయన పేరు రాధాపతికాదు. ఆయన అసలు పేరదికాదు. వట్టినే అలా అంటుంటారు. నువ్వలా అనకు. నాకు సిగ్గేస్తుంది..

ప్రేమారావు : వూఁ..అద్దదీ..! అద్దదీ సంగతి.., మరి, ఆ రాధాపతిగారి అసలు పేరేంటండమ్మా..?

రాధ : నేను చెప్పను ఫో..

సాంతమ్మ : [లోపలి నుంచే పిలిచింది] వోరి మాణిక్యం.. వోరి మాణిక్యం..!



రాధ : అదిగో అమ్మ పిలుస్తోంది.

ప్రేమారావు : ఆ.., వత్తున్నానరండమ్మా.. [వెళ్ళబోతాడు]

రాధ : మాణిక్యం.. ఈ సంగతి అమ్మకిగాని చెప్పకే..?

ప్రేమారావు : ఏం..? సెబితే ఏమండమ్మా..?

రాధ : వద్దు. అప్పుడే చెప్పొద్దు. ఆయన్నిరానీ.. ఒకేసారిగా వాళ్ళే తెలుసుకుంటారు.

ప్రేమారావు : తస్సారవలా.. అవిడియా..బావుంది సుమండీ.. [వెళ్ళబోయాడు]

రాధ : ఆ.. మాణిక్యం.. ఇప్పుడు నాన్న ఏం చేస్తున్నారు?

ప్రేమారావు : ఏం జేస్తారు? మామూలే. సెయినావోళ్ళు వచ్చేత్తున్నారంట. యుద్ధానికి సిద్ధమవుతున్నారు. లలితమ్మగోరు కూడా ఆడనే కూసుని ఆడుకుంటున్నారు.

రాధ : [దిగులుగా నిట్టూర్చింది] వూఁ..

ప్రేమారావు : ప్చ్.. మీకట్టసుకాన్ని సూసే బాగ్గెం మీ అయ్యగోరికి లేదమ్మా..యుద్ధాలా—యిమానాలా— సయిన్యాలా ఇదే ఆయన లోకం.. పాపం..! ఆయన గోర్ని తలుసుకుంటుంటే గుండె సెరువై పోద్ది తల్లీ..!

శాంతమ్మ : [లోపలినుండే మళ్ళీ పిలిచింది] వోరి మాణిక్యం.. వోరి మాణిక్యం..!

ప్రేమారావు : వోరి బాబోయ్.. శాంతమ్మగోరు.. [గట్టిగా] వచ్చేత్తున్నా నమ్మా వచ్చేత్తున్నా. [రాధతో] అమ్మా.. మీరే నయం.. మంచిగా మాణిక్యమూ అంటారు. అదిగో, ఆ మహాతల్లయితే.. వోరి మాణిక్యం.. వోరి మాణిక్యం.. అని గుండెలవిసేలా అరుస్తాది..

రాధ : ఏమిటా ఈసడింపు..పెద్దా చిన్నా లేకుండా.

ప్రేమారావు : మరేంటండమ్మగోరూ..సక్కగా ప్రేమారావూ అని పేరెట్టుకుంటే వోరి మాణిక్యం.. బోడి మాణిక్యం ఏంటి? మీయమ్మగోరు పేరుకి శాంతమ్మగోరుగాని.. అంత గయ్యాళోరిని నేనెక్కడా సూళ్ళేదు తల్లీ.. తస్సారవలా..మీయినయం సెప్పండి.. మిమ్మల్నెలా సూత్తన్నారు..? ఈ ఆస్తంతా మీది.. ఈ డబ్బంతా మీది.. మీకు పెళ్లిసేసి యింట్లోంచి యెంటనే పంపెయ్యాలనుకోడం లేదు.. ఎంతయినా సవితితల్లి సవితితల్లేనండమ్మా..

రాధ : నువ్విలా వాగుతూనే వుండు. అమ్మ సరాసరి.. యిక్కడికే వచ్చేస్తుంది.

శాంతమ్మ: [లోపలి నుంచే] వోరి మాణిక్యం.. ఎక్కడ తగులడ్డావురా..?

ప్రేమారావు : ఇదుగోనమ్మా బోడి మాణిక్యం.. ఇప్పుడే వచ్చేత్తున్నాడు. [నెత్తి కొట్టుకుని..] కర్మ.. [వెళ్ళిపోయాడు]

రాధ: [టెలిగ్రాంని మళ్ళీ మళ్ళీ చదువుకుంటూ మధురోహల్లోకి వెళ్ళిపోయింది.]

[తెర]

## రెండు

**స్థలం : కెప్టెను నానారావుగారి భవంతిలో**
**హాలు.**

[మేడ మెట్లు, బీరువా, బుక్‌షెల్ఫ్, పడక్కుర్చీ, సోఫాలు, కుర్చీలు, టెలిఫోన్, రేడియో మొదలైన సామగ్రి వుంటుంది. సామాను పాతకాలపుదయినా విలువగా అంతస్థుకు తగినట్టుగా అలంకరింపబడి వుంటుంది.

తెర లేచేసరికి కెప్టెను నానారావు ఒక్కడూ ఒక్కపక్కగా పడక్కుర్చీలో కూర్చుని వుంటాడు. అతనికి ఎవరి ప్రసక్తీ వుండదు. వూహాలోకంలో తేలిపోతూ అప్పుడప్పుడు గాలితో యుద్ధాలు చేస్తూ వుంటాడు.]

[మేడ మెట్లు దిగి వస్తూ]

**శాంతమ్మ : వోరి మాణిక్యం.. వోరి మాణిక్యం...**

**[హడావిడిగా తిరుగుతూ కేకేసింది]**

ప్రేమారావు : [పరుగెత్తుకొచ్చాడు] ఇడుగో నమ్మా.. మీ వోరి మాణిక్యం హాజరు. చెప్పండి.. ఏం చెయ్యమంటారు.. సోఫాకవర్లు మార్చేశాను.. అయ్యగోరికి కాఫీ యిచ్చేశాను.. కారును రమ్మన్నాను.. డ్రయివర్ని కడిగేశాను..

శాంతమ్మ : వోరి నీ అసాధ్యం కూలా.. కారుని రమ్మని డ్రయివర్ని కడిగేశావా..? కారుని కడిగేసి డ్రయివర్ని రమ్మన్నావా?

ప్రేమారావు : అదేనమ్మా.. అదే.. కారుని రమ్మనీ డ్రయివర్ని కడిగేశాను.. అబ్బెబ్బె..డ్రయివర్ని కడిగేసి.. కారుని రమ్మన్నాను..అహ..కారుని రమ్మనీ..

శాంతమ్మ : అఘోరించావులే, నోరు మూసుకో. పెళ్ళోరొస్తున్నట్టు తెలుసు కదా! ఆ పేరయ్య యింకా తగులబడ లేదేమిటి? ఇంతకీ పెళ్ళో రొస్తున్నట్టా లేనట్టా..

ప్రేమారావు : ఎట్టా..? పెళ్ళోరా..? అరి తస్సారవలా..! పెళ్ళోరేమిటమ్మగోరూ.. యవరికి పెళ్ళోరు..?

శాంతమ్మ: ఎవరికా..? నాకు..! నాకురా వాజెమ్మా నాకు..! పోయి చెప్పిన పని తగులడు..

ప్రేమారావు : తస్సారవలా.. మాటడిగితే ఏం దమ్మా.. అంత కోప్పడిపోతారు?

శాంతమ్మ : లేకపోతే యేమిట్రా.. అవతల— అమ్మాయిని చూసుకోడానికి పెళ్ళోరొస్తున్నారని పేరయ్యశాస్త్రి చెప్పిపోయాడయ్యె.. రాత్రికో వస్తానని చెప్పి.. యిప్పటికి అయిపూ అడ్రస్సూ లేదు..

ప్రేమారావు : అదా యిసయం..? అమ్మాయి గోరిని సూసుకోడానికా? అమ్మా..ఈ యిసయం.. దొరసానిగోరికి తెలుసామ్మా..?

శాంతమ్మ : మధ్య దానిసెత్తన మేమిట్రా.. పెద్దవాళ్ళం మేముండగా.. అయినా, మధ్యలో నీ వోడి ప్రశ్నలేమిటి చెప్పిన పని చెయ్యక..?

ప్రేమారావు : తస్సారవలా.., మీ హడావిడేగాని.. యింతదాకా నాకు మీరు పనే సెప్పలేదు.. ఏం. పని సెయ్యను..? ఎలా సెయ్యను. ?

శాంతమ్మ : అవును కదూ.., నీకు పనే చెప్పలేదు.

# పద్మవ్యూహం

ఏదో చెబుదామని పిలిచాను. నీ వెధవ కబుర్లలో పడి ఎందుకు పిల్చానో మర్చిపోయాను. దిక్కుమాలిన పెళ్ళిళ్ళు.. ఈ చూసుకోవడాలూ పూసుకోవడాలూ మా రోజుల్లో వుండేవి గనకనా..? ఎప్పుడూ ఎరగని వ్యవహారాలయ్యె..మతిమరపు రాదూ..? రాకేం చేస్తుంది?

ప్రేమారావు: అవునండమ్మగోరూ.. అవునవును. తస్సారవలా.. యెనకటికి మా అవ్వ పెళ్ళికోసారి..

శాంతమ్మ : ఏడ్మావులే.. నీ అవ్వ పెళ్ళి మవు చూడొచ్చావుగాని.. చెప్పింది చెయ్యి..

ప్రేమారావు : ఏం చెయ్యమన్నారో చెప్పనేలేదు, మరి...

శాంతమ్మ : అవును కదూ..చెప్పనేలేదు..ఎప్పుడూ ఎరగాపెట్టని వ్యవహారం.., చెప్పొద్దూ.. పెళ్ళికొడుకు చూసుకోడానికి వస్తున్నాడంటే నాకే కంగారు పుడుతోంది.

ప్రేమారావు : మీకు కంగారెందుకండమ్మ గోరూ.., తస్సారవలా— పెళ్ళికొడుగ్గారు మిమ్మల్ని సూడ్డానికొస్తున్నట్టుగా మాట్టాడుతున్నారే.?

శాంతమ్మ : వోరి నీ అసాధ్యం కూలా.., ఎన్ని మాటలు నేర్చావురా..? ఇంతకీ నే చెప్పిన పని చేసేదుందా లేదా?.

ప్రేమారావు : అరి తస్సారవలా.. ఏదీ, పెళ్ళికొడుకు సూడ్డానికొస్తున్నాడని మీరు వో కంగారు పడిపోతున్నారా..? ఇంక నాకు మీరు పని సెప్పిందెప్పుడూ అంట?

శాంతమ్మ : అవును.. చెప్పలేదు కదూ..? వుండు వోసారి లోపలి కెళ్ళి వస్తా..అప్పుడయినా జ్ఞాపక మొస్తుందేమో..! [వెళ్ళింది]

ప్రేమారావు : [నవ్వుతూ ఆమె వెళ్ళిన వైపే చూశాడు. తర్వాత ఆ పక్కనే సణుక్కుంటూ కూర్చున్న కెప్టెను నానారావును చూశాడు]

కె. నానారావు : యుద్ధం వచ్చేసింది.. వచ్చేసింది యుద్ధం.. అదిగో విమానాలు..అవిగో శత్రుసైన్యాలు వస్తున్నాయి.. వచ్చేస్తున్నాయి..

ప్రేమారావు : వూ..! తస్సారవలా, అయ్యగోరు యుద్ధానికి సిద్ధమవుతున్నారు.. వచ్చేస్తది.. నాకు పిలుపొచ్చేస్తది.. నేను సిద్ధంగా వుండాల..

[బయట నుంచి పేరయ్యశాస్త్రి పిలిచాడు]

పేరయ్యశాస్త్రి : అమ్మగారూ.. శాంతమ్మ గారూ..

ప్రేమారావు : అరి తస్సారవలా.. పిలుపొస్తదంటే.. మాటలోనే పిలిశారే..? పేరయ్యశాస్త్రులు గోరయ్యుంటారు..రానీ సెప్తా..[గట్టిగా] ఎవరదీ.? వస్తన్నా.. వస్తన్నా.. అలా గట్టిగా బాదకండి, తలుపుల బద్దలైపోతాయి..

[తలుపులు తీశాడు]

పే.శాస్త్రి: [వచ్చాడు] అమ్మగారు లేరూ...?

ప్రేమారావు : వున్నారున్నారు . పెళ్ళికొడుగ్గారు సూడ్డానికొస్తారని శాంతమ్మగారు వో కంగారు, పడిపోతున్నారు.. పెళ్ళికొడుగ్గారు మీరేనా...?రండి.. రండి.. కూర్చోండి.. మంచినీళ్ళు కావాలా..? మజ్జిగ కావాలా?

పే.శాస్త్రి : [తెల్లబోయాడు] వోరి నీ యిల్లు బంగారం కానూ.. మూడు పెళ్ళిళ్ళయాయి.. నేను పెళ్ళికొడుకు నేమిటయ్యా.. అన్నమాటా వున్నమాటే.. నాకు తెలియకడుగుతానూ.. పెళ్ళికొడుకు వస్తున్నాడంటే శాంతమ్మ గారెందుకు కంగారుపడాలి..?

ప్రేమారావు : అద్గదీ అసలు సంగతి.. అదే నేనడిగాను.. తస్సారవలా అడిగితే అంటారుగందా..

శాంతమ్మ : [లోపలి నుంచి] వోరి మాణిక్యం.. వోరి మాణిక్యం..

ప్రేమారావు : అమ్మా.. అమ్మా.. యిక్కడే వున్నాను. పెళ్ళికొడుగ్గారు వొస్తేను..మరీ..మరీ..

శాంతమ్మ : [హడావిడిగా వచ్చేసింది] ఏరీ ఏరీ.. పెళ్ళికొడుగ్గారు వచ్చేశారా..? ఎక్కడా..?

ప్రేమారావు : ఇదుగో.. [పేరయ్యశాస్త్రిని చూపించాడు]

శాంతమ్మ : వోరి నీ వేళాకోళం మండిపోనూ.. సమయం సందర్భం వుండక్కర్లే..

ప్రేమారావు : అరి తస్సారవలా.. మరిగంటే నాకేం తెల్సునండీ.. కామోసు అనుకున్నా.. పెళ్ళికొడుగ్గారు మీరేనా అని అడిగానండీ.. మూడు పెళ్ళిళ్ళయినాయన్నారండీ.. ఇంక నాలుగో పెళ్ళికి లోటేంటండి..?అందుకే గామోసు అనుకున్నానండీ..

శాంతమ్మ: అఘోరించావులే..చెప్పిన పని తగులడు

ప్రేమారావు : చెప్పిన పనా? పని చెప్పలేదండమ్మా..

శాంతమ్మ : అవును చెప్పలేదు కదూ..? ఆ.. [ఆలోచించింది. జ్ఞాపకం రాలేదు..] సరేవుండు.. తర్వాత చెప్తా.. ఏం శాస్త్రులుగారూ.. పెళ్ళికొడుకు ఎప్పుడు వస్తున్నట్టు..?

పే.శాస్త్రి : [నానుస్తూ] ఏమోనమ్మా... ఆ సమాచారం నాకు తెలీకే.. మీకేమన్నా తెలిసిందేమోనని..

శాంతమ్మ : ఏడ్చినట్టుగా వుంది పంతులుగారూ, సంబంధం తీసుకొచ్చింది మీరా? నేనా? పెళ్ళికొడుకు విషయం మీకు తెలియకుండా ముందు నాకెలా తెలుస్తుందనుకున్నారూ..?

పే. శాస్త్రి: అవునండమ్మా.. అవును మీరన్న మాటా వున్నమాటే..!

శాంతమ్మ : ఏమిటా అన్నమాటా వున్నమాటా? పెళ్ళికొడుకు అసలు వస్తున్నట్లా లేనా?

పే.శాస్త్రి :అమ్మమ్మా.. వస్తాడమ్మా వస్తాడు. పెద్ద బిజినెస్ వ్యాపారి కదండీ మరి.. ఏదో చిక్కొచ్చుంటుంది. అన్నమాటా వున్నమాటే. అనుకున్న టైముకి రాలేకపోయాడు.

శాంతమ్మ : ఎన్ని చిక్కులొచ్చినా పెళ్ళిచూపులు మానుకుంటారంటండీ?

ప్రేమారావు : అవును. యివతల అమ్మగోరు వో కంగారు పడిపోతుంటేను?

శాంతమ్మ : వోరే మాణిక్యం.. నువు కాస్సేపు నోరు మూసుకో..

పే.శాస్త్రి : నాతోటి చెప్పారమ్మా.. వస్తాననే చెప్పేరు. ఇపాటికి రావాల్సిందేనే మరి..?

# సహజ సౌందర్యముతో కనపడుటకు



## ఆశా
## సౌందర్య సాధనలు







క్రొత్త ఫార్ములాతో చేయబడిన ఆశా ఫేస్ పౌడరు మీ ముఖ వర్చస్సుయొక్క సహజ సౌందర్యమునకు మెరుగులు దిద్దుతుంది. మీ ముఖము గంటల కొలది అందముగా ఉంటుంది. నేచురల్, రేచెల్, పీచ్ మరియు తెలుపు, నాలుగు దివ్యమైన ఛాయలలో లభిస్తున్న వాటి నుండి మీ వర్చస్సుకు సరిపోయే దానిని ఎంచుకోండి.

మీ ముఖము తాజాగా, మృదువుగా మరియు అందముగా ఉండుటకు ఆశా వ్యానిషింగ్ క్రీమును వాడండి. మీరు సహజ సౌందర్యముతో కనపడుటకు పౌడరును అద్దుకొనే ముందు రాసుకొనుటకు యిది దివ్యముగా ఉంటుంది.

ఆశా కాటుక మీ చక్కని కండ్లకు చల్లదనమును, విశ్రాంతిని యిస్తుంది.

మీ అలంకరణను ఆశా కుంకుమతో పూర్తి చేయండి. ఇది ద్రవరూపములో లేక ముద్దగా, మూడు వివిధ రంగులలో లభిస్తోంది.

# పద్మవ్యూహం

శాంతమ్మ : చూడండి, ఈ నసుగుడు వ్యవహారాలు; మనకొద్దు. ఆ పెళ్ళికొడుకు కాకపోతే మరొకడు మరొకడు. కెప్టెన్ నానారావుగారి అమ్మాయి కోసమని చెప్పండి, పెళ్ళికొడుకులంతా ఫర్లాంగు దూరం క్యూలో నిలబడతారు..

పే.శాస్త్రి : అన్నమాటా వున్నమాటే.. అలాగే నండమ్మా.. ఈ వ్యవహారమేదో చూసి మీరన్నట్టే కానిద్దాం.. [ముక్కుపొడుం పట్టాడు. ప్రేమారావు కిసుక్కున నవ్వాడు.]

శాంతమ్మ : [ప్రేమారావుతో] నువ్వింకా ఇక్కడే నిలబడిపోయావేం..? అవును కదూ.. పని చెప్పనే లేదు కదూ.. ఆ.. కూర్చోండి పేరయ్య శాస్త్రిగారు.. కాస్త మజ్జిగ దాహం పుచ్చుకు వెళ్దురు గాని..

పే.శాస్త్రి : అన్నమాటా వున్నమాటే.. ఎంత మాట.. ఎంతమాట [కూర్చున్నాడు]

శాంతమ్మ : [వెళ్ళింది. లోపలి నుంచి పిలిచింది] ఓరి మాణిక్యం.. ఓరి మాణిక్యం...

ప్రేమారావు : ఆ... వస్తున్నానండమ్మా.. [వెళ్ళాడు.]

[పేరయ్యశాస్త్రి ఒంటరిగా మిగిలాడు. అంతా నిశ్శబ్దంగా వుంది. కెప్టెన్ నానారావుని చూశాడు. కెప్టెన్ నానారావు తనలో తానే ఏవేవో మాట్లాడు కుంటున్నాడు.. ఏవేవో సంజ్ఞలు చేస్తున్నాడు.. పేరయ్యశాస్త్రికి చెమటలు కంగారెత్తించాయి. అలానే బిక్కుబిక్కుమంటూ చూస్తూ, కూర్చున్నాడు. ఒంటరితనం భయాన్ని ఎక్కువ చేస్తోంది]

కె. నానారావు : పచ్చని సంసారంలో నిప్పు పెట్టడం కోసం.. పచ్చని భారతదేశాన్ని కబళించడం కోసం వచ్చేస్తున్నాయి... వచ్చేస్తున్నాయి. శత్రు సైన్యాలు వచ్చేస్తున్నాయి.. ఓ భారత వీరుల్లారా.. భావిభారత పౌరుల్లారా.. లేవండి.. అంతా లేవండి.. యుద్ధానికి సిద్ధమవండి.. శత్రువుల్ని చంపండి.. నరకండి.. చెండాడండి.. జై భారత్..జై భారత్.. జై జవాన్ జై కిసాన్..

పే.శాస్త్రి : [అదిరిపడి లేచిపోయాడు. నఖశిఖ పర్యంతం వణికిపోతున్నాడు. వళ్ళంతా చెమట పట్టేసింది]

ప్రేమారావు : [వచ్చాడు. అతని చేతిలో మజ్జిగ గ్లాసు వుంది.] అరె తస్సారవలా, అదేంటండి అలా అయిపోతున్నారు... ఇదిగో ఈ మజ్జిగ తీసుకోండి..

పే. శాస్త్రి : [వణుకుతూ తీసుకున్నాడు. గడ గడ తాగేశాడు] అన్నమాటా వున్నమాటే.. మవ్వొచ్చావ్ కాస్త ప్రాణం కుదుటబడింది. [ప్రేమారావుని పక్కకి తీసుకెళ్ళాడు. రహస్యంగా] పాపం.. ఈయనెప్పుడూ ఇంతేనా?

ప్రేమారావు : ఇందులో రహస్యాలు లేవు శాస్త్రులుగోరూ..మీరు మామూల్గానే మాటా డెయ్యొచ్చు. మనమేం మాట్లాడుకుంటున్నా కెప్టెను దొరగోరికి తెలవదు. ఆయన లోకమే ఆయనది. ఎంతసేపూ యుద్ధమూ—సైన్యమూ. ఇదే ఆయన లోకం. అయితే అస్తమానం అంతే అనుకోకండి.., ఒకోసారి అకస్మాత్తుగా మన లోకంలో కొచ్చేస్తారు. వచ్చినప్పుడు, తస్సారవల గొట్టా.. ఆయనగోరు కెప్టెను గిరీలో ఎలా వుండే వారో అచ్చు అలాగే వుంటారు.. అప్పుడు మన పని తా. గుండెలు బేజారెత్తి పోవాల్సిందే!

పే. శాస్త్రి : అన్నమాటా వున్నమాటే. . . . చెప్పొద్దూ. . . ., చూస్తుంటేనే తెలుస్తోంది. కెప్టెను నానారావుగారిపేరు చెబితే ఆ రోజుల్లో ఎక్కడిడెక్కడి వాళ్ళూ హడిలి చచ్చేవాళ్ళు. రెండో ప్రపంచ సంగ్రామం దగ్గర్నుంచి చైనా యుద్ధం దాకా— అంతా ఆయన చేతులమీదే నడిచిందని ప్రతీతి. ఇప్పుడంటే ఇలా అయిపోయారు గాని. . . ఆయన ఠీవి. . . . ఆయన దర్పం. . . . మరెవరి కొస్తాయిూ. . . . .?

ప్రేమారావు : ఇప్పుడు మాత్రం ఏం పోయిందీ, అంట? తస్సారవలా. . . . కాలుమీద కాలేసుకు కూకుంటే కాలం గడిచిపోద్ది. . . . ఆరికేమండ, మహారాజులు. . . . . ..

పే.శాస్త్రి : అన్నమాటా వున్నమాటే. లక్షల ఆస్తి. . . . . చెక్కు చెదరని వంశ గౌరవం. . . . ఆయన కట్టించిన అనాధ శరణాలయాలూ. . . . గుడి గోపురాలూ. . . . . . ఇవే ఆయన గొప్ప తనాన్ని నేటికీ చాటిచెబుతున్నాయి. ఈ రోజున మన నగరం ఇలా వుంది అంటే అందుకు కారణం ఆయనే గదా. . . . . . ?

ప్రేమారావు : అవునవును. అన్నమాటా వున్న మాటే! ఆయన హయాములో ఆయనగారిపేరు ఎంతగా మోగిపోయిందో— తస్సారవలా, ఇప్పుడా శాంతమ్మగోరి పేరు అంతగానూ మారుమోగి పోతోంది.

పే.శాస్త్రి : అన్నమాటా వున్నమాటే. . . . ! కాని. . . . ఆయన మొదటి భార్య ఎంత గుణవంతు రాలనుకున్నావు. . . . .? ఆవిడ చేతి వద్దన రుచి చూడని వాళ్ళు ఈ ప్రాంతాల్లోనే లేరంటే నమ్ము.

ప్రేమారావు : అవునండి. . . . అవునండి. . . తస్సారవలా. . . . ఆవిడగోరు చచ్చి ఏ సొర్గాన వున్నారో. . . . .? మహాతల్లి. ఆమెగోరి గుణాలన్నీ, అచ్చు రాధమ్మ తల్లికి వచ్చాయి. రాధమ్మతల్లి సుగుణాల రాసి. మాదొడ్డ గుణం!

పే.శాస్త్రి : అన్నమాటా వున్నమాటే. . . . ! కాని— మాణిక్యం. . . . . ! నాకు తెలియకడుగు తానూ— శాంతమ్మగారు రాధని సొంత తల్లిగానే చూస్తారా లేకపోతే. . . . . .

ప్రేమారావు : తస్సారవలా. . . ., అన్నమాటా వున్నమాటే అంటూ తెలవగడుగుతానంటూ రేమి టండీ. . . . . పంతులు గారూ. . . .! అయినా, మీరన్నమాటా వున్నమాటే అనుకోండి. ఎంతయినా సవతితల్లి సవతితల్లే నూడండి. . . .

పే.శాస్త్రి : అందుకేగా. . . ., ఆమెనోయింటి దాన్నిచేసి. . . . ఈ పీడవిరగడ చేద్దామని. . . నేనూ సంబంధాలు తెగ వెతుకుతున్నా.

ప్రేమారావు : మీ ఆలోచన మంచిదే అనుకోండి. మా రాధమ్మ పెళ్ళికి ఒప్పుకోదు. . . . అందులో మీరు తెచ్చిన సంబంధాలంటే అస్సలు గిట్టవు. . .

పే.శాస్త్రి : అదే మది?

ప్రేమారావు : అదే మరి . . . ! మీకు తెలవ దేంటి? ఆమెగోరికి కొంచెం పిచ్చి. తస్సారవలా, ఆ కాస్త పిచ్చి లేకపోతేనా. . . . . ?

పే.శాస్త్రి : ఏమిటేమిటీ. . . .? రాధమ్మకి పిచ్చా. . . .? ఈ విషయం నాకు తెలియనే తెలి యదే. . . .?

ప్రేమారావు : అన్నమాటా వున్నమాటే. . . . ఇప్పుడు తెలుసుకున్నారుగా ఇక దయచెయ్యండి. . . అయినా పంతులుగోరూ. . . ., ఆ తండ్రికినూతే తెలవదేంటండి? ఆయనగోరి కూతురుకాదా రాధమ్మ గోరు. . . . .? పోనీలెండి. . . . . ఇప్పుడయినా తెలుసుకున్నారు. . . . మంచిదే అయింది. ఇంక వెళ్ళండి. . . . . పెళ్ళి పెడుత్నాంకి నీళ్ళదారి దులు కోండి. . . .

శాంతమ్మ : [లోపలి నుంచి] ఓరి మాణిక్యం. . . ఓరి మాణిక్యం. . . .!

ప్రేమారావు : అమ్మా. . . . అమ్మా. . . . ఇక్కడే వున్నానమ్మా. . . . పని గాపకంవచ్చిందా?

శాంతమ్మ : [వచ్చింది] ఆ. . . . శాస్త్రి గారింకా ఇక్కడే వున్నారా. . . .? నామతిమండి పోనూ. . . . . ఏమండీ శాస్త్రిగారూ. . . .మీరా పెళ్ళికొడుకు విషయం తేల్చుకురండి. . . .ఆ పెళ్ళి చూపులు కాస్త అయిపోతే తొందరలో లగ్నాలున్నా యంట. . . . అయిందనిపించేద్దాం. . .

ప్రేమారావు : అవును. . . . మా అమ్మగోరి కసలే శానాశానా కంగారుగా వుంది. . . .

శాంతమ్మ : నువ్వు నోర్మూసుకో. . . . పెద్దోళ్ళతో మాట్లాడుతుంటే అడ్డారావొద్దని నీకెన్నిసార్లు చెప్పాను. . . . . వెధవకానా అని వెధవకానా అయినా, నువ్వింకా ఇక్కడే తగులడ్డావేం. . .?

ప్రేమారావు : తస్సారవలా, మీరు పనే సెప్ప లేదండమ్మగోరూ. . . . .

శాంతమ్మ : [నెత్తికొట్టుకుంది] అవునుకదూ.. చెప్దామనుకునే వచ్చాను. . . . . మీరు వెళ్ళండి పంతులుగారూ. . . . ., వెళ్ళి ఆ యేర్పాటేదో చూడండి. . . . . మాణిక్యం. . . . వస్తావుండు.

[ఆమె వెళ్ళకుండానే కెప్టెను నానారావు లేచాడు]

కె.నానారావు : కమాండర్. . . . కమాండర్. .

ప్రేమారావు : [కమాండర్లా వెళ్ళి సెల్యూట్ కొట్టి నిలబడ్డాడు] యస్సార్. . . .!

కె.నానారావు : ట్రూప్స్ రెడీయా. . . .?

ప్రేమారావు : యస్సార్. . . .

కె.నానారావు : అంతా యుద్ధానికి సిద్ధంగా వున్నారా?

ప్రేమారావు : యస్సార్. . . .

[అతనికి హాట్ బాక్స్, తుపాకీ అందించాడు.]

శాంతమ్మ : [వెళ్ళబోయేదల్లా ఆగిపోయింది] ఈయనకే ఇప్పుడే తెలివిరావాలా? లోపలికెళ్ళానో నా పని హరీ. . . . అవనీ. . . .ఆ భాగోతం కాస్తా అవనీ. . . . అప్పుడే పని చూసుకో వచ్చు. రండి రండి. . . . మీ ట్రూప్సు సోల్జర్లూ సిద్ధంగానే వున్నారు. . . . మీ పని కానివ్వండి. . . . ఖర్మ. .

# పద్మవ్యూహం

శాంతమ్మగారు అయ్యగారితో సంసారం సెయ్యడానికి పెళ్లిసేసుకున్నారాయేంటండి? కొండంత ఆస్తి. . . . . లంకంత యిల్లు. . . . యింత భోగభాగ్గేలు రావాలంటే మాటలామరి. . . . .?

రాధ : మాణిక్యం. . . . మంచి చెడ్డ తెలియకుండా. . . . ఎవరి దగ్గర బడితే వాళ్ల దగ్గర నోటి కొచ్చింది వాగెయ్యడమేనా ఏమిటి? వెళ్ళు. . . పని చూసుకో. . . .

ప్రేమారావు : ఏదండీ. . . . అమ్మగోరు పని చెబుతానని పొద్దుట్నుంచి అంటున్నారు. . . . ఆమె గోరి కంగారు ఆమెదేగాని . . . ఏదీ పని సెప్పందే . . . . . ?

శాంతమ్మ : [లోపలి నుంచి] ఓరి మాణిక్యం. . . ఓరి మాణిక్యం. . . .

ప్రేమారావు : అమ్మా వున్నానండి. . . వున్నాను. రాండి. . . . రాండి. . . పని గాపకం ఒచ్చిందాండి. . . . .?

శాంతమ్మ : [వచ్చింది. శాస్త్రులుగార్ని చూసింది] మీరింకా యిక్కడే వున్నారా పంతులుగారూ. . . .?

పే. శాస్త్రి : [లేచాడు] అన్నమాటా వున్నమాటే. ఏదీ. . . . మీతో చెప్పి వెళ్దామని వున్నానండమ్మా. . . . సెలవు పుచ్చుకుంటా. . . . [వెళ్ల బోతాడు]

ప్రేమారావు : ఏమండోయ్. . . . నేను సెప్పిన మాట గాపక ముంచుకోండి. . . . లేకపోతే మీరే యిబ్బంది పడతారు. . . . . తస్సారవలా. . . .

పే. శాస్త్రి : అన్నమాటా వున్నమాటే [వెళ్లి పోయాడు].

శాంతమ్మ : ఏమిట్రా ఆ జ్ఞాపక ముంచుకునేది?

ప్రేమారావు : అదాండీ . . . అదాండీ. . . . అదీ. . . . అదీ. . . . తస్సారవలా. . . . అదీ! అదేనండి. పంతులుగోరికంటండమ్మా. . . . మూడు పెళ్లిళ్లయాయింట. నాలుగో పెళ్లి కోసమడిగితేనూ. . . . సేసుకోవద్దని సలహా యిచ్చానండి. . ఎలా వుందండి నా అవిడియా. . . .

శాంతమ్మ : నీ తలకాయలా వుందిగాని. . . పోయి పనిచూడు. . . . .

ప్రేమారావు : యాంటండమ్మగోరూ. . . మీరు మరీనూ. పని సూడూ. . . . పనిసూడు అంటారే గాని. . . అస్సలు ఆ పనేంటో సెప్పరుగందా. . . సెప్పండి. . . . సిటికెలో సేసుకొత్తా. . .

శాంతమ్మ : నా మతి మండిపోనూ. . . నీ ముఖం చూస్తే నాకు పనే జ్ఞాపకంరాదు. . . కాటుముఖం— కాటుముఖమాని. . . .? పోనీలే. జ్ఞాపకం రాకపోతే అదేపోయె. . . . వెళ్లి [జ్ఞాపకం రాదు. . . .] ఆ. . . . వెళ్లి డ్రయివర్ని పిల్చుకురా. యింకా రానేలేదు. . . . వెళ్లు. . . .

ప్రేమారావు : హమ్మయ్య. ప ప పా ని ని నీ పని. . . పని పని పనీ [పాడుకొంటూ వెళ్లబోతాడు]

రాధ : మాణిక్యం. . . డ్రయివరు వచ్చేప్పటికి ఆలశ్యమవుతుంది గాని. . . . దార్లోనేగా. . . పాపని తీసుకువెళ్లి కాన్వెంటులో విడిచిపెట్టు.

శాంతమ్మ : [ఈసడింపుగా] ఆ. . . . తీసు కెళ్ళు. . . . తీసుకెళ్ళు. కాన్వెంటులో కాదు. . . . అనాథాశ్రమంలో విడిచిపెట్టు. పీడా వదుల్తుంది.

ప్రేమారావు : అదేంటండమ్మగోరూ. . . . యిష్టంలేకపోతే యిష్టంలేనట్టుగా వుండండి. . . అంతేగాని. . . ఆ పసిపిల్ల ఏం చేసిందని, అనవసరంగా నోరు పారేసుకుంటారు?

శాంతమ్మ : నువు నోరుమూసుకోరా. . . చెవలాయీ. . . .

రాధ : వాడినోరెందుకు మూస్తావు. లలితని చూస్తే నీ కెందుకుకంత కడుపుమంట. . . పసిపిల్ల—అది నిన్నేం చేసింది. . . .?

శాంతమ్మ : అనమ్మా. . . అను. కన్నతల్లినికాకపోయినా, పెంచిన తల్లిని కదా అని నీ మేలుకోరి ఏదో అంటాను. నా ఖర్మకాలి— మంచి కూడా చెడే అవుతుంది. పెళ్లి కావల్సిన పిల్లవి— ఎవర్తెనో. . . పాపాయి నెత్తుకు తిరుగుతుంటే. . . లోకమేమనుకుంటుంది? ఆ మాత్రం జ్ఞానమన్నా వుండక్కర్లేదా. . . .?

రాధ : లోకంతో నాకు పని లేదు. మంచిదని తోచినదాన్ని చెయ్యడంలో తప్పులేదు. పాప గురించి నువ్వనవసరంగా బాధపడకు.

శాంతమ్మ : చదువుకున్నదానివి. . . అందులోనా కాలేజీల్లో చదువుకొన్నదానివి. నీతో నేనెక్కడ మాట్లాడ గల్గుతానులేమ్మా. . . . ? మీ యిష్టమొచ్చినట్టుండండి. నాకేం కావాలి. . . .! వూళ్లో అనాథల్నందర్నీ యింట్లో చేర్చి వున్నదంతా వూడ్చి పెట్టినా నా కవసరంలేదు. . . . . ఈ యింటినే అనాథాశ్రమంగా తయారు చేస్తున్నా నాకేం అక్కరలేదు. . . . వున్నవాటిల్లో ఇదొకటి. . . . కానివ్వండి. . . . కానివ్వండి. . . . మీ యిష్టం. .

[ప్రేమారావు లోపలికి వెళ్లి లలితని ఎత్తుకొచ్చాడు. రాధ ఆ పాపాయితో ముద్దులాడింది. లలిత టాటా చెప్పింది. ప్రేమారావు వెళ్ళిపోయాడు. శాంతమ్మ కొరకొరా చూసింది. రాధ అక్కడినుంచి తప్పుకుంది. శాంతమ్మకూడా లోపలికి వెళ్ళబోయింది]

కె. నానారావు : ప్రేమా. . . ప్రేమా. . .

శాంతమ్మ : [తిరిగొచ్చింది] హాయ్యో. . . హాయ్యో. . . ఈ వయస్సులో మీకు ప్రేమ కావాల్సి వచ్చిందా? ఈయింట్లో అందరికీ తలోకరకంపిచ్చిలా వుంది. . . కూతురేమో 'పాపా పాపా' అంటుంది, ఈ తండ్రిగారేమో. . . . ప్రేమా. . . . ప్రేమా అంటున్నారు. బాగానేవుంది వరస. . . .

కె. నానారావు : అదికాదే. మన ప్రేమారావూ. . .

శాంతమ్మ : ప్రేమారావా. . . .? వస్తాడు వస్తాడు. . . . చైనావాళ్లు వచ్చి మళ్లీ బాంబులు వేసే సమయానికి వాడే పరుగెత్తుకొస్తాడు గాని. . . మీరు యుద్ధానికి సిద్ధంగా వుండండి. [విసురుగా వెళ్ళిపోయింది.]

—( తెర )—

(ఇంకా ఉంది)

శిల్పర్లా నిలబడింది]

కె.నానారావు: వచ్చేస్తున్నారు. . . చైనావాళ్లు వచ్చేస్తున్నారు. . . . ప్రజలారా. . . . అమాయక జనులారా. . . . ఓ భారత పౌరులారా. . . . శత్రువులు వచ్చేస్తున్నారు. . . . బాంబులు వేసేస్తున్నారు. . . . వెళ్లండి. . . వెళ్లండి. షెల్టర్స్‌లో తలదాచుకోండి. . . . .

[పేరయ్యశాస్త్రి కంగారుగా పరుగెడతాడు. అపి వరసలో నిలబెడతాడు ప్రేమారావు].

కె.నానారావు: కమాండర్! కమాండర్!!

ప్రేమారావు: యస్సార్.

కె.నానారావు: ట్రూప్స్‌రడీయా. . .

ప్రేమారావు: యస్సార్. . .

కె.నానారావు: హోల్ ట్రూప్స్ అటెన్షన్!

ప్రేమారావు: యస్సార్ . . . . [అందరూ అటెన్షన్‌లో నిలబడతారు. పేరయ్యశాస్త్రిమాత్రం కాళ్లు బారచాపి చేతులు పొట్టమీద ఇంటూ మార్కు వేసుకుని వొణుకుతూ నిలబడతాడు.]

రాధ: [అప్పుడే వచ్చింది] మాణిక్యం. . . . మాణిక్యం. . . . [తండ్రినిచూసి గతుక్కుమంది. వరసలో నిలబడమన్నట్టుగా ప్రేమారావు సంజ్ఞ చేశాడు. రాధ వరసలో నిలబడింది.]

కె. నానారావు: రడీ ఫర్ దిఇన్‌స్పెక్షన్!

[లెఫ్ట్‌రైట్ కొట్టుకుంటూ అందర్నీ చెక్ చేయడానికి బయల్దేరతాడు.]

అందరూ వరసగా అటెన్షన్‌లో నిలబడ్డారు. పేరయ్యశాస్త్రి మాత్రం ఈ హఠాత్సంఘటనకి ఒణికిపోతున్నాడు. అతనికి కొత్త. నిలబడ్డం చాతకావడంలేదు. ప్రేమారావు సంజ్ఞలు చేస్తూనే వున్నాడు.

కెప్టెన్ నానారావు అందర్నీ వరసగా పరీక్షించుకుంటూ వస్తున్నాడు. ఒక్కొక్కళ్లనీ పరీక్ష చేస్తూ లోపాలు చెబుతూ హుంకరిస్తున్నాడు. పేరయ్యశాస్త్రిని చూశాడు. అతని చేతుల్ని సరిచేశాడు. కాని అవి స్ప్రింగులా యథాస్థానాన్ని ఆక్రమించాయి.]

యూ. . . డర్టీ ఫెలో. . . . అటెన్షన్ తెలియని వాడివి నిన్నెవరయ్యా సైన్యంలో చేర్చుకున్నది. . . .? కమాండర్. . . . కమాండర్. .

ప్రేమారావు: యస్సార్. . . .

కె.నానారావు: ఈ స్కౌండ్రల్‌ని నిలువులోతు గొయ్యితీసి మళ్లీ నింపమను. . . .

ప్రేమారావు: యస్సార్. . . .

పే.శాస్త్రి: అయ్యబాబోయ్. . . . నిలువు లోతు గొయ్యితీసి మళ్లీ నింపడమే. . . .

కె.నానారావు: డోన్ట్‌టాక్. . . . ఆర్డరీన్. . . ఆర్డర్. . . .!

[కాంతమ్మని చూశాడు]

స్కౌండ్రల్. . . . గెడ్డం చేసుకోకుండ పెరేడ్ గ్రవుండ్స్‌లో అడుగెట్టావ్. . . .? నిన్నేం చేసినా పాపంలేదు. . . . మిలట్రీ డిసిప్లిన్ తెలీకుండా ఏమిటీ ప్రవర్తన. . .? కమాండర్. . . . కమాండర్. . . .

ప్రేమారావు: యస్సార్. . . . .

కె.నానారావు: వీడిని గ్రౌండ్ చుట్టూ పదిసార్లు తిప్పించు. . . . కాళ్లు నొప్పెట్టేదాకా తిప్పించు.

ప్రేమారావు: యస్సార్. . . .

కె. నానారావు: [రాధ వరకు వచ్చాడు] యూ మై డియర్ బోయ్. . . . ఎ గుడ్ ఫెలో. . . .సోల్జర్ అంటే యిలా వుండాలి. [పై నుంచి కిందదాకా చూసి] నువ్వారాదా. . . .! ఇక్కడికెందుకొచ్చావమ్మా. . . . వెళ్లిపో. . . . వెంటనే వెళ్లిపో. . . అదిగో చైనా వాళ్లు వచ్చేస్తున్నారు. . . . యుద్ధ విమానాలు రయ్యిన తిరుగుతున్నాయి. బాంబులు వేసేస్తారు. వెళ్లమ్మా వెళ్లు. తొందరగా వెళ్లు. శత్రువుల చేతుల్లో నీ జీవితం. . . . అన్యాయమైపోతుందమ్మా. . . . . పారిపో. . . . వెంటనే పారిపో. . . .! వెళ్లి అమ్మతో చెప్పు. . . . యుద్ధం అయిపోగానే వచ్చేస్తానని చెప్పు. . . . శత్రువుల్ని హతమార్చి— దేశానికి కీర్తిప్రతిష్టలు తీసుకువస్తానని చెప్పు. . . వెళ్లమ్మా. . .వెళ్లు.

[అతనికి ఆయాసం వచ్చింది. దాంతోపాటు గుండెనొప్పి వచ్చింది. తూలిపోబోయాడు.]

రాధ: [కళ్లు తుడుచుకుంటుంది] నాన్నా. . . .

కె.నానారావు: [ఆమెని కావలించుకుంటాడు.]

[రాధ ప్రేమారావు సాయంతో అతన్ని తీసుకువెళ్లి పడక్కుర్చీలో కూర్చోబెడుతుంది.] తుపాకీ, హాట్టూ యధాస్థానంలో వుంచేస్తుంది.] అతనికి ఫ్లాస్కులో కాఫీ పోసిచ్చి పరిచర్యలు చేస్తూ అక్కడే నిలబడి వుంటుంది.]

కాంతమ్మ: ఇదీవరస. . . . ఇంకనే వెళ్తొస్తా. విమానాలు వెళ్లిపోయాయా?

కె.నానారావు: కమాండర్. . . . కమాండర్.

ప్రేమారావు: యస్సార్. . . .! హోల్ ట్రూప్స్ డిస్‌మిస్. . . .!

కాంతమ్మ: వీడొకడూ, ఆ పిచ్చాయనకి సాయం. ఆ మహాతల్లి వుండి ఎలా సుఖపడింది గానీ. . . . పోయి మమ్మల్ని హడిలించి చంపుతోంది. [వెళ్లిపోయింది.]

[పేరయ్యశాస్త్రి పారిపోబోయాడు. అతనికి ధైర్యం చెప్పి వెనక్కి తీసుకొచ్చాడు ప్రేమారావు]

ప్రేమారావు: ఇప్పుడు మరేం ఫరవాలేదులెండి. మీరు మామూలుగా వుండొచ్చు. . . . నే చెప్పాగా . . . . అప్పుడప్పుడు మన లోకంలోకి వస్తారని. వచ్చినప్పుడల్లా అంతే. . . .! ఆయన చెప్పినట్టు మనం నడవక పోయామో, తస్సారవలా— ఈ కుర్చీలూ, సోఫాలూ వున్న చోటుండవు. . . . నానా హంగామా అయిపోద్ది. ఇదివరకు అలవాటే— పాపం మీకు కొత్త. గాభరాగా వున్నట్టుంది. . . కూర్చోండి. . . . కూర్చోండి. . . .

పే.శాస్త్రి: [కూర్చోడానికి వెనకాడాడు]

ప్రేమారావు: కూర్చోండి మరేంఫరవాలేదు. . . వోహో అదా మీ భయం. . . [నవ్వాడు] తస్సారవలా. యింక పనిస్మెంటుండదులెండి. . . . దొరగారు ఆయన లోకంలోకి యెళ్లిపోయారు. నచ్చి ఏ సొర్గా నుండో ఆ మహాతల్లి . . . .? అమె పోయిందగ్గర్నుంచీ యిదే వరసంట. . . .!

పే.శాస్త్రి: ఎవరూ. . . . కెప్టెనుగారి. . . మొదటి భార్య పార్వతమ్మగారేనా. . . . . పాపం. చాలా వుత్తమురాలు. . . . నే చెప్పానుగా. . . . .! ఆమెగారి మరణం కెప్టెను బాబుగార్ని యింతగా కృంగదీస్తుందని నేను అనుకోలేదు సుమా. . . . . అన్నమాటా వున్నమాటే. . . . . .

ప్రేమారావు: అవునండి. . . . ఆమెగోరు పోయినప్పటినుంచే యింతేనుటండి. . . . రాధమ్మగోరు పార్వతమ్మగోరు పోయేనరికి సిన్నపిల్లంటండి. ఆమెగోరికి ఆలనాపాలనా యెవరూ వుండరని కాంతమ్మగోర్ని సేసుకున్నారు. . . . అప్పటినుంచీ ఆరి పని మరీ అధ్వాన్నమైపోయింది. తస్సారవలా. .



**కె. వి. ఆర్, అప్పికట్ల**

9—12—15—22-5-25—15—21. దీనికి బదులు పదిరోజుల్లో చెప్తానన్నా. కాని చెప్పలేక పోయాను.

పి యు సి చదివీ ఇది చెప్పలేకపోయావా?!... నిశ్చింతగా 9—4—15—14—14—15—20 అని చెప్పేయి!

**ఎ. ఎల్. ఎస్, అమలాపురం**

మన క్లాస్ పుస్తకములలోని పాఠముల కంటె పత్రికలు మొదలగు కథల పుస్తకములలోని కథలు ఒక్కసారి చదివినా జ్ఞాపకం ఉంటాయి. ఎందుచేత?

పాఠం అనేసరికి డల్‌కొట్టేస్తారు—అదేం శాపమో. నిజానికి పాఠ్యపుస్తకాలు కన్నుల కింపుగా, లోని విషయాలు చదవడానికి ఉత్సాహ జనితంగా ఉండకూడదని రూలులేదు. వచ్చి నట్టు పిల్లలు కొని చదువుతారు కదా అన్న ధీమా.

**ఎస్. ఎస్ ఎన్, పిఠాపురం**

విడాకుల పై మీ అభిప్రాయం ఏమిటి?

అసలాకులేసు కోవడమే అలవాటు లేదునాకు. ఇక విడాకులెలా ఉంటాయని ఎలా చెప్పను?

**వి. ఎస్. ఆర్. ఆర్, తిరుపతి**

ఏది మంచి? ఏది చెడు?

అది మనస్సు చెప్తుంది.

నా పేరు పత్రికలో పడితే చూ—— ఉంది. ఏం చెయ్యమంటారు?

చిన్న అలజడి లేవనెత్తండి, సత్యాగ్రహం, చెయ్యండి. మీ బడిముందు నిరాహారదీక్ష ప్రారంభించండి. . . . ఈ రోజుల్లో పేరు పేపర్లో పడ్డానికి అంతకష్టపడి కారణాలు వెతకనక్కరలేదు రాజుగారూ.

**జ్వాలాశ్రీ, కర్నూలు**

మనిషిలోని మంచితనాన్ని అర్థంచేసుకోదీలోకం. న్యాయం ధర్మం అంటూనే మంచివాళ్ళని దూరంగా తరిమివేయాలని, అవసరం అయితే అణగ ద్రొక్కాలని చూస్తుందీ సంఘం?

చిత్తం. అంతేమరి! లోకం, కళ్ళుండీ చూడలేదు. సంఘం చెవులుండీ వినలేదు.

**పి ఆర్. కె, విశాఖపట్నం**

ప్రేమించి పెళ్లి చేసుకోవడం లేదు. పెండ్లి చేసుకొని ప్రేమించడమా?

అలాగే కానివ్వండి. మళ్లీ అక్కడ కక్కుర్తి పడి—పెండ్లి చేసుకున్నాక, ఇంకో స్త్రీని ప్రేమించడం మొదలు పెట్టకండి!

**రోషనీ, తాడిపత్రి**

పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పడి దేశీయ సంప్రదాయం తెలియక, చెడి




కన్నులుండి అంధులయిన వీరిపై కరుణ చూపరా? లేక...

ఎవరు చిట్టితల్లీ వారు?. . . .

**ఆర్. ఎల్, విశాఖపట్నం**

వివాహం అంటూ బంధం ఏర్పరచి ఎవరో ఏమిటో తెలియకుండా కష్టమో సుఖమో అతనితో జీవించమనడం దైవం చేసిన పొరపాటా?

కాదు సంఘం చేసిన కట్టుదిట్టం. . . నీవైపు నుంచే ఆలోచించి ప్రయోజనం లేదు— నిన్ను కట్టుకున్న ప్రాణికూడా అంతేగా. . . .

**ఎ. ఎమ్. ఎమ్, నవరంగపురం**

శ్రీమతి ఆరుద్రగారూ, స్త్రీలు సినిమాలో ఒక కరుణ దృశ్యం చూసి బాధపడినట్లు నిజజీవితంలో అలాంటి దృశ్యం చూసి బాధపడరు. కారణం?

సినిమాలో రియాక్షనుకి బాధ్యతఉండదు. వాస్తవ జీవితంలో అలా రియాక్టు అయితే బాధ్యతలు పెరుగుతాయి. చూసి చూసి ఎవరు పెంచుకుంటారు బరువు భారాలని?

**జె. వి. ఎస్. కె, పేరూరు**

నేను అమ్మాయిలతో మాట్లాడేటప్పుడు నెర్వస్‌గా ఫీలవుతాను. దీనికి విరుగుడు?

మాట్లాడకుండా ఉండడమే.

**సి. ఎస్. ఆర్, అనంతపురం**

మీ ముఖం చూసిన తరువాత, మీ జవాబులు చదివిన తరువాత 'ఫేస్ ఈజ్ ది ఇండెక్స్ ఆఫ్ మైండ్' అన్నది అక్షరాలా నిజం అనిపిస్తుంది నాకు. ఏమంటారు?

ఇంకేమంటాను మీరలా బల్లగుద్ది చిత్రంగా చెప్పేస్తుంటే?!

**కె. ఎస్. ఆర్, విశాఖపట్నం**

రామలక్ష్మిగారూ, మీరు 24—7—70 పత్రికలో ఇష్టమైన వస్తువును విషంతో సమానంగా చూడమని పెద్దల ఆజ్ఞ అని అన్నారు. ఆలా అని ఏ పెద్దలు చెప్పారు? ఎందుకీ కోత చెప్పండి?

కోతా?! అయ్యోరామా, మా అత్తయ్య చెప్పేది; మా నాన్నగారు చెప్పేవారు. ఏం వాళ్ళు పెద్దలకింద రారా? అయినా ఇష్టం అయిన వస్తువు పట్ల మితమైన దృష్టి ఉండాలన్నది. . . . ఎవరూ చెప్పకుండానే తెలియవలసిన చిట్కా కదా! మీకు తెలియ లేదేమిటి చెప్మా?!

**సి హెచ్. ఎస్. ఆర్, అనంతపురం**

ఒక పట్టణవాసి ఒక పల్లెటూరి మొద్దుని ప్రేమించాడు పెళ్ళాడాడు. వారి సంసారం ఎలా ఉంటుందంటారు?

హాయిగా ఉంటుంది. కావలసినది మనసు కాని అది పట్నవాసియా? పల్లెవాసియా? అన్నది కాదు ప్రశ్న.

**ఎ. ఎస్. బి. జి, బెజవాడ**

జీవితంలో అప్పులవాళ్ళతో పోరాడి పోరాడి విసుగెత్తింది.

ఎప్పుడూ మింగగల్గినంతే కొరకాలన్నది అంగ్ల సామెత. తీర్చగల మార్జినులో చేయాలి అప్పులు. లేకుంటే ఇచ్చిన వాళ్లకి మీకూకూడా విశ్రాంతి ఉండదు.

**ఎస్, ఎస్. కె. పి, చీర్యాలి**

మనిషిని ఆశని ఎప్పుడు చంపుకుంటాడు? అసలు చచ్చిపోతుందా?

ఆశ చావదు.

**పి. ఎస్. ఎన్, విజయనగరం**

చంద్రలోకంలోకి అడుగు పెట్టిన మొదటివాడు పురుషుడు. అదే స్త్రీ అయితే ఇక ఈ ఆడజాతిని పట్టలేక పోదుము. ఇప్పుడు సమానహక్కులు అవీ ఇవీ అంటూ గోల చేస్తున్నారు. దానికి మీరేమంటారు?

మీ ధోరణి చూస్తే నేనేం చెప్పినా నోరు ముయ్యమనేలా ఉన్నారు— అపని నేనే చేస్తాను. అయినా మీలా సంకుచితంగా ఆలోచించడం లేదు ఆడజాతి. వాలంటీనా అంతరిక్ష యాత్ర చేస్తే మురిసిన కంటే వేయిరెట్లు ఆర్మ్‌స్ట్రాంగ్ ఘన విజయానికి పొంగి పోయాం. మనిషికి ముందు కోతి వెళ్ళినా కుక్క వెళ్ళినా కూడా ఆనందించిన మీరు— ఆడది ఆ ఘనవిజయం సాధించిందని తెలిస్తే ఆత్మహత్య చేసుకోరుకద కొంపదీసి!!

**వి. సిహెచ్. పి, మెదక్**

ఒక వ్యక్తి మంచితనాన్ని లోకంచేత కానితనంగా యెంచినప్పుడు ఆవ్యక్తి కర్తవ్యం ఏమిటి?

లోకంలో మంచి అనిపించుకోవడం ఎప్పుడూ కష్టం. అంచేత దానికై ప్రయత్నించడం కాదు మనంచేయదలచినది— చేయడమే.




**కె. వి. ఆర్, అప్పికట్ల**

9—12—15—22—5—25—15—21. దీనికి బదులు పదిరోజుల్లో చెప్తానన్నా. కాని చెప్పలేక పోయాను.

పియుసి చదివీ ఇది చెప్పలేకపోయావా?!... నిశ్చింతగా 9—4—15—14—14—15—20 అని చెప్పేయి!

**ఎ. ఎల్. ఎస్, అమలాపురం**

మన క్లాస్ పుస్తకములలోని పాఠముల కంటె పత్రికలు మొదలగు కథల పుస్తకములలోని కథలు ఒక్కసారి చదివినా జ్ఞాపకం ఉంటాయి. ఎందుచేత?

పాఠం అనేసరికి డల్ కొట్టేస్తారు—అదేం శాపమో. నిజానికి పాఠ్యపుస్తకాలు కన్నుల కింపుగా, లోని విషయాలు చదవడానికి ఉత్సాహ జనితంగా ఉండకూడదని రూలులేదు. చచ్చి నట్టు పిల్లలు కొని చదువుతారు కదా అన్న ధీమా.

**ఎస్. ఎస్ ఎన్, పిఠాపురం**

విడాకుల పై మీ అభిప్రాయం ఏమిటి?

అసలాకులేసు కోవడమే అలవాటు లేదునాకు. ఇక విడాకులెలా ఉంటాయని ఎలా చెప్పను?

**వి. ఎస్. ఆర్. ఆర్, తిరుపతి**

ఏది మంచి? ఏది చెడు?

అది మనస్సు చెప్తుంది.

నా పేరు పత్రికలో పడితే చూ... ఉంది. ఏం చెయ్యమంటారు?

చిన్న అలజడి లేవనెత్తండి, సత్యాగ్రహం, చెయ్యండి. మా బడిముందు నిరాహారదీక్ష ప్రారంభించండి. . . . ఈ రోజుల్లో పేరు పేపర్లో పడ్డానికి అంతకష్టపడి కారణాలు వెతకనక్కరలేదు రాజాగారూ.

**జ్వాలాశ్రీ, కర్నూలు**

మనిషిలోని మంచితనాన్ని అర్థంచేసు కోదీలోకం. న్యాయం ధర్మం అంటూనే మంచివాళ్లని దూరంగా తరిమివేయాలని, అవసరం అయితే అణగ ద్రొక్కాలని [illegible]స్తుందీ సంఘం?

చిత్తం. అంతేమరి! లోకం, కళ్లుండీ చూడలేదు. సంఘం చెవులుండీ వినలేదు.

**పి ఆర్. కె, విశాఖపట్నం**

ప్రేమించి పెళ్లి చేసుకోవడం లేదు. పెండ్లి చేసుకొని ప్రేమించడమా?

అలాగే కానివ్వండి. మళ్లీ అక్కడ కక్కుర్తి పడి—పెండ్లి చేసుకున్నాక, ఇంకో స్త్రీని ప్రేమించడం మొదలు పెట్టకండి!

**రోషనీ, తాడిపత్రి**

పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పడి దేశీయ సంప్రదాయం తెలియక, చెడి కన్నులుండి అంధులయిన వీరిపై [illegible] చూపరా? లేక...

ఎవరు చిట్టితల్లీ వారు?. . . .

**ఆర్. ఎల్, విశాఖపట్నం**

వివాహం అంటూ బంధం ఏర్పరచి ఎవరో ఏమిటో తెలియకుండా కష్టమో సుఖమో అతనితో జీవించమనడం దైవం చేసిన పొరపాటా?

కాదు సంఘం చేసిన కట్టుదిట్టం. . . నీవైపు నుంచే ఆలోచించి ప్రయోజనం లేదు— నిన్ను కట్టుకున్న ప్రాణికూడా అంతేగా. . . .

**ఎ. ఎమ్. ఎమ్. నవరంగపురం**

శ్రీమతి ఆరుద్రగారూ, స్త్రీలు సినిమాలో ఒక కరుణ దృశ్యం చూసి బాధ పడినట్లు నిజజీవితంలో అలాంటి దృశ్యం చూసి బాధపడరు. కారణం?

సినిమాలో రియాక్షనుకి బాధ్యతఉండదు. వాస్తవ జీవితంలో అలా రియాక్టు అయితే బాధ్యతలు పెరుగుతాయి. చూసి చూసి ఎవరు పెంచుకుంటారు బరువు భారాలని?

**జె. వి. ఎస్. కె. పేరూరు**

నేను అమ్మాయిలతో మాట్లాడేటప్పుడు నెర్వస్‌గా ఫీలవుతాను. దీనికి విరుగుడు?

మాట్లాడకుండా ఉండడమే.

**సి. ఎస్. ఆర్, అనంతపురం**

మీ ముఖం చూసిన తరువాత, మీ జవాబులు చదివిన తరువాత 'ఫేస్ ఈజ్ ది ఇండెక్స్ ఆఫ్ మైండ్' అన్నది అక్షరాలా నిజం అనిపిస్తుంది నాకు. ఏమంటారు?

ఇంకేమంటాను మీరలా బల్లగుద్ది [illegible]చ్చితంగా చెప్పేస్తుంటే?!

**కె. ఎస్. ఆర్, విశాఖపట్నం**

రామలక్ష్మిగారూ, మీరు 24—7—70 పత్రికలో ఇష్టమైన వస్తువును విషంతో సమానంగా చూడమని పెద్దల ఆజ్ఞ అని అన్నారు. అలా అని ఏ పెద్దలు చెప్పారు? ఎందుకీ కోత చెప్పండి?

కోతా?! అమ్మోరామా, మా అత్తయ్య చెప్పేది; మా నాన్నగారు చెప్పేవారు. ఏం వాళ్ళు పెద్దలకింద రారా? అయినా ఇష్టం అయిన వస్తువుపట్ల మితమైన దృష్టి ఉండాలన్నది. . . . ఎవరూ చెప్పకుండానే తెలియవలసిన చిట్కాకదా! మీకు తెలియలేదేమిటి చెప్మా?!

**సి హెచ్. ఎస్. ఆర్, అనంతపురం**

ఒక పట్టణవాసి ఒక పల్లెటూరి మొద్దుని ప్రేమించాడు పెళ్ళాడాడు. వారి సంసారం ఎలా ఉంటుందంటారు?

హాయిగా ఉంటుంది. కావలసినది మనసు కాని అది పట్నవాసియా? పల్లెవాసియా? అన్నది కాదు ప్రశ్న.

**ఎ. ఎస్. బి. జి. బాన్సువాడ**

జీవితంలో అప్పులవాళ్లతో పోరాడి పోరాడి విసుగెత్తింది.

ఎప్పుడూ మింగగల్గినంతే కొరకాలన్నది అంగ్ల సామెత. తీర్చగల మార్జినులో చేయాలి అప్పులు. లేకుంటే ఇచ్చిన వాళ్లకీ మీకూకూడా విశ్రాంతి ఉండదు.

**ఎస్. ఎస్. కె. పి, చిట్వేలి**

మనిషిని ఆశని ఎప్పుడు చంపుకుంటాడు? అసలు చచ్చిపోతుందా?

ఆశ చావదు.

**పి. ఎస్. ఎన్, విజయనగరం**

చంద్రలోకంలోకి అడుగు పెట్టిన మొదటివాడు పురుషుడు. అదే స్త్రీ అయితే ఇక ఈ ఆడజాతిని పట్టలేక పోదుము. ఇప్పుడు సమానహక్కులు అవీ ఇవీ అంటూ గోల చేస్తున్నారు. దానికి మీరేమంటారు?

మీ ధోరణి చూస్తే నేనేం చెప్పినా నోరు ముయ్యమనేలా ఉన్నారు— ఆపని నేనే చేస్తాను. అయినా మీలా సంకుచితంగా ఆలోచించడం లేదు ఆడజాతి. వాలంటీనా అంతరిక్ష యాత్ర చేస్తే మురిసిన కంటే వేయిరెట్లు ఆర్మ్‌స్ట్రాంగ్ ఘన విజయానికి పొంగి పోయాం. మనిషికి ముందు కోతి వెళ్లినా కుక్కవెళ్లినా కూడా ఆనందించిన మీరు—ఆడది ఆ ఘనవిజయం సాధించిందని తెలిస్తే ఆత్మహత్య చేసుకోరుకద కొంపతీసి!!

**వి. సి హెచ్. పి. మెదక్**

ఒక వ్యక్తి మంచితనాన్ని లోకంచేత కావితనంగా యెంచినప్పుడు ఆవ్యక్తి కర్తవ్యం ఏమిటి?

లోకంలో మంచి అనిపించుకోవడం ఎప్పుడూ కష్టం. అంచేత దానికై ప్రయత్నించడం కాదు మనంచేయదలచినది—చేయడమే.

అన్నది.

మళ్ళీ నవ్వాను.

'నీ వుత్తరాల ద్వారా నీ హృదయం చాల అందమయిందని తెలుసుకున్నాను కాని యిప్పుడు నీ అందంముందు నీ హృదయం అంత అందంగా కనిపించటం లేదు మిస్ నెల్సన్!'

ఆమె నవ్వింది — 'యు సిల్లీ!' అన్నది—

ఆమెతో ఎన్నో మాట్లాడాలనుకున్నాను. ఎన్నో విషయాల గురించి చాల సరదాగా చెబుదామనుకున్నాను. రెండు సంవత్సరాల కలం స్నేహం మమ్మల్ని చాల దగ్గర చేసింది. ఒక్కసారిగా, ఆమెను కలుసుకోగానే, ఏమీ మాట్లాడలేకపోయాను. ఒక్క మాటా నోరుదాటి రాలేదు — మెల్లగా డ్రయివ్ చేస్తూ క్రీగంట ఆమెనే గమనిస్తున్నాను.

ఆమెకూడా ఏదో మాట్లాడాలని ప్రయత్నం చేస్తున్నది — బహుశా ఆమె కూడా నా స్థితిలోనే వుందేమో—

హఠాత్తుగా అన్నది 'రావ్! నీవుత్తరాల ద్వారా నాకు చాల సన్నిహితమయావు—నిజం చెప్పాలంటే నువ్వొక్కడివే నాకు ఆప్త మిత్రుడివి — రాబర్ట్ విషయం వేరనుకో, అతను త్వరలో నా భర్త కాబోతున్నాడు—ఇంత ఆప్తమిత్రుడివి ఒక్కసారిగా కనపడగానే — ఎన్నో చెబుదామనుకున్న నేను—ఏమీ మాట్లాడలేక పోతున్నాను!'

చిన్నగా నవ్వాను — 'అంతే జూలీ — సరిగ్గా నా పరిస్థితీ అంతే—'

ఆమె చిన్నగా నవ్వి కిటికీలోనించి హైదరాబాద్ నగరంలోని మనుషులనూ, ప్రకృతినీ చూస్తున్నది. బేగంపేట ఎయిర్ పోర్ట్ — వూరికి చాలదూరం అయినా నెమ్మదిగా, తాపీగా కారు నడుపుతున్నాను—

జూలీ అన్నది 'నా అదృష్టం బాగుండి నిన్ను చూడగలిగాను రావ్! మా సోషల్ అండ్ కల్చరల్ డెలిగేషన్ ఆఫ్ అమెరికా బొంబాయిలో సరిగ్గా నాలుగురోజులు మాత్రమే వుంటారు — అక్కడనుంచీ టోక్యో వెళ్ళాలి—నేను నీ కోసమని పర్మిషన్ తీసుకొని రెండురోజులు సెలవుతో యిక్కడికి వచ్చాను — యిక్కడ సరిగ్గా రెండురోజులు మాత్రమే వుంటాను—'

'థేంక్స్ జూలీ— నువ్వు మా తెలుగు దేశం చూస్తానని, చూడాలని వున్నదని ఎన్నోసార్లు వ్రాయటంవల్ల— నిన్నిక్కడికే రమ్మన్నాను. లేకపోతే నేనే బొంబాయి వచ్చి మిమ్మల్ని జాయిన్ అయేవాడిని— నీకు మాదేశం మొత్తం చూపించే వాడిని—'

నా మాటకు అడ్డువస్తూ అన్నది జూలీ — 'ముందు మీ తెలుగుదేశం చూపించు రావ్—నీ వుత్తరాలవల్లా, నేను చదివిన పుస్తకాలవల్లా— మీ భారతదేశం యొక్క సంస్కృతి, ఔన్నత్యం, స్త్రీలకు యిచ్చే గౌరవం, విశిష్టత అన్నీ తెలుసుకున్నాను. మీ తెలుగువారి ఆదర్శం, సంస్కారం గురించీ విన్నాను. నాకు మొదటినుంచీ, మీ భారతదేశం అంటే అమితమైన ఆకర్షణ వుంది. మీకు అమోఘమైన చరిత్ర వుంది—గొప్ప సంస్కృతి, సంప్రదాయం వున్నాయి — మీ యితిహాసాలగురించీ చదివాను. గ్రీకు, లాటిన్‌లకన్నా అద్భుతమైన మీ భాష సంస్కృతం, మా దేశంలోకూడా యిష్టపడినవారికి నేర్పుతున్నారు. శాంతికీ, సౌభాగ్యానికీ పుట్టిల్లు మీ దేశం — మహాత్మాగాంధి, గౌతమ బుద్ధుడు, అశోకుడు మొదలైన శాంతికాముకుల గురించీ, పుణ్యపురుషుల గురించీ అంతా విన్నాను. వారంటే నాకు అమితమైన గౌరవం — అటువంటి అవతార పురుషులు జనించిన పవిత్రభూమిని — ప్రాచీన సంప్రదాయాలకు, విశిష్టతకు, సంస్కృతికీ చిహ్నమైన మీ భారతదేశం యిన్నాళ్ళకి చూడగలుగుతున్నాను. రాబర్ట్ నేను యిక్కడికి వస్తుంటే ఏమన్నాడో తెలుసా — నేను భారతదేశం చూస్తున్నందుకు అతనికి ఈర్ష్యగా వుందట—అతనికీ మీ దేశం అంటే గొప్ప అభిప్రాయం వుంది. మీ దేశం ఆడవారి దుస్తులు, ఆచారాలు అంటే అతనికి తగనియిష్టం. నిన్ను కనుక్కుని—అన్నీ తెలుసుకుని రమ్మన్నాడు— లేకపోతే నన్ను పెళ్ళిచేసుకోను అని కూడా అన్నాడు!'

'జూలీ—నిన్ను నూటికి నూరుపాళ్ళు —భారత స్త్రీలాగా, శుద్ధ తెలుగు ఆడపడుచుగా మార్చి అమెరికా పంపిస్తాను—సరేనా—సరాసరి వెళ్ళి రాబర్ట్ కౌగిలిలో వాలుదువు గాని...'

ఆమె నవ్వింది.

అశోక్‌నగర్‌లోని నా యింటి ముందు కారు ఆపాను.

'యింత చక్కటి భవంతికీ—యింత పెద్ద యింటికీ — నువ్వొక్కడివేనా!' అన్నది ఆమె.

'నేను ఒక్కడినే—నాకు ఎవ్వరూ లేరు జూలీ—అమితంగా స్నేహం సంపాదించిన నువ్వు తప్ప నాకు ఎవరూ లేరు!' అన్నాను. నా కళ్ళల్లో నీళ్ళు తిరగటం చూసి, ఆమె నా భుజంమీద చేయి వేసింది—

'రావ్! ఎవరూ లేకపోయినా నీకు మంచి హృదయం వుంది. అదే చాలు నీకు—అయినా నేనుండగా నీకు ఎవరూ లేరనే బాధ ఎందుకు...' అన్నది లాలిస్తూ.

సూట్‌కేస్‌లో నించి కెమెరా కవ్ రేడియోగ్రామ్ తీసి నాచేతికి అందించింది —దానిమీద 'శాంతి సౌభాగ్యాలకీ, సంస్కృతి సంప్రదాయాలకీ నిలయమైన భారతదేశపు ముద్దుబిడ్డడు—నా మిత్రుడు రావ్‌కి—

మిస్ జూలీ నెల్సన్'

అని రాసి వుంది.

ఆమెవేపు దీక్షగా చూసి—'థాంక్యూ జూలీ థాంక్యూ!' అన్నాను.

ఆమెకు మేడమీది గది కేటాయించాను. లోపలకు వెళ్ళింది.

ఒక గంటలో ఆమె తయారయి వచ్చింది. ఆమె వేషధారణ చూసి ఆశ్చర్యపోయాను. లేత ఆకుపచ్చరంగు షిఫాన్ చీర కట్టింది. అదే రంగు జాకెట్ వేసింది—కాళ్ళకి మామూలు చెప్పులు తొడుక్కున్నది. పెదవులకు లిప్‌స్టిక్ కూడా వేయలేదు. ఎర్రని జుట్టుమ దువ్వి కొప్పు చుట్టి రిబ్బన్ కట్టింది. కన్నార్పకుండా చూశాను.

ఆమె నవ్వింది. 'రావ్—బొంబాయిలో భారత స్త్రీనయాను—యిక నీ సహాయం వల్ల ఆంధ్రుల ఆడపడుచు నవాలి!' అన్నది—

పైకి నవ్వినా, నేను వేసుకున్న సూటూ, బూటూ ఒకసారి చూసుకున్ని

# నలుపు-తెలుపు

పిగ్నవేడ్డాను—

కారుని హిమయత్ నగర్ వేపు తిప్పి—అక్కడనుంచి నాంపల్లి స్టేషన్‌మీదుగా ఆబిడ్స్ తీసుకువెళ్లాను. శ్రీ ఏసెస్ బార్ ముందు కారు ఆపబోయాను.

జూలీ అన్నది — 'రావ్—ఇదేమిటి యిక్కడ ఆపావు!'

చిన్నగా నవ్వి, చెయ్యి చూపించి, గుటక వేశాను.

ఆమె మెల్లగా అన్నది 'రావ్—నేను అమెరికన్ యువతినయినా త్రాగటం అలవాటు లేదంటే నువ్వు ఆశ్చర్యపడతావ్—ఆఖరికి రాబర్ట్ కూడా నావల్నే త్రాగటం మానేశాడు. మా దేశంలో అది తప్పు కాదు—పైగా చలిదేశం కనుక అవసరం కూడా — అయినా నాకిష్టంలేదు. యింకేదయినా మీ హోటల్‌కు తీసుకువెళ్లి, మీ భోజనం, మీ ఫలహారాలు పెట్టించు!'—

నేను ఆశ్చర్యంలో నుంచి తేరుకుంటూ కారుని ముందుకు నడిపాను.

'మా దేశం అన్నివిషయాల్లోనూ ముందంజ వేసింది—ప్రపంచంలోనే అగ్రదేశం అయింది. కాని మాదేశంలో శాంతి భద్రతలు లేవు. మీలా మేము నిశ్చింతగా వుండటంలేదు. కన్నకొడుకు తండ్రిని కాల్చటానికి వెనుదీయడు— పైగా అది 'ఎడ్వెంచర్' అంటాడు. ఆడామగా నైట్ క్లబ్బుల్లోచేరి, నగ్ననృత్యాలను ఆనందిస్తారు—పైగా అది 'ఎంటర్‌టెయిన్‌మెంటు' అంటారు. పెళ్లికాని ఆడపిల్లలు ఏకొద్దిమందో తప్ప మానం కోల్పోనివారు అంటూ వుండరు — పైగా అది 'ఎక్స్‌పీరియన్స్' అంటారు— అంతేకాదు రావ్—మోరల్‌గా మాదేశం బాగా వెనకపడింది. అలాకాక చక్కటి కళాసంపత్తితో అలరారే దేశం మీది. మీదేశంలో స్త్రీకి వున్న పవిత్రత, గౌరవం మాదేశంలోలేవు. ప్రతివాడూ ఆడదాన్ని, కామదృష్టితోనే చూస్తాడక్కడ—'ఆమె ఆగింది.

'నువ్విలా మీదేశంగురించి చెడ్డగా చెప్పుకోవటం ఏమీ బాగాలేదు...'

నామాటకు అడ్డువస్తూ అన్నదామె—'లేదు రావ్—నాకు మొదటినుంచీ నిజాన్ని నిర్మొహమాటంగా చెప్పే అలవాటువుంది. మీదేశంలోలా మాకు ఆప్యాయత - అనురాగం, మమతా, మానవతా అంత ఎక్కువగా లేవు. అంతా వ్యాపారసరళిలో జరుగుతుంది. ఒకస్త్రీ, ఒకపురుషుడూ ప్రేమించే పెళ్లిచేసుకుంటున్నారు వారి పెళ్లి వేదిక మీద వెలిగించిన కొవ్వొత్తి ఆరకముందే విడాకులు యిస్తున్నారు. యిక ప్రేమ ఎక్కడ — యిలాగే అన్నివిషయాలూను. యివేవీ నాకు నచ్చవు — అందుకనే రాబర్ట్‌ను నాకు కావలసిన విధంగా తీర్చిదిద్దుకున్నాను—మీ దేశంలోని పద్ధతులు నాకు నచ్చాయి—అవే మేము పాటిస్తాము కూడా...' కాసేపాగి మళ్లీ అన్నది 'రావ్ నా మాటలవల్ల మాదేశాన్ని మరీ చులకనగా అంచనా వేయకు— మా దేశంలోనూ శాంతికాముకులువున్నారు. చక్కగ కాపురాలు చేసుకుంటున్నవాళ్లూ వున్నారు. అనురాగం అందించి, ఆప్యాయత చిందించే వాళ్లూవున్నారు— కాని దేశం క్రమంగా మారిపోతున్నది. అంతా వ్యాపార సరళిలోకి మారిపోతున్నది—అదే నా బాధ!'

హోటల్‌ముందు కారు ఆపాను. ఎయిర్ కండిషన్డ్ ఫామిలీరూంలోకి వెళ్లాము—యిడ్లీ, దోశా తిని ఆమె తన కృతజ్ఞత చెప్పింది.

నవ్వుకుంటూ కారు ఎక్కాం. నెమ్మదిగా ట్యాంక్‌బండ్‌మీదకు పోనిచ్చాను. హుస్సేన్‌సాగర్‌మీది చల్లటిగాలి ప్రాణానికి హాయిగావుంది. ఆమె చేతిలోని కెమెరాతో యధావిధిగా ఫోటోలు తీస్తున్నది—కారుని సికింద్రాబాద్ సరోజినీదేవి రోడ్‌లోకి తిప్పాను.

ఎదురుగా పెద్దగుంపు—పెద్దగా అరుస్తున్నారు—చేతిలో కర్రలు—

'ఏమిటది రావ్!' అడిగింది జూలీ గాభరాగా—

నేనేమీ మాట్లాడలేదు—

'జై తెలంగాణా! ఆంధ్రా డౌన్‌డౌన్!' అరుస్తున్నారు జనం. కనుమూసేంతలో పక్కనేవున్న షాపు అద్దాల షోకేసులు ఫెళాఫెళా అన్నాయి.

'ఏమిటిది రావ్!' అన్నది జూలీ విభ్రాంతితో—

మెల్లగా వచ్చింది నా గొంతులోంచి మాట 'తెలంగాణా ఆందోళన'—

'అంటే'

'అంటే మా తెలుగుతల్లి శరీరాన్ని ముక్కలుగా కోయటానికి చేసే కసాయి ప్రయత్నం!' కసిగా అన్నాను—

'మరి నువ్వూ తెలంగాణా వాడివేనా!' అడిగింది—అమాయకంగా.

'అవును—కాదు—తెలంగాణా ప్రాంతానికి చెందినవాడినే—కాని తెలుగువాడిని—' దృఢంగా అన్నాను.

ఆమెకేమీ అర్థం కాలేదు—కళ్లు టపటప లాడించింది.

నేనూ యికఏమీ మాట్లాడలేదు—కారుకి సడన్‌బ్రేకు వేశాను. ఎప్పుడు అంటించారో కాని, ఎదురుగావచ్చే సిటీ

---

ఇది మీకు తెలుసా?

**తీపి**

తెలకపిండి, బెల్లం కొంచెంగా రోజూ వాడొచ్చు. వాటిలో పిల్లలకి కావలసిన రక్షక పోషక పదార్థాలూ, పిండి పదార్థాలూ ఉంటాయి

వేరుసెనగ మొదలైనవి తరుచుగా వాడాలి.

ఎప్పుడూ పంచదారే కాకుండా తాటిబెల్లం, అచ్చుబెల్లం కూడా తరుచు వాడాలి.

ఉత్సాహానికి, ఉత్తేజానికి కొంచెం తేనె వాడాలి. పంచదారకి బదులు పాలలో తేనె వాడవచ్చు.

పిల్లలకీ, పెద్దలకీ కూడా ఎక్కువ తీపి వాడడం మంచిది కాదు.

భోజనానికి ముందు తీపి పెట్టకూడదు.

భోజన సమయంలో తీపి-ఎప్పుడూ పండు తినడానికి ముందు తినాలి.

—కె. రా.

---



దర్జాగా
మరియు
ఆకర్షణీయముగా
వుండుటకు

# దావణగెరె

వాయిల్‌లులు

'దావణగెరె కాటన్ మిల్స్'—సాంప్రదాయముగా సమకాలిక సౌందర్యమును సమకూర్చును

# నలుపు-తెలుపు

బస్ కాలిపోతున్నది.

జూలీ వింతగా చూస్తున్నది.

'థన్! థన్!' నాకారు బానెట్‌కి రెండు పెద్దసైజు రాళ్లు కొట్టుకున్నయ్—

'తెలంగాణా వర్ధిల్లాలి!' నినాదాలు. తక్షణ కర్తవ్యం అర్ధమయింది— రివర్స్ గేర్‌వేసి కారుని నర్రున బాక్‌చేశాను— బ్రేక్‌వేసి, గేరుమార్చి-వేగంగా ముందుకు దూకించాను. ట్యాంక్‌బండ్ దాటేదాకా, గుండె కొట్టుకుంటూనే వుంది.

తర్వాత కొంచెం తెప్పరిల్లి—జూలీ వేపు చూశాను—ఆమె ఏదో చూడరాని విషయం చూసినట్టుగా యింకా సంభ్రమంలోనేవుంది. నేను చూడటం గమనించి నావేపు తిరిగింది—ఆమెమూపులో ఏదోబాధ కనపడుతూనే వుంది. బహూశా గాంధి, బుద్ధుడు, అహింసా అనుకుంటున్నదేమొ మనసులో—ఆమె ముఖం చూడటానికి సిగ్గువేసింది—తల వంచుకున్నాను—ఆమె ఏమడుగుతుందో అని మనసులో భయం గానేవుంది—కాని ఆమె నిర్లిప్తంగా వూరుకుంది.

నిశ్శబ్దాన్ని భరించలేక నెమ్మదిగా 'ఏదన్నా సినిమాకి వెడదామా జూలీ—' అన్నాను—

'నో— ఏదయినా డాన్స్ ప్రోగ్రాంకి వెడదాం—మీ కూచిపూడి, భరతనాట్యం నేను చూశాను. ఆమెపేరు గుర్తులేదు చాలా బాగాచేసింది. మా దేశంలో ఆమెను బాగా మెచ్చుకున్నారు కూడా— ఆవిడ పేరేమిటి?' అన్నది.

'బాలసరస్వతి...' భరతనాట్యం సంగతి నాకు తెలుసు. మరి అమెరికాలో కూచిపూడి నృత్యం చేసిందెవరు? యామినీ కృష్ణమూర్తా—యింద్రాణి రహమానా— గుర్తురాలేదు. యింకా నయం బయట పడ్డాను కాదు.

ఆమె తల వూపింది, గుర్తు వచ్చినట్టుగా. రవీంద్రభారతి దగ్గర ఆపాను కారు. అక్కడ ఏదో మీటింగ్ జరుగుతున్నది. అయిదారు తెల్లటోపీలు కనపడ్డయ్—

'జూలీ—యివాళ డాన్స్ డ్రామా ప్రోగ్రాంస్ ఏవీ లేవిక్కడ — సినిమాకే పోదాం!' అన్నాను.

'అరె—యివాళిక్కడ ప్రోగ్రాంస్ ఏవీ లేవా—పోనీ యింకో థియేటర్‌కి వెడదాం!' అన్నది.

'మెల్లగా అన్నాను 'మీ దేశంలోలా మాకు డాన్స్, డ్రామాలకు థియేటర్లు ఎక్కువ లేవు — అందుకనే ప్రోగ్రాంస్ తక్కువ. అంతేకాదు—ఏడాన్స్ ప్రోగ్రాం కూడా సామాన్య మధ్యతరగతివారికి అందుబాటులో వుండదు. టిక్కెటు వెల చాల ఎక్కువగా వుంటుంది— నువ్వు చెబితే నమ్మవేమో— మా ఆంధ్రా సాంప్రదాయ ప్రసిద్ధమైన కూచిపూడి నృత్యాన్ని ఆంధ్రదేశపువాళ్లు నూటికి పదిమంది కూడా చూసి వుండరని గట్టిగా చెప్పగలను — యిక డ్రామాలకి యిక్కడ ఆదరం లేదు—'

కారుని వెనక్కి తిప్పి 'ఏ సినిమాకి వెడదాం!' అన్నాను.

ఆమె నిట్టూర్చి- 'తెలుగు సినిమాకి వెడదాం!' అన్నది.

ఈసారి నిట్టూర్చటం నా వంతయింది. ఎందుకంటే జూలీలాటి స్త్రీతో చూడతగ్గ తెలుగు సినిమా ఏదీ ఆ వూళ్లో ఆడటం లేదు. చివరికి వున్న వాటిల్లో మంచి థియేటర్‌కి వెళ్లాం— సినిమా ప్రారంభమయాక టైటిల్ చూసి వులిక్కిపడ్డాను.

ఒక అరగంట చూసేసరికే విసుగు పుట్టింది. ఒక జానపద చిత్ర నిర్మాత —తీసిన అసభ్యకరమైన చిత్ర రాజమది—

'మీ చిత్రాల్లో యింత సెక్స్ వుందేమిటి!' అన్నది జూలీ సాలోచనగా—

'నువ్వూహించిన భారత స్త్రీ రూపం —ఈనాడు వచ్చే చాల తెలుగు సినిమాలలో కనపడదు జూలీ—మా నటీమణులకు చాలమందికి నటనకన్నా అందంకన్నా— అంగప్రదర్శనే ఎక్కువ — నిర్మాతలకూ అదే మక్కువ— మరి ప్రేక్షకుల సంగతే తెలీటం లేదు—' అన్నాను.

సగం సినిమా అయేసరికి నాకేగాక, ఆమెకీ వెగటు పుట్టింది. 'రావ్—మనం వెళ్లిపోదాంలే'—అన్నది.

నేనూ లేచాను 'మీ హాలీవుడ్ సినిమాలు చాల నయం జూలీ—నాలుగైదు ముద్దులతో శృంగారం అయిపోతుంది. మా సినిమాల్లో కుస్తీ పట్లుపట్టే, దొర్లితే కాని శృంగారం అనిపించదు నిర్మాతలకి—మా నటీనటుల పర్సనాలిటీలు చూశావుగా...' అన్నాను.

ఆమె అదో రకంగా నవ్వింది.

హోటల్‌లో మూన్‌లైట్ డిన్నర్ ముగించి యింటికి వచ్చాం—

సినిమా చూస్తున్నప్పుడు ఒక పాటకి అర్ధం అడిగింది జూలీ—చెప్పలేక సిగ్గుపడి నోరు మూసుకున్నాను. అందుకని—



మన పాటలు అన్నీ అటువంటివే కావని నిరూపించటానికి రికార్డ్ ప్లేయర్ మీద కొన్ని మంచిపాటలు వేశాను. ప్రతి పాటకీ అర్థం అడుగుతూ దీక్షగా విన్నది. కొన్ని త్యాగరాజ కీర్తనలు వినిపించాను. పరిశీలనగా వింది. జయదేవుని అష్టపది 'యారమితా వనమాలి' దగ్గర నుండి దేవులపల్లి 'మధురానగరి సమీపంలో, మలయామారుత సమీరంలో' వరకు అన్నీ వినిపించాను.

'మీ పాటల్లో, ప్రక్కవాయిద్యాల మోత కన్నా, కంఠానికి రాగానికీ ఎక్కువ ప్రాముఖ్యం వుంది!' అన్నది మెచ్చుకుంటూ.

మరునాడు ప్రొద్దున్నే ఆమెను మార్కెట్టుకి తీసుకువెళ్ళి చీరెలూ, మననగలూ కావలసినవి కొనిపించాను—నా ఫ్రెండ్ శైలజ సహాయంలో జాలి ఆంధ్రుల కట్టూ బొట్టూను, అలవాట్లనూ తెలుసుకున్నది — మధ్యాహ్నం దాకా సిటీలో చూపించదగినవి చూపించాను. తర్వాత కారులో బయల్దేరి మా ఊరు వెళ్ళి—సాయంకాలానికల్లా తిరిగి వచ్చాం— జానీ ఆ పల్లెటూరి వాతావరణాన్ని— ప్రకృతిని తన్మయత్వంలో తిలకించింది. లేగ దూడలతో ఆడుకున్నది. ఆమెకు అన్నివిధాలా నచ్చుతుంది మా వూరు. కాని నేను ఏది జరగకూడదనుకున్నానో అదే జరిగింది. మురికి కూపాలలో మగ్గిపోతున్న వాళ్ళనూ—ఆకలితో కడుపులో కాళ్ళు పెట్టుకు కూర్చున్న పేద వాళ్ళనూ—యింకా యింకా ఎన్నో ఆమె చూడకుండా వుంటే బాగుండేది అనుకున్న వాటి నన్నింటినీ చూసింది. అంతేకాదు ఆ పల్లెటూళ్ళలో పదవులకోసం జరిగే దౌర్జన్యాలనూ చూసింది—అన్నిటికీ మించి భారతదేశంలో స్త్రీ వాస్తవంగా ఏస్థితిలో వున్నదీ పరిశీలనగా చూసింది. ఇవన్నీ ఆమెకి ఎలా తెలిసినయి అని కాదు అడగవలసింది. ఆమె కుతూహలంగా అందర్నీ అడిగి తెలుసుకుంటున్నప్పుడు నోటమాట రాక చూస్తూ నుంచున్న నన్ను అనాలి.

ఆమె ఊహించుకున్న భారత స్త్రీ రూపం చెదిరిపోయిందేమో—తిరుగు ప్రయాణంలో ముభావంగా వుంది.

ఆరోజు రాత్రే ఆమె, ట్రెయిన్లో




జమ్మలకోట సీతారావు

రంగులరాట్నం

కుక్క తెగల్లో అల్సేషియను చాల ప్రసిద్ధమైనది. జర్మనీలో గొర్రెల కాపరి కుక్కలని ఉన్నాయి. వాటిల్లో ఒక దాన్ని ప్రత్యేకంగా ఎన్నుకొని, స్టెఫనిట్ అనే జర్మను వ్యక్తి అల్సేషియను తెగకి మూలకారకుడయ్యాడు. ఇంగ్లండులో దీన్ని తోడేలు కుక్క అని కూడా అంటారు. సగం తోడేలు లక్షణాలు దీనిలో కనబడతాయి. అయితే అల్సేషియను తెగ ఒక్కసారిగా రాలేదు. కొన్ని సంవత్సరాలపాటు ఈ శతాబ్దారంభంలో రకరకాల జర్మను గొర్రెల కాపరి కుక్కల లక్షణాలు కలిసి ఇది ఏర్పడింది. తురింజియను, స్వేబియను, వర్టెన్‌బర్గ్ రకాలనుండి వరుసగా వెన్నెల లక్షణాల్ని, నడకని, ఇతర ముఖ్యలక్షణాల్ని అల్సేషియను సంతరించుకొంది. తెలుపు తప్ప మిగతా సాధారణ రంగులన్నీ అల్సేషియనులో కనబడతాయి.

మొదటి ప్రపంచ యుద్ధంలో ఈ తెగ చాల ఉపయోగపడింది. జర్మనీ నుండి మొదట ఇంగ్లండుకు చేరాయి. యుద్ధం రాగానే ఈ దిగుమతి ఆగింది. యుద్ధం అయిపోగానే ఇంగ్లండు నుంచి అమెరికా, కెనడా మొదలైన దేశాలకు వీటిని తీసికొనిపోయారు.

ఈనాటి వయసు మళ్ళినవారికి 'రిన్ టిన్ టిన్' సినిమాలు గుర్తుండే ఉంటాయి. 'స్ట్రాంగ్ హార్ట్' 'రిన్ టిన్ టిన్' అనే కుక్కలు జర్మనీనుంచి అమెరికా వచ్చి ప్రసిద్ధ సినిమాతారలయ్యాయి. అప్పటినుంచి ప్రజల్లో అల్సేషియను తెగమీద మోజు ఎక్కువయింది. దీనితో మోసకాళ్ళు బయలుదేరి ప్రతిదాన్ని అల్సేషియను అని అమ్మి దాని విలువ తగ్గించేసారు. ఇంగ్లండులో అల్సేషియను ప్రకారంగా ఒకర్ని కరవడం వల్ల కూడా దీని మీద భయం కల్గింది. ప్రజలు దీన్ని తోడేలుగా భావించసాగారు. 1930 ప్రాంతాలలో ఇది పరిస్థితి. కాని 1940 ప్రాంతాల్లో తిరిగి దీనిమీద మోజు, ప్రజల అభిమానం పుంజుకొంది. రెండవ ప్రపంచ యుద్ధంలో కూడా ఇది బాగా పని చేసింది. ఎన్నో విధాలుగా సహకారి అయింది. కాపలాదారుగా, వార్తాహారిగా ఎంతో పని చేసింది. యుద్ధానంతరం పోలీసుశాఖలో ఎంతో ఉపయోగకారి అయింది. దీనికి ప్రత్యేకంగా శిక్షణ నిస్తున్నారు. గుడ్డివాళ్ళకి సహాయం చెయ్యడం దీని ప్రత్యేకత. నమ్మకానికి సేవాపరాయణత్వానికి అల్సేషియనుకు సాటిలేదు. చెప్పిన విద్యల్ని సులభంగా నేర్చుకొంటుంది. గుర్తుంచుకొంటుంది. అంతేకాక ఇతరుల మోసాలకి సులభంగా లొంగదు. తెలివిగా ప్రవర్తించడంలోనూ, దొంగలను ఎదిరించడంలోనూ దీనికి సాటి లేదు

# నలుపు-తెలుపు

బొంబే ప్రయాణమయింది. మరునాడే బొంబేనుంచి టోక్యో వెడతానని చెప్పింది. మాదేశం గురించి నీ అభిప్రాయం ఏమిటి అని నేను అడగలేదు. అడగటానికి భయపడ్డాను — కాని ఒకందుకు సంతోషించాను— ఆమె ప్రస్తుత భారతదేశ పరిస్థితిని ఈ కొద్ది సంఘటనలవల్లా కొంత వూహించగల్గినా—ఆమె యింత కన్నా ప్రస్తుతం జరుగుతున్న ఘోరాలను చూడలేదు కనకా—చూసి మనసు బాధపడి—తను వూహించిన దేశాన్ని వూహల్లోనే వుంచుకుంటే బాగుండేదే అని వాపోయే అవకాశం రానివ్వలేదు కనుకా సంతోషించాను. అయినా ఆమె బాగా నిరుత్సాహ పడినట్లు తెలుస్తూనే వుంది—

'ఉత్తరం వ్రాస్తావ్ కదూ—రాబర్ట్‌ని అడిగానని చెప్పు' అన్నాను పాకెట్‌లోని వెండి నటరాజ విగ్రహాన్ని ఆమెకు యిస్తూ—

ఆమె నవ్వుగానవ్వి 'థాంక్యూ' అన్నది.

రైలు కదిలింది. చేయివూపాను— ఆమె చిరునవ్వు ముఖం కనుమరుగైంది.

భారత దేశంమీద ఎంతో గొప్ప అభిప్రాయంతో వచ్చిన ఆమె — యిక్కడ చూసిందేమిటి?—అసలు నిజంగా అంత గొప్పదయిన మనదేశం ఎటు వెడుతోంది——ప్రగతిమార్గానా? — అవనతిపథానా?—ముందుకా? వెనక్కా? మంచి కోసమా? చెడుకోసమా? — ఏమిటో — బాధ కలిగింది. మన దేశంమీదవున్న అంత మంచిఅభిప్రాయాన్నీ పోగొట్టుకోడానికే ఆమె యిక్కడకు వచ్చినట్లుంది—నిట్టూర్చటం తప్ప ఏమీ చేయలేకపోయాను.

తర్వాత నెలరోజులకు ఆమె దగ్గర నుండి వుత్తరం వచ్చింది— వణుకుతున్న చేతులతో కవరు చించాను. ముత్యాల్లాంటి అక్షరాల్లో జాన్ రూపం కనిపించింది—

డియర్ రావ్—

మా టూర్ అంతా పూర్తి చేసుకుని నిన్ననే యిక్కడకు వచ్చాము. నేను నీతో ఎన్నో చెబుదామనుకుని — ముఖాముఖి ఎదురవగానే ఏమీమాట్లాడలేక పోయాను. నువ్వేమీ అనుకోలేదు కదా!

పవిత్రమైన అభిప్రాయంతో మీ దేశం వచ్చాను. అదే అభిప్రాయంతో మీ దేశ పరిస్థితులను క్షుణ్ణంగా పరిశీలించాను. బొంబాయిలోనూ, హైద్రాబాద్‌లోనూ, మీ వూళ్ళోనూ—కావాలనే అడిగి ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. అసలు హైద్రాబాద్ రాకముందే, బొంబాయిలోనే ఈనాడు సామాన్య భారతీయుడు ఏ పరిస్థితుల్లో జీవిస్తున్నదీ — ఎంత అసంతృప్తితో గడుపుతున్నదీ గ్రహించాను.

శాంతికి, సౌభాగ్యానికి పుట్టినిల్లయిన మీదేశం, ప్రస్తుతం అశాంతితో, అక్రమాలతో, దౌర్జన్యాలతో నిండివుంది. నీతి, నిజాయితీలకు నిలయమైన మీదేశంలో అవినీతి, అన్యాయం స్థానం చేసుకున్నాయి, విశిష్టకళా సంపత్తితో, సంస్కృతితో. చరిత్రలో విలసిల్లిన మీ దేశంలోని ప్రజలు — నేడు కళా విహీనమైన చౌకబారు సరదాలనీ, దురాచారాలనీ, అలవాట్లనీ ప్రోత్సహిస్తున్నారు. పవిత్రతకీ, త్యాగానికీ, అనురాగానికీ, చిహ్నమయిన మీ భారతస్త్రీ — చాల విచారకరమైనస్థితిలో వున్నది. విశిష్ట ధనసంపత్తితో తులతూగిన మీదేశం—నేడు కడుదారిద్ర్యంతో భార్యనే అమ్ముకునే భర్తలను కూడా చూసే స్థితిలో వుంది. దేశాన్ని సక్రమంగా పరిపాలించవలసిన నాయకులలోనే, క్రమశిక్షణలేక పదవీ పోరాటం సాగించే దుస్థితిలో వున్నది మీదేశం.

నేను మీదేశ చరిత్ర చదివి వూహించుకున్న దేమిటి? ఏ చుట్టూవున్న వాతావరణాన్ని నేను సరిగ్గా గ్రహించుకోకూడదని— మీ దేశస్థితిని తెలుసుకుని నేను బాధపడకూడదని నువ్వు చాల విధాల ప్రయత్నాలు చేయటం నేను గమనించాను — కాని రావ్—నాకు మీదేశంమీద వున్న సదభిప్రాయం, మర్యాద, ఏమాత్రమూ పోలేదు. పైగా పెరిగినయి కూడా—మీదేశం నాకు అన్నివిధాలా నచ్చింది. చాల బాగానచ్చింది. ఎంతబాగా నచ్చిందీఅంటే—మాదేశంవదిలి కొన్నాళ్ళు మీ దేశంలోనేవుండి మీ కష్టసుఖాలను పంచుకుందామనేంతగా నచ్చింది—ఆశ్చర్యపోతున్నావా?

మీ దేశంగురించి సేవక విధమైన జీవితమన్న తర్వాత కేస్టిలూ...

సుఖాలూ కలసివుండేవే. అలాగే ప్రకృతి అన్న తర్వాత చీకటీ, వెలుతురూ—నలుపూ — తెలుపూ వుండవలసిందే. అలాగే దేశకాల పరిస్థితులు ఎప్పుడూ ఒకలా వుండవు. ఎన్నో సంవత్సరాలు, ఎన్నో విషయాలలో ప్రగతి పథంలో కాంతులు విరజిమ్మిన మీ దేశం ఈనాడు మళ్లీ చీకటిలోకి పోతున్నది. నువ్వూ—నీలాటి యువకులు — చీకటిలోకి పోతున్నామే[illegible]అని బాధపడటం, చీకటిలోవున్న మమ్మల్ని యితరులు గేలిచేస్తారే అని భయపడటం కాదు చేయవలసింది. ధైర్యంగా ఆ చీకటిని పారద్రోలి—వెలుగులోకి రావటానికి ప్రయత్నించాలి. నీ వక్కడివల్లా అది కాకపోవచ్చు. కాని నీలాటివాళ్లు కొంతమంది కలిస్తే—మళ్లీ చైతన్యం వస్తే — వెలుగు దానంతట అదే వస్తుంది—ప్రస్తుతం మీ దేశానికి పట్టిన జబ్బుకు ఒకటే మందు — అదే నవ చైతన్యం. ఆమందు యివ్వటానికి అర్హులైన డాక్టర్లు—మీరే—భారత నవ యువకులు. భారతదేశం మీది. ఎందరో ప్రాణాలర్పించి మీ కోసం సంపాదించి పెట్టిన పవిత్రభూమి అది. ఈ నాడు కొందరు దురహంకారులు, పదవీ వ్యామోహులు, అవినీతిపరులు—దేశాన్ని నాశనం చేస్తే రేపు భరించవలసింది మీరు. ఈనాడు మీదేశం చేస్తున్న అప్పులను రేపు తీర్చవలసింది కూడా ఈ యువకులు మాత్రమే! — ఎందరో మహాత్ములు, శాంతియజ్ఞంలో సాధించిన స్వాతంత్ర్యాన్ని, ఈ నాడు కొందరు స్వార్థపరులు పార్టీల పేరుతో నమిలి మింగేస్తే —రేపు బాధపడవలసింది మీరు — నవ యువకులు —

అంతేకాదు—రామకృష్ణుడూ, వివేకానందుడూ బోధించిన ఆధ్యాత్మిక చింతనను మరచి — విదేశీయులు సైతం మీ ఆధ్యాత్మిక జీవనాన్ని కోరే సమయంలో — ఆ విదేశ ఆచార వ్యవహారాలపై మోజు పడుతున్న మీ ప్రజలలో చైతన్యం రావాలి — నల్లబజారుల్లో నాట్యమాడే అన్యాయాన్నీ, అవినీతినీ, అక్రమాన్నీ పారద్రోలి. సంఘ విద్రోహక శక్తుల్ని నాశనంచేసే మహాయజ్ఞం ప్రారంభం కావాలి — స్వార్థంలో వివేకావివేకాలను మరచి—డబ్బు చేసుకుంటున్న ప్రజానాయకులలో మార్పు రావాలి—

కాని ఎలా...?— 'ఏ పార్టీ ఆమార్పు తేగలదు ?' అని కాదు ఆలోచించవలసింది. మీరు...భారతదేశపు నేటి పౌరులు —ముఖ్యంగా నవ యువకులు—ఆ మార్పు తేవాలి—నవయువకుల పార్టీ ఆ మార్పు తేవాలి. కాని ఎలా...? సామాన్య మానవుడి అతి సామాన్య మేధస్సుకి తట్టేది—వయొలెన్స్—ఎగ్రెషన్ — దౌర్జన్యం — హింసాకాండ— కాని 'అదికాదు కార్యాల్ని సాధించేది' అని చెప్పే చరిత్ర మీకు చాలవుంది. అదే సరియైన మార్గం. మీ నవచైతన్య యజ్ఞానికి ప్రాణం అదే—శాంతి—అహింస. మీ దేశప్రజలరక్తంలో రక్తకణాల్లో ఆ పదార్థం వుంది. శాంతి, అహింస మీ సొత్తు. ఇప్పుడు వాటినే వాడి మీ దేశంలో అలుముకున్న చీకటిని పారద్రోలి—వెలుగును తీసుకు రావలసిన బాధ్యత—మీ మీదనే వున్నది.

యింకో విషయం—మీ దేశంలో కష్టపడకుండా ధనసంపాదన చేయాలనే కోరిక చాలమందిలో కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. ఈ విషయంలో మా దేశపద్ధతిని మెచ్చుకుని తీరాలి. ప్రతివాడూ కష్టపడి డబ్బు సంపాదించటానికే ప్రయత్నిస్తారిక్కడ. దానివల్ల అటు దేశమూ సౌభాగ్యవంతమవుతుందనీ, యిటు తామూ హాయిగా బ్రతుకవచ్చనీ మా వాళ్లు అనుకోవటమే దానికి కారణం.

నాది మీ దేశంకాదు. కాని మీ దేశం అంటే నాకు ప్రాణం. అందుకే నా మనసులోని ఆవేదనను—వ్యక్తపరిచాను. నన్నింకోలా భావించుకోవనీ, నా బాధను అర్థం చేసుకుంటావనీ ఆశిస్తున్నాను —

అంతేకాదు— నేను ఈసారి రాబర్ట్‌తో సహా— మీ దేశం వచ్చేటప్పుడు—మీదేశం నవచైతన్యంతో తొణికిసలాడుతూ వుంటుందనీ—నా ప్రియమైన మీ దేశం నేను వూహించిన దానికన్నా ఎన్నోరెట్లు శాంతి సౌఖ్యాలతో అలరారుతూ వుంటుందనీ ఆశిస్తున్నాను—

—నీ జూలీ నెల్సన్.

ఉత్తరం చదవటం పూర్తిచేసి ఆలోచనలలో నుంచి తేరుకునేసరికి — చీకటి పడింది. దృఢ నిశ్చయంతో లేచాను. స్విచ్ నొక్కాను. తెల్లటికాంతులు విరజిమ్ముతూ వెలిగిన లైటు వెలుతురులో—రేడియో బల్లమీదవున్న గాంధిజీ విగ్రహం కనపడింది. ●






### జరిగిన కథ

కళ్యాణి ఆ ఆఫీసులో కొత్తగా చేరింది. అక్కడ పని చేస్తున్న వారందరిలోను మురళిపై ఆమెకి సదభిప్రాయం ఏర్పడింది. ఆ సదభిప్రాయమే ఆమెని అతనికి సన్నిహితురాలిగా చేసింది. ఆఫీసులో లోటిహరి విసుర్లు ఆరంభ మయ్యాయి. ఒకరోజు కళ్యాణి తన పుట్టుపూర్వోత్తరాలని మురళికి చెప్పబోగా, మురళి పూర్తిగా వినకుండానే ఆమెనుంచి సెలవు తీసుకున్నాడు. కళ్యాణి మనసు పరిపరివిధాల పోయింది.

౩

గోదావరిజిల్లాలో పల్లె, పట్నమూ కాని సామాన్యమైన వూరు అది.

పదేళ్ల కళ్యాణి 'స్కూలుకి వెళ్లి చదువుకుంటాను' అంటూ మారాం చేసినప్పుడు 'ఇదేం చోద్యమే' అన్నట్లు బుగ్గలు నొక్కుకుంది వాళ్ల అమ్మమ్మ కనకవల్లి.

అంతవరకూ ఆ యింటి ఆడపిల్లలు ఇంట్లో మేష్టర్ని పెట్టుకుని కొద్దో గొప్పో చదువుకునేవారే కాని స్కూల్లో జేరటం పరిపాటు కావటం అనేది జరగలేదు—అలాగే కళ్యాణికి. ఆమె అక్కవాళ్లకి చదువు చెప్పటానికి ఒక మేష్టర్ని ఏర్పాటు చేశారు. రోజూ వచ్చి, ఓ గంట సేపు కూర్చుని ఏదో మొక్కు చెల్లించినట్లు, పురాణం వినిపించినట్లు ఆ మేష్టరు చెప్పే చదువుతో కళ్యాణి తృప్తి పడలేకపోయింది. అసలు, చిన్నతనంనుండీ కళ్యాణి తత్వం, అభిరుచులూ ఆ యింటి వాతావరణానికి, ఆ మనుష్యుల అభిరుచులకీ భిన్నంగానే వుంటూ వుండటమే కాకుండా తను అనుకున్నది జరిగి తీరాలి అనే పట్టుదలకూడ వుండేది ఆ అమ్మాయిలో—ఆ పట్టుదలే కళ్యాణి స్కూల్లో జేరటం విషయంలోకూడ తల్లి వనజాక్షి చేత సరే అనిపించేలా చేసింది.

ఓ ఉదయం కళ్యాణి మేనమామ రాఘవులు ఆ పిల్లని వెంటపెట్టుకుని స్కూలుకి తీసుకు వెళ్లాడు. రాఘవులు కూడ కొన్నాళ్ల క్రిందట ఆ స్కూల్లో చదువుకున్నవాడే—ఒకటో క్లాసు ఒక ఏడు రెండో క్లాసు రెండేళ్లు అన్నట్లుగా కొంతకాలం చదివి ఇంక ప్రయోజనం లేదని విసుగొచ్చి మానేశాడు మధ్యలోనే—తర సంగతి తెలియనివాళ్లతో మాత్రం, 'ఇక్కడి స్కూలుఫైనల్ అయిపోయింది—కాలేజీ చదువుకి మరోవూరు పోవటం ఇష్టంలేక చదువలేదు.' అని గొప్పలు చెప్పుకుంటాడు పాపం—

స్కూలుని, అక్కడి పిల్లల్ని, చదువుని గురించి ఏమిటో వూహించుకుంటూ పుస్తకాలు సర్ది పెట్టుకున్న కళ్యాణికి, అమ్మమ్మ తనకి చేయబోయిన ముస్తాబు విషయం మాత్రం బొత్తిగా నచ్చలేదు—అయినా చదువు విషయంలో తన పంతం నెగ్గింది కదా అనే తృప్తితో మరి పేచీ పెట్టకుండా వూరుకుంది—తమకు కలిగింది పది మందికీ ఆడంబరంగా చూపించుకోవాలి అనే తహ తహతో మనవరాలికి జానెడు వెడల్పు జరీ అంచు పట్టు పరికిణీ కట్టి మెడలో రెండు వరసల పలకసర్లు చేతులకి మూడు జతల బంగారు గాజులు, చెవులకి ముత్యాలు, కెంపులు పొదిగిన జూకాలు, జడకి బంగారపు జడ గంటలు అన్నీ పెట్టి ముస్తాబుచేసి మరీ పంపిం చింది కనకవల్లి—

కొత్తగా జేర్చుకోబోయే ముందు అందరినీ పరీక్ష చేసినట్లే కళ్యాణికి కూడ అన్ని సబ్జక్టులలోనూ నాలుగేసి ప్రశ్నలతో పేపర్లు ఇచ్చారు—వాటికి కళ్యాణి సమా

ఖానాలు వ్రాయటం, మాష్టర్లు చూసి పాస్ చెయ్యటం, జీతం తీసుకుని రిజిష్టరులో పేరు వ్రాయించటం అన్నీ అయే సరికి వో పూట గడిచిపోయింది—మధ్యాహ్నం క్లాసులు ప్రారంభం అవుతూవుంటే ప్యూన్ రామస్వామి కళ్యాణిని వెంట పెట్టుకుని ఫస్టుఫారం క్లాసుకి తీసుకు వెళ్ళాడు—అంతకు ముందే తరగతిలోకి వచ్చి పుస్తకం తెరవబోతున్న తెలుగు మేష్టారు కళ్యాణిని చూసి తెగ ముచ్చట పడిపోతూ—

'రామ్మా—ఇలా కూర్చో.' అంటూ చిరునవ్వుతో పలకరించాడు—తెలుగు మేష్టారు అంటే అపర దుర్వాసుడే అని హడిలి పోతూ ఆయన క్లాసులోకి రాకముందే అచ్చు పుస్తకాలూ, నోటుపుస్తకాలూ తెరిచి పెట్టుకుని, ఎప్పుడు ఎవరిని ఏ ప్రశ్న వేస్తారో అనుకుంటూ గజ గజలాడిపోతూ కూర్చునే నలభైమంది అబ్బాయిలూ, అమ్మాయిలూ, ఆయన కోపం సంగతికూడ మరిచిపోయి ఆ కొత్త అమ్మాయిని చూస్తూ వుండిపోయారు — బిడియంగా మెల్లిగా లోపలికి వస్తున్న కళ్యాణిని ఎవరి మట్టుక్కివారే తమ ప్రక్కన కూర్చో పెట్టుకోవాలి అన్న సరదాతో కాస్త కాస్త సర్దుకుని ప్రక్కన చోటు చూపించ బోయారు అమ్మాయిలంతా—కాని ఏ ఇద్దరి మధ్యా ఇరుకుగా కూర్చోటం ఇష్టంలేని కళ్యాణి మరి కాస్త ముందుకి వెళ్లి వెనక బెంచీ చివరగా కూర్చుంది. ఆ చివర కూర్చున్న సుమతికి అందలం ఎక్కినంత సంతోషం కలిగింది.

'కలెక్టరుగారి మనవరాలేమో—ఉహూ, కొత్తగా వచ్చిన డాక్టరుగారి అమ్మాయేమో.' అనుకుంటూ వూహలు అల్లుకుంటూ, ఎప్పుడు స్కూలు అయిపోతుందా ఎప్పుడు కళ్యాణిని గురించి వివరాలు తెలుసుకుందామా అన్న ఆత్రంతో ఆపూట పాఠాలు కూడ శ్రద్ధగా వినటం మానేసి మధ్య మధ్య కళ్యాణివేపు చూస్తూనే వున్నారు అమ్మాయిలంతా - చివరికి ఆఖరి పిరియడ్ కూడ అయిపోయి బెల్ మ్రోగింది. మాష్టారు ఇంకా పూర్తిగా గుమ్మం అయినా దాటకుండానే అమ్మాయిలంతా బిలబిల కళ్యాణి చుట్టూ గుమిగూడిపోయారు.

'మవ్వు రోజూ ఇలాగే పట్టుపరికిణ కట్టుకుని, గొలుసులూ అవన్నీ వేసు కొస్తావా—మీ అమ్మనాన్నా ఏమీ అనరా—చిన్నపిల్లలం ఒక్కళ్లం వెళ్ళి వస్తూ వుంటాం కదూ, ఊర్లో దొంగలెవరైనా వుంటే ఎత్తుకుపోతారనీ నామెడలోవుండే ఆంజనేయులు బిళ్లకూడతీసి దాచేసింది మా అమ్మ.' అంది సీతారత్నం అనే ఆ అమ్మాయి కళ్యాణి బట్టలవంకా నగల వంకా ఆసక్తిగా చూస్తూ.

'మీ ఇల్లెక్కడ—ఇదె నేనూ పెద్ద బజారులోంచి వెళ్లి పంచెరపుట వెళ్తాం. మీ ఇల్లుకూడ అటే అయితే మాతో కూడ రా.' అంది సావిత్రి అనే అమ్మాయి మరో రెండు జడల అమ్మాయి భుజం మీద చెయ్యివేస్తూ.



'అసలు—మీ నాన్నగారి పేరేమిటి— ఆయనేం వుద్యోగం చేస్తారు. మీరిక్కడకు కొత్తగా వచ్చారా' అంది శమంతకమణి. మిగిలిన వాళ్లంతా ఈ ముఖ్యమైన ప్రశ్న వదిలేసి ఏమేమిటో అడుగుతున్నారు అన్న ధోరణిలో.

ఒక్కసారి అంతమంది చుట్టూ చేరి అలా ప్రశ్నల వర్షం కురిపిస్తూంటే బిత్తర పోయినట్లు చూస్తూ నిలబడిపోయిన కళ్యాణి ఈ ఆఖరి ప్రశ్నతో మరీ ఖంగారుపడిపోయింది—ఆపిల్ల కళ్లలో నీళ్లు కూడ తిరగబోయాయి. 'నాన్న—నాన్న పేరు వీళ్లు అడుగుతున్నారు—తనేం చెప్తుంది—అమ్మ, అమ్మమ్మా, అక్కయ్యా, మామయ్యా తప్పితే నాన్న అని తను ఇంత వరకూ ఎవరినీ పిలవలేదు—ఆ ప్రశ్నకి సమాధానం ఏం చెప్తుంది.'

కళ్యాణి ఎంత జాగ్రత్తగా వుండాలనుకున్నా ఆ పిల్ల కళ్లల్లో నీటిపొర కొంతమంది కంటపడనే పడింది. ఆ దైన్యాన్ని మరోలా అర్థం చేసుకున్న ఒకరిద్దరు,

'అయ్యో పాపం—మీ నాన్నగారు లేరా—నీ చిన్నప్పుడే చచ్చిపోయారా' అంటూ సామభూతి కురిపించబోయారు.

'మనవూరి కలక్టరుగారి అమ్మాయనుకున్నాను, కాదుట' అని ఒకరు, 'కొత్తగా వచ్చిన డాక్టరుగారి మనవరాలనుకున్నాను—ఉహుం. —పాపం కళ్యాణి నాన్నగారు లేరుట' అని ఒకరు జాలి పలకబోస్తూంటే ఏం చెప్పాలో ఎలా చెప్పాలో తెలియని కళ్యాణికి భోరున ఏడవాలనిపించింది—అతి ప్రయత్నంమీద నిగ్రహించుకుంది, కాని ఏమీ సమాధానం చెప్పకుండా వెళ్లిపోవటానికి ధైర్యం చాలలేదు. ఇవాళ తప్పించుకుని వెళ్తుంది. వీలైతే రేపుకూడ తప్పించుకుంటుంది—కాని, అలా ఎంతకాలం జరుగుతుంది—ఏదో ఒకనాటికయినా ఆ ప్రశ్నకి సమాధానం రాబట్టుకోకుండా వూరుకుంటారా? అదే ఏమని చెప్పాలి' అని ఆలోచిస్తూంటే తన అమ్మమ్మ పేరు ఆ వూళ్లో అందరికీ తెలిసివుంటుందని, ఆమె పేరు చెప్పగానే తను ఫలానా అని వాళ్లంతా గ్రహించుకోగలరనీ ఆ చిన్నారి మనస్సులో ఒక నమ్మకంలాంటి భావం కదిలింది. అందుకే మెల్లగా అంది, 'మా అమ్మమ్మ పేరు

# ఆచరణలో ...

కనకవల్లి' అని

'కలకవల్లా?' అయిదారు కంఠాలు ఒక్కసారే అడిగాయి. 'అంటే ఎవరు, ఎక్కడుంటారు' ఏ జమీందారిణి గురించో వినబోతున్నట్లు ఆసక్తిగా కళ్లు విప్పార్చుకుని మరీ చూశారు.

కాని అంతకన్న మరి వివరాలు చెప్పకలిగే శక్తిగాని ఆసక్తిగాని కళ్యాణికి లేకపోయింది. అందుకే అసలా ప్రశ్నే వినిపించుకోనట్లు, 'నే వెళుతున్నా' అంటూ సంచీ బుజాన్న తగిలించుకుని క్లాసు బయటికి వచ్చేసింది.

కొద్ది రోజులలోనే కళ్యాణి ఎవరో ఇంచుమించు అందరికీ తెలిసిపోయింది. ఆపిల్ల నోరువిప్పి చెప్పుకో అక్కర్లేకుండానే—మొట్ట మొదటి రోజు క్లాసందర్నీ ఆకర్షించుకుని ఆకట్టేసుకున్న కళ్యాణికి క్రమంగా సరదాగా మాట్లాడే తోడుకూడ కరువయిపోయి నట్లయింది — కళ్యాణి ఒక జట్టూ మిగిలిన అమ్మాయిలంతా ఒక జట్టుగా చీలిపోయారు — ఎప్పుడైనా వో కొత్త అమ్మాయి జేరటం తటస్థిస్తే, క్లాసందరిలోకి చుక్కల్లో చంద్రుడిలా మెరిసిపోతున్న కళ్యాణి స్నేహంకోసం తెగ వుబలాట పడిపోయి తనే పలకరించి స్నేహం కలుపుకునేది. కాని కొద్దిరోజుల లోనే మళ్లీ కళ్యాణిపట్ల అయిష్టత ఏర్పరుచుకుని రెండో జట్టులో చేరిపోయేది. వాళ్లకి కళ్యాణికీ మధ్య ఏనాడూ పోట్లాట జరగలేదు. మాటా మాటా పెరగలేదు కాని, వాళ్ల చూపులలో నడవడిలో, 'హు, నువ్వు మాతో స్నేహం చెయ్యటానికి అర్హురాలివి కాదు — మేము పరువూ ప్రతిష్ఠ కలిగిన గొప్ప కుటుంబాల లోంచి వచ్చిన అమ్మాయిలం — మాలాంటి మర్యాదస్థులతో నువ్వెక్కడ సరితూగగలవు?' అనేభావం కళ్యాణి స్పష్టంగా గుర్తించగలిగేది. 'నన్ను చూస్తేనే వీళ్లకి అలుసు, ఏగిసంపు—నాతో ఎవ్వరూ కలవరు,' అనుకుంటూ విలవిల్లాడిపోయేది ఆ పసిమనసు.

ఇంట్లో మనష్యులన్నా పరిసరాలన్నా కళ్యాణికి మొదటినుండీ ఏవగింపే. ఇంక స్కూల్లో వున్న కాస్సేపయినా తనతో సరదాగా ఖబుర్లు చెప్పే తననో నేస్తురాలిగా అభిమానించే వ్యక్తి కరువవటంతో మనస్సు ఎంతగానో గాయపడినా, 'నేను బాగా పెద్దచదువులు చదువుకుంటాను, మంచి వుద్యోగం సంపాదించుకుంటాను. మర్యాదగా ఎంతో గౌరవంగా బ్రతుకుతాను.' అనుకుంటూ భవిష్యత్తులోకి దృష్టి సారించి తోటి పిల్లల నిర్లక్ష్యాన్ని అలక్ష్యం చేయటం అలవాటు చేసుకుంది.

స్వతహాగ తెలివికలది కావటంవల్లనూ, ఇంటాబయటా స్నేహితులనే వాళ్లులేక పుస్తకాలనే ఆప్తులుగా చేసుకుని అస్తమానూ కాలం గడపటంవల్లా కళ్యాణి ఎప్పుడూ క్లాసులో ఫస్టుగానే వస్తూ వుండేది. అదికూడ మిగిలిన వాళ్లకి ఒంటికి కారం రాసుకున్నట్లే వుండేది.

కాలం గడుస్తున్నకొలదీ, పిల్లలు పెరిగి పెద్దవాళ్లవటంతోపాటు కొంతమంది మొగపిల్లలు ఆడపిల్లల్ని ఏడిపించే పద్ధతిలోనూ మార్పులు వచ్చాయి. వాళ్ల అల్లరికికూడ అందరిలోకి ఎక్కువగా కళ్యాణే గురి అవుతూవుండేది— 'సహాధ్యాయినులని ఇలా ఏడిపించి వాళ్లుపొందే ఆనందం ఏమిటి? చిన్నక్లాసులలో ఎంతో అమాయికంగా వుంటూ తోటి విద్యార్థినులని తోబుట్టువులలాగే అభిమానిస్తూ వుండే విద్యార్థులలో కొంతమంది కాస్త వయస్సు వచ్చేసరికి ఇలా అల్లరిమూకలా ఎలా తయారవగలరు? వాళ్ల తోబుట్టువులని కూడ ఇలాగే ఎవరైనా ఏదైనా అంటే వాళ్లకెలా అనిపిస్తుంది' అనే వాటినిగురించి ఎన్నిసార్లు ఆలోచించినా కళ్యాణికి సమాధానం దొరికేదికాదు.

ఓ ఉదయం క్లాసులోకి వచ్చి పుస్తకాలు డెస్కులో పెట్టుకోబోయింది. చేతకేదో గట్టిగా తగిలినట్లయింది — పరధ్యానంగా వుండటంవల్ల వులిక్కిపడి కెవ్వుమంది — మిగిలిన అమ్మాయిలంతా వెల్లబోయి అటు చూశారు — కళ్యాణి ధైర్యంచేసి చెయ్యిలోపలికి పెట్టి ఆ వస్తువు బైటికి తీసింది — ఉల్లిపాయల వాసన బట్టి అదో చిన్న పకోడీల పొట్లం అని ఎవరైనా వూహించుకుంటారు—కళ్యాణి మనస్సు భగ్గుమని మండిపోయి నట్లు




ప్రశస్థమైన
పూర్తి మీగడ పాలు—
కాఫీలో, టీలో
కమ్మదనానికి ;
తాజా పాలకి బదులుగా
వాడేందుకు ఆదర్శ
ప్రాయమైనది.




మీగడ పాలు, పంచదారల సమమైన మిళితమే నెస్‌లేవారి మిల్క్‌మేడ్ కండెన్స్‌డ్ మిల్క్—టీలో, కాఫీలో కమ్మదనానికి విటమినులు A,D లతో నిండిన మిల్క్‌మేడ్ పాలకి బదులుగా వాడేందుకు ఆదర్శ ప్రాయమైనది, కమ్మగానుండి మీ ఎదిగే శిశువు-కవసరమైన ఆహారాన్నిస్తుంది, అత్యవసరమైన శక్తినిస్తుంది. నిరపాయకరమై, స్వచ్ఛమైనది, తాజాయైనది మరియు ఎంతో సదుపాయకరమైనది. స్వచ్ఛమైన, ఆరోగ్యకరమైన, తీసివేయ బడిన పాలకై రెండు భాగాల నీళ్ళలో ఒక భాగం మిల్క్‌మేడ్ కలపండి

**మిల్క్‌మేడ్—**
**రుచికి ఆరోగ్యానికి మంచిది**

నెస్‌లేవారి ఉత్పాదనము

NPM 5757

యింది. 'ఏం చెయ్యాలి తనిప్పుడు ? ఈ పొట్లం తీసుకువెళ్ళి హెడ్మాష్టారికి చూపిస్తేనో?' అనే ఆలోచన కూడ వచ్చింది. మళ్ళీ అంతలోనే ఆ వుద్దేశ్యమూ మార్చుకుంది. 'సరే, ఇప్పటికి వూరుకుంటాను. రిపోర్టులూ అవీ చేసి స్కూలంతటిలో అల్లరిపడటం ఎందుకు.' అనుకుంటూ, ఆ పొట్లాన్ని కిటికీలోంచి సందులోకి విసిరేసింది, ఛీత్కారం చేస్తూ.

ఒక్క ఆడపిల్ల కోపంగా చూస్తేనూ, ఏవగింపుతో ఛీత్కారం చేస్తేనూ అల్లరి కుర్రాళ్ళు అందరూ బుద్ధి తెచ్చేసుకుంటారు అనుకోటం పొరపాటే... అదే జరిగింది కూడ.

ఓ రోజు కళ్యాణి డస్కులో ప్రేమలేఖ—వ్రాసిన వాడిపేరూ వూరూ ఏమీ లేదు— కాగితం తీసి చూసీ చూడగానే కళ్యాణికి పరిస్థితి అర్థమయి పోయింది. కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి — దాన్ని వుండచుట్టి చేతిలో పట్టుకుని మరుక్షణంలోనే క్లాసులోంచి బయటకు నడిచింది.

తలవంచుకుని ఏదో వ్రాసుకుంటున్న పురుషోత్తంగారు ఎవరో వచ్చిన అలికిడి అయి తలఎత్తి చూశారు. కళ్యాణిని ఆయనకి చూపించి, ఇంక తను వచ్చిన పని అయిపోయింది అన్నట్లు వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు స్కూలు బంట్రోతు.

వినయంగా ఆయనకి నమస్కారం చేసి తనపేరూ క్లాసూ అదీ చెప్పి, వుత్తరం ఆయన టేబిలుమీద పెట్టింది కళ్యాణి.

'ఏమిటిదీ ?' అంటూనే అది తెరిచి చదివారు 'ప్చ్—తుంటరిమూక — వీళ్ళకి చదువూ సంధ్యా ఏమీ అక్కర్లేదు— కేవలం అల్లరి చెయ్యటానికే స్కూలుకి వస్తున్నారులా వుంది — పేరు వ్రాయటానికి కూడ ధైర్యం లేకపోయింది కాబోలు—ఉ...ఇలాంటివాళ్ళు ఒక్కరుంటే చాలు, స్కూలు కంతటికి చెడ్డపేరు వచ్చేస్తుంది.' అంటూ ఏకబిగిని ఆవేశంలో ఆయన అనుకుంటున్నట్లుగానూ, కళ్యాణితో చెప్తున్నట్లుగానూ కూడ అని.

'నేను కనుక్కుంటాను లేమ్మా—నీకేం భయంలేదు. క్లాసులోకి వెళ్ళు.' అన్నాడు

## ఆచరణలో ...

వాత్సల్యం వుట్టిపడుతూండగా ... ఈ కళ్యాణి ఎవరో ఆయన వూహించుకో గలిగరు.

మనస్సులోనే ఆయనపట్ల కృతజ్ఞతలు తెలుపుకుని, మరోసారి నమస్కారం పెట్టి తల వంచుకుని మెల్లిగా ఇవతలికి వచ్చేయబోయింది. అంతలోనే మరేదో గుర్తు రావటంవల్ల చటుక్కున గడపలోనే ఆగిపోయి వెనక్కి తిరిగింది. అంతే —'ఆ అమ్మాయిలో అణువణువూ అవమానంతో ఆవేదనతో దహించుకు పోయింది. 'ఇన్నాళ్ళూ బాధ్యత తెలియని విద్యార్థుల చర్యలనే నిరసిస్తూ వచ్చింది— కాని, ఇవాళ—ఒక బాధ్యత గల హోదాలో వున్న వ్యక్తి, ఆ విద్యార్థి విద్యార్థినుల వయస్సు గల బిడ్డల తండ్రి, పెద్ద చదువూ, డిగ్రీలూ అన్నీ వున్న పురుషోత్తంగారి కన్ను నిర్లక్ష్యంగా, అవహేళనా పూర్వకంగా నవ్వుతున్నాయి ఆయన పెదవుల మీద వక్ర హాసం.—ఒక్క క్షణం కళ్యాణి స్తంభించి పోయినట్లే అయింది.

వెళ్ళిపోతోంది అనుకున్న కళ్యాణి అలా హఠాత్తుగా వెనక్కి తిరగటంతో తబ్బిబ్బు పడి చటుక్కున తన మొహంలో భావాలు మార్చుకోటానికి ప్రయత్నిస్తూ, 'ఏమ్మా' అన్నారు పురుషోత్తంగారు— అప్పటికప్పుడు గొంతునిండా ఆదరం నింపుకోటానికి ప్రయత్నిస్తూ.

'అబ్బే, ఏం లేదండి,' మనస్సు మండిపోతున్నా పైకి మర్యాదగానే సమాధానం చెప్పి మెల్లిగా బయటకు వచ్చేసింది —గతంలో తనకు జరిగిన అవమానాలన్నింటినీ గురించి ఇంక ఆయనకు చెప్ప బుద్ధికాలేదు —తనంటే మంచి అభిప్రాయం, ఆదరణ లేని వ్యక్తితో ఇంకొకరి గురించి ఫిర్యాదు చేసుకోవటం ఏమిటి అనిపించింది—పురుషోత్తంగారి ప్రవర్తన తలుచుకుంటూంటే మాత్రం కళ్యాణి వంటినిండా తేళ్ళూ జెర్రులూ పాకుతున్నట్లుంది. 'హుఁ—నన్ను చూసి హేళనగా నవ్వుతున్నాడు—గురివింద గింజ సామ్యం యిదే కాబోలు — తనను గురించి నాకేమీ తెలియదనే అనుకుంటున్నారు కాబోలు' అనుకుంది కసిగా.

కనకవల్లి ఇంటి ప్రక్కనే వుండే మోహనాంబ ఇంటికి పురుషోత్తంగారు రావటం పోవటం కళ్యాణి చాలాసార్లే చూసింది — మేడగదిలో కూర్చునివుండే కళ్యాణిని ఆయన చూడలేక పోయేవాడు గాని రోడ్డుమీద నడిచి వెళ్తూండే ఆయన్ని కిటికీలోంచి కళ్యాణి స్పష్టంగానే చూడగలిగేది — ఆయన నడవడి గురించి మంచి అభిప్రాయం లేకపోవటం చేతనే ఇన్నాళ్ళూ ఎంతమంది ఎన్ని విధాల ఏడిపిస్తున్నా ఆయనతో ఫిర్యాదు చేసుకోవాలనిపించలేదు. కాని పరిస్థితి అంతకంతకు మితిమీరి పోతూండటం వల్లనూ, కొన్నాళ్ళ క్రిందట మరో క్లాసులో ఒక అమ్మాయికి ఇలాంటి అవమానమే జరిగితే ఆయనకి తెలిసి గట్టి చర్య తీసుకోవటంవల్లా ఆయనతో చెప్తేనే బాగుంటుంది అనే నిశ్చయానికి వచ్చింది — అంతేకాదు, వ్యక్తిగతంగా ఆయన ఎలాంటి వాడయినా కానీ, ఆయనలో ఎలాంటి బలహీనతలయినా వుండనీ, ఓ సంస్థకి అధికారిహోదాలో వున్నవాడు, అందులో పిల్లలకి చదువు సంధ్యలు వచ్చేలా చూడటమే కాదు వాళ్ళ నడవడి ప్రవర్తన తీర్చి దిద్దవలసిన బాధ్యత ఆయనమీద వుంది, ఆదక్షత కూడ ఆయనకివుంది అనిపించటం చేతనే మరో ఆలోచనకి తావు ఇవ్వకుండా ఆయన సహాయాన్ని అర్థించింది— ఆయన ఇంత వెకిలిగా ఇలా బయటపడి పోతాడు అనే వూహకూడరా లేదు 'ఛ—ఏం మనుష్యులు? వీళ్ళమధ్య మెసలుతూ నేనింక చదువేం చదువుకుంటాను.' అనుకుంది.

'నువ్వంటె ఆయనకి ఎలాంటి అభిప్రాయం వుంటేనేం, ఆ విద్యార్థులమీద తగినచర్య తీసుకుంటానని హామీ ఇచ్చారుగా—ఎలాగో రెండేళ్ళు కళ్ళు మూసుకుంటే ఈ స్కూలుచదువు అయిపోతుంది.' అంటూ మనస్సు మరోమూలనుంచి గొణిగింది.

'ఊహు లాభంలేదు—అభిమానం గౌరవం లేకపోతె మానె స్పష్టంగా తెలిసేస్తున్న ఇంతటి నిరాదరణ నేను భరించలేను.' అనుకుంటూ క్లాసులో అడుగు పెట్టింది. పుస్తకాలు చేతిలోకి తీసుకుని

ఇవతలకి వచ్చేయబోతూంటే కళ్యాణిలో దుఃఖం ఒక్కసారి పెల్లుబికి వచ్చింది.

'మీకు నేనేం అపకారం చేశానని కక్షకట్టినట్లు నన్నిలా సాధిస్తున్నారు—నిజమే—నేను మీలా గౌరవనీయమైన కుటుంబంలో పుట లేదు—అంతమాత్రం చేత మీతో కలిసిమెలిసి తిరిగే అర్హత కూడ నాకులేదా—మీ అందరిలాగే చదువుకోవాలని ఎన్నో డిగ్రీలు సంపాదించాలని పెద్ద పెద్ద ఉద్యోగాలు చెయ్యాలని ఎన్నో కోరికలతో ఈ స్కూల్లో అడుగు పెట్టాను — నాకు ఇలా అడుగడుగునా ఆటంకాలు కల్పించి ఎందుకింత వేదిస్తున్నారు—మీ ప్రవర్తనతో నాగుండెలు అవిసిపోతున్నాయనే సంగతి మీరు గ్రహించుకోలేరా.' అని ఒక్కసారి అందరినీ అడ అనే ఆవేశం పొంగివచ్చింది—కాని ఒక్కమాటయినా మాట్లాడకుండా—వెళ్లిపోతున్నాను అని ఎవరికీ చెప్పనైనా చెప్పకుండా—మాష్టారు క్లాసులోకి రాకముందే తను బయట పడాలనే ఉద్దేశ్యంతో గబగబ అడుగులు వేసుకుంటూ స్కూలు గేటువేపు వెళ్లిపోయింది. ఇంటినుంచి వెళ్లిన అరగంటకే మళ్లీ తిరిగి వచ్చిన కూతుర్ని చూసి వనజాక్షి కాస్త తెల్లబోయినా ఏమీ అడగలేదు.

కళ్యాణి తిన్నగా తన గదిలోకి వెళ్లిపోయి పుస్తకాలు అలమారులోకి గిరవాటేసి మంచంమీద పడుకుని ఏడుస్తోంటే ఆ ఏడుపు విని విస్తుపోతూ లోపలికి వచ్చింది. కూతురు ప్రక్కనే మంచంమీద కూర్చుని అనునయంగా వెన్ను నిమురుతూ 'ఎందుకేడుస్తున్నావు—అసలేం జరిగింది—పుస్తకం ఏమైనా మరిచిపోయావేమో తీసుకువెళ్ళటానికి మళ్ళీ వచ్చావనుకున్నాను—ఇదేమిటిది' అంటూ బుజ్జగించి అడగటం మొదలు పెట్టింది

తల్లి అలా అడుగుతున్న కొద్దీ కళ్యాణిలో దుఃఖం మరీ పొంగుకు వచ్చింది. 'మీ అందరిమాటలు కాదని వెళ్లాను—పరాభవంపొంది తిరిగి వచ్చాను—నా జన్మ హేయమైనది. నా బ్రతుకు హేయమైనది. పదిమందీ లోకువగా వేలెత్తి చూపించగలిగే ఆట బొమ్మని నేను' అన్న ఊహలతో మరీ కుమిలిపోయింది. చివరికి కాస్సేపటి తరువాత తల్లి బ్రతిమాలగా బ్రతిమాలగా ఎలాగో దుఃఖాన్ని దిగమ్రింగి జరిగినదంతా చెప్పి

'ఇంక నేనా స్కూలు మొహం చూడను' అంది కళ్యాణి.

'పోనీలే, ఇప్పుడు నిన్ను చదువుకోమని ఎవరు బలవంతం పెట్టారు. హాయిగా ఇంట్లోనే వుండు' అంది వనజాక్షి.

'ఊహు—నేను కనీసం మెట్రిక్ అయినా ప్యాసు కావాలి. ప్రయివేటుగా చదివి పరీక్షకి వెళ్తాను' అంది కళ్యాణి.

ఇంట్లో వాళ్లందరూ 'సరే నీయిష్టం' అనక తప్పలేదు కాని కళ్యాణికి ప్రయివేటు చెప్పటానికి మేష్టరు దొరకటం మాత్రం గగన మయిపోయింది.

ఆ యింటి గడపలో అడుగు పెట్టి ఆ అమ్మాయికి చదువు చెప్పటానికే తమ పరువూ మర్యాదా గంగలో కలిసిపోతాయి అన్నట్లు భయపడి పోయారు చాలామంది—తమకి స్వయంగా అభ్యంతరం లేక పోయినా నలుగురూ చెప్పలు కొరుక్కుంటారేమో అనే సంకోచంతో వెనక్కి తీశారు కొంతమంది. చివరికి ఎలాగో ఓ మేష్టరు దొరికాడు. కళ్యాణి మెట్రిక్ ప్యాసయింది.

ఈ లోగా ఇంట్లో అనేకరకాల గొడవలు. రోజూ ఏదో ఓ రాద్ధాంతం—అబ్బ—అది ఒక నరకమే అనిపించింది కళ్యాణికి—ఆ నరకాన్నుండి బయట పడటానికి మాత్రం ఎన్నిగొడవలు జరిగాయని !

'నా దారిన నన్ను బ్రతకనివ్వకపోతే ఎందులోనయినా పడి చచ్చిపోతాను.' అని కళ్యాణి ఆఖరి అస్త్రం ప్రయోగించటంతో వాళ్లంతా కాస్త వెనక్కి తగ్గారు. కాని, ఆమె ఇల్లు విడిచి వచ్చేస్తూంటే,

'నిన్ను ఎవడు పెళ్లి చేసుకుంటాడే—నాలుగు అక్షరం ముక్కలు వంట పట్టించుకుని మాకే నీతులు బోధిస్తున్నట్లు మాట్లాడుతున్నావు కాని'...అంది అమ్మమ్మ కనకవల్లి అక్కసు పుట్టలేక.

'ఫరవాలేదు వెళ్లనీ—ఒక్కసారి మోసపోతే అప్పుడు బుద్ధి తెచ్చుకుని మళ్లీ ఇక్కడికే తిరిగి వస్తుంది.' అన్నాడు రాఘవులు.

'నన్ను పెళ్లి చేసుకోటానికి ఎవ్వరూ ముందుకి రాకపోతే బ్రహ్మచారిణిగానే జీవితం అంతా గడిపేస్తాను—ఈ ప్రపంచంలోని మనుష్యులని, వాళ్ల తత్వాలని అర్థం చేసుకోలేక ఎవ్వరిచేతనైనా మోసగించబడటం అనేది జరిగితే ఈ గుక్కెడు ప్రాణం తీసుకుంటానే కాని మళ్లీ మీ ఆశ్రయాన్ని మాత్రం కోరను.' అని తీవ్రంగా ధైర్యంగా సమాధానం చెప్పి మరీ వచ్చేసింది.

అసలు ఎక్కడికి వెళ్ళాలి, ఏం చెయ్యాలి అనే విషయంలో చాలాసేపు ఏ నిర్ణయానికి రాలేకపోయింది కాని చివరికి తన వాళ్ళకి సాధ్యమైనంత దూరంగా వుండటమే బాగుంటుందనిపించి హైదరాబాదు కే



టిక్కెట్టు తీసుకుని రైలుఎక్కి కూర్చుంది.

హైదరాబాదు స్టేషనులో రైలు ఆగగానే తోటి ప్రయాణికులతో పాటు ప్లాటుఫారం మీద పాదం మోపిన కళ్యాణి కాళ్లు ఒక్కసారి వణికాయి. గుండెలు జలదరించినట్లయింది. ఈ మహానగరంలో—పుట్టిన వూరు వదిలి ఎక్కడికీ వెళ్లని తను—ఒంటరిగా ఎలా బ్రతుకుతుంది, ఎక్కడ తల దాచుకుంటుంది అనే ఆలోచన వచ్చి ఒక్కక్షణం మనస్సంతా ఎలాగో అయిపోయింది. మిగిలిన ప్రయాణీకులంతా హడావిడిగా కూలీల నెత్తిన సామానుపెట్టి ప్లాటుఫారం దాటి బయటకు వెళ్లిపోవటానికి ఆత్రుతపడిపోతున్నారు. కొంతమంది తమని రిసీవ్ చేసుకోవటానికి వచ్చినవాళ్లతో సంతోషంగా కుశలప్రశ్నలు వేసి గలగల కబుర్లు చెప్పేసుకుంటున్నారు.

'వీళ్లంతా ఎంత అదృష్టవంతులు!—తను రాకకోసం ఎదురుచూస్తున్న ఆప్తులు ఇలావచ్చి పలకరించటం ఎంత ఆనందంగా వుంటుంది! అదుగో ఆ వెళ్తున్న వాళ్ల కోసం ఎవరూ వచ్చినట్లు లేదు. అయినా వాళ్లు ఏ రిక్షానో మాట్లాడుకుని ఇల్లు చేరుకుంటారు, అక్కడ వీళ్లని ఆప్యాయంగా పలకరించి ఆదరంగా లోపలికి తీసుకువెళ్లే బంధువులూ, అయినవాళ్లు అంతావుంటారు—ఎవ్వరూ లేకపోయినా కేవలం సరదాగా పట్టణం చూడటానికి వచ్చేవాళ్లూ ఇక్కడ ఎవరూ లేకుండా వచ్చేవాళ్లూ ఏ హోటల్లోనో దిగి సరదాగా నాలుగురోజులు వుండిపోతారు—నేను ఒక్కదాన్ని...' అని బెంబేలు పడిపోతున్న మనస్సుని ఒక్క క్షణంలోనే అదుపులోకి తెచ్చుకుని 'ఛ, ఏమిటీ పిరికితనం? అందులోనూ ఇలాంటి సమయంలో...నాకువచ్చిన భయం ఏమీలేదు—చేతిలోనున్న డబ్బు అయిపోయే లోపుని ఏదో వో వుద్యోగం దొరక్కపోదు. ఇంత మహాపట్నంలో నేను తలదాచుకోటానికి కనీసం ఒక గదిలయినా దొరక్కపోదు. నువ్వుమాత్రం నా ధైర్యాన్ని దిగతోడకు' అని మనస్సుని మందలించి, సూటుకేసు చేత్తో పట్టుకుని గబగబ అడుగులు వేసుకుంటు స్టేషనుదాటి బయటికి వచ్చింది.

'రిక్షా కావాలా అమ్మా' అని అడిగిన వాడితో గీసిగీసి బేరం చెయ్యకుండా తిన్నగా వో హోటలుకు తీసుకు వెళ్లమనిచెప్పింది. రిక్షా దిగి లోపలికివెళ్లి కడుపునిండా టిఫిన్‌తిని కాఫీతాగి పెట్టెచేత్తో పట్టుకుని బయటికివచ్చేసరికి ఇందాకటి రిక్షాఅబ్బి ఎదురుగా కనిపించాడు. అతనికి మరే బేరం దొరకలేదులా వుంది మిగిలిన రిక్షా వాళ్లతో బాతాఖానీ కొడుతున్నాడు. కళ్యాణిని చూడగానే ఖబుర్లాపి 'రిక్షాకావాలా' అన్నట్లు చూశాడు.

కళ్యాణి మాట్లాడకుండా ఎక్కి కూర్చుని 'హిమయత్‌నగర్ పోనీ' అంది రిక్షా నాలుగడుగులు వేశాక 'చూడు—కొంచెం ఆలస్యం అయినా తొందర చెయ్యకు—నీ కష్టం వుంచుకోను—హిమాయత్ నగర్‌లో కాని ఆ చుట్టుపక్కలకాని నాకు వో చిన్న యిల్లు కావాలి—నవే ఏదీ దొరక్కపోతె ఇవాల్టికి ఏ సత్రవులోనో వుండిపోతాలే — నువ్వు మాత్రం కాస్త ఓపిగ్గా నాలుగుపేటలూ చూపించాలి.' అంది—హోటల్లో టిఫిన్ తీసుకుంటున్నప్పుడు ప్రక్కనున్న వాళ్లతో మెల్లిగా మాటలుకలిపి ఇక్కడి పేటల పేర్లూ బజార్లపేర్లూ అవీ తెలుసుకుంది.

ఆ రిక్షా అతను చాలా నెమ్మదైనవాడు. ఈపేట కాకపోతే మరోపేట మరోపేట అంటూ నాలుగు చోట్లకి తీసుకువెళ్ళాడు. చివరికి మధ్యాహ్నం అయేసరికి కాచిగూడా స్టేషన్ దగ్గరలోనే వో ఇంట్లో రెండుగదుల వాటా కుదిరింది.

'ఇంతవరకూ అదృష్టవంతు రాలినే—ఇప్పటిదాకా ఈ ఇళ్ళగల వాళ్లందరూ వేసే యక్షప్రశ్నలకి సమాధానం చెప్పలేక ప్రాణం పోయినట్లయింది—వాళ్ల ధోరణి చూస్తూంటే అసలు నాకు తలదాచుకోటానికి తావే దొరకదేమో అని భయం పుట్టింది—వీళ్ళెవరో పాపం — నాలుగు ప్రశ్నలువేసినా నేను చెప్పిన సమాధానాలు నమ్మి ఇప్పటికిప్పుడు నాకు ఇల్లు ఇవ్వటానికి ఒప్పుకున్నారు.' అని సంతోషిస్తూ, రిక్షా అతను అడిగిన దానికంటె మరో రూపాయి ఎక్కువే ఇచ్చి పంపించింది.

ఇక మర్నాటినుంచి ఉద్యోగాన్వేషణలో పడింది ఎన్నో ఆఫీసులచుట్టూ తిరిగింది. మరెన్నో ఆఫీసులకి అప్లికేషన్లు పంపించింది—ఆ ప్రయత్నాలు ఏమీ ఫలించలేదు కాని నెల తిరిగేసరికి అయిదారు ఇళ్లల్లో ట్యూషన్లు మాత్రం దొరికాయి.

(ఇంకా ఉంది)






పూర్వ కాలంలో దేవతలకూ, దానవులకూ తరుచుగా యుద్ధాలు జరుగుతూ ఉండేవి రాక్షసులకంటే దేవతలు కొంత మెత్తని స్వభావం కలవారు. అందువల్ల పరమేశ్వరుడు వారియందు పక్షపాతం కలిగి ఉండే వాడు. తన శక్తిని వారిలో సంక్రమింప జేసి, వారు జయించేటట్లు చేశాడు. విజయాన్ని పొందిన దేవతలు తమ విజయానికి తమకుండే శక్తియే కారణమని గర్వించారు; కాని తత్త్వాన్ని తెలుసుకోలేక పోయారు.

వారి అహంకారాన్ని అణచి వేసి, మంచి మార్గంలో పెట్టాలనే సంకల్పం పరమేశ్వరుడికి కలిగింది. అందువల్ల ఆయన తన యోగబలం వల్ల ఒక భూతరూపాన్ని ధరించి వారి యెదుట సాక్షాత్కరించాడు ఆ స్వరూపం దేవతలకు ఎంతో ఆశ్చర్యం కలిగించింది. దాన్ని గురించి తెలుసుకోవాలనే సంకల్పం వారికి కలిగింది వారు తమలో సమర్థుడయిన అగ్ని దేవుణ్ని ఆ భూతం వద్దకు పంపారు అతడు ఆ విషయాన్నే ప్రశ్నింపగా, ఆ భూతం "నా సంగతి తర్వాత చెప్తానుగాని, మొదట నీవు ఎవ్వరో, నీ శక్తి ఏమిటో చెప్పు" అన్నది. అప్పుడు అగ్ని తన పేరు చెప్పి ఏ పదార్థము నైనా త్రుటిలో భస్మం చెయ్యగల నని అన్నాడు. ఆ వికృత స్వరూపం ఒక గడ్డిపోచను చూపి, దాన్ని భస్మం చెయ్యమన్నది. అగ్నికి సాధ్యం కాలేదు. సిగ్గుపడి-మారు మాటాడకుండా వెనక్కుపోయి, ఆ భూతాన్ని గురించి తెలుసుకోవడం తనకు సాధ్యం కాదని చెప్పాడు. తర్వాత దేవతలు వాయువును పంపారు. అప్పుడు ఆ భూతాన్ని దాని వృత్తాంతాన్ని అడుగగా, మొదట అతని శక్తిని తెలుపకోరింది. వాయువు తన పేరు చెప్పి అన్ని వస్తువులనూ ఆకర్షించే శక్తి తన కున్నదని చెప్పాడు. ఆ భూతం ఒక గడ్డిపోచను చూపి దానిని ఆకర్షించవలెనని కోరగా వాయుదేవుడు విఫల ప్రయత్నుడయాడు. అతడు వెంటనే వెనుకకు వచ్చి ఆభూతాన్ని గురించి తెలుసుకోవడం తనకు సాధ్యం కాదన్నాడు.

ఇక లాభం లేదని, తర్వాత ఇంద్రుడే స్వయంగా ఆ భూతం దగ్గరకు వెళ్లాడు. అతనితో మాట్లాడడానికి కూడా ఇష్టపడక—ఆ భూతం ఒక్కసారి యింద్రుడికి కనబడి, వెంటనే మాయమైపోయింది. ఇంద్రుడు మాత్రం అగ్నివలెను, వాయువువలెను వెనుకకు పోకుండా, అక్కడే వుండి ఈశ్వర ధ్యాన నిమగ్ను డయ్యాడు. ఇంద్రునికి గల పరమేశ్వర భక్తికి మెచ్చి బ్రహ్మ విద్య పార్వతీ రూపం ధరించి అతనికి ప్రత్యక్షమయ్యెను.

శివుని అర్ధదేహమైన పార్వతికి సమస్తమూ తెలియగలదని, ఇంద్రుడు ఆమెకు నమస్కరించి, "తల్లీ! ఇదివరకు ఇక్కడ నాకు కనబడి వెంటనే మాయమైన ఆ భూతం సమాచారం తెలుపవలె"నని ప్రార్థించాడు. ఆమె చిరునవ్వు నవ్వి "అయ్యా! అదే బ్రహ్మపదార్థం. ఈశ్వరానుగ్రహంవల్ల అదే మీలో ఆవేశించి రాక్షసుల వల్ల మీకు విజయం కలిగేటట్లు చేసింది. ఆ విజయం స్వశక్తివల్లనే కలిగిందని మీరు భ్రాంతిపడి గర్వించారు మీకు హితాన్ని ఉపదేశించి మిథ్యాభిమానాన్ని పోగొట్టడానికే పరమేశ్వరుడిలా కన్పించాడు మీకు ఉండే శక్తులన్నీ ఆయనమూలంగానే లభించాయని తెలుసుకొని, గర్వాన్ని విడిచి, ఈశ్వరునే ఆరాధిస్తూ వుండండి" అని చెప్పినది.

అప్పటినుండి దేవతలు తమ గర్వాన్ని విడిచి, ఈశ్వరారాధన తత్పరు లయినారు.

అగ్ని, వాయువు మొదట ఈశ్వరుని గురించి తెలుసుకోవాలని యత్నించినందున దేవతలలో ఉత్తము లయినారు. ఇంద్రుడు తత్త్వాన్ని తెలుసుకొన్నందున దేవతలకు నాయకుడైనాడు.

ఉగ్రుడైన శివుడు శాంతంగానే దేవతల తప్పును దిద్దినట్లు ఈ కేనోపనిషత్కథ తెలుపుతున్నది.




తల్లిదండ్రులతనికి పెట్టిన పేరు రామనాథం. ప్రజానీకం నోట్లో అతను లాయరు రామనాథం. 'లా' పట్టా పుచ్చుకొన్నాక అయిదారు కేసులు పట్టక పోలేదు. కాని అవన్నీ పుచ్చిపోయినయి. అందుకే జుట్టంతా పీక్కుంటూ చెట్ల కింద పిచ్చిగా తిరిగాడు. చెట్టుకింద ప్లీడరూ అని అన్నారు కొందరు అప్పట్లో. కాని ఆపేరే నిలవలేదు. ఆపైన స్వాతంత్ర్యంకోసం అష్టకష్టాలు పడుతున్న క్లిష్టమైన రోజులవి. స్వాతంత్ర్య సమరభారతి పిలుపు అందిందంటూ ఇల్లు విడిచి ఢిల్లీవేపెళ్లిపోయాడు రామనాథం. మైళ్లకొద్దీ నడిచాడు. జైళ్లలో కెళ్లాడు. సత్యాగ్రహాల్లో పాల్గొన్నాడు. మనస్వేచ్ఛా స్వాతంత్ర్యాల కడ్డంగా నిలచిన ఈ తెల్లవాళ్లను మనదేశంనుంచి వెళ్లగొట్టాలంటూ ఉపన్యాసాలిచ్చాడు. కొన్నేళ్లు గడ్డం పెంచి సన్యాసిలా దేశమంతా తిరిగాడు. మొత్తానికి రామనాథం చాలా కష్టపడ్డాడు. అందులో సందేహం లేదు — ఇదంతా పంతొమ్మిదివందల నలభై ఏడుకు ముందు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన పిదప రామనాథం, లాయరు రామనాథం అయ్యాడు. ఒకానొక సభలో ఒకఛోటా నాయకుడు దేశ స్వాతంత్ర్య సమరంలో లాయరు రామనాథం పాత్ర—అనే విషయం మీద ప్రసంగం చేశాడు. ఆయన గంటసేపే చేసిన ఆ ప్రసంగంలో లాయరు రామనాథం అని వెయ్యి సార్లైనా అని వుంటాడు—సదరు లాయరు రామనాథం నాటినుంచీ నేటిదాకా ఎన్ని ఉపన్యాసాలు చేసాడో లెక్కలేదు. బహుశః 'ఆంధ్ర దేశంలో ఆయన ఎక్కి దిగని వేదికంటూ లేదేమో. మహానుభావుడంటూ చేతులెత్తి ఆయనకు మొక్కని మనిషికూడా ఉండడంటే అతిశయోక్తి కాదు. ఎందుకంటే ఆయన ప్రసంగాల్లో దొర్లిన విషయాలు ఒకటా, రెండా ... వో యబ్బో? సంఘసేవన్నాడు. సమాజ వికాసమన్నాడు. పతిత జనోద్ధరణ, సంకరజాతి పెళ్లిళ్లు, విధవా పునర్వివాహాలు, స్త్రీవిద్య, వయోజనవిద్య, వయసుమళ్లిన వాళ్ల సన్యాసం పుచ్చుకున్నా సంఘాని కెంతెంతో సేవచేసిన వారవుతారని కూడా అన్నాడు.

ఎమ్మెల్యేగా పోటీచేశాడు. రెండుసార్లూ ప్రత్యర్థుల ధాటికి గెలవలేక పోయాడు. అంతా అయింతర్వాత ఎమ్మెల్యేగా గెలిచినా ఒక గొప్పచిక్కే అవుతుంది. ఏదో ఒక మంత్రిపదవి యిస్తారు. దానికి తంత్రవాది అయివుండాలి. అలాంటి మాయామంత్రాలు తనలాటి స్వచ్ఛంద సేవకుడికి సుతరామూ యిష్టంలేదూ అని ఒకానొక సభా ప్రాంగణంలో స్ఫటికం లాటి తన మనస్సును జనం ముందుంచాడు లాయరు రామనాథం, అప్పుడే కరెంటు దీపాలు ఆరిపోగా ఆవరించిన తమస్సులో.

అల్లా, నారాయణ ఒకరే అన్నట్లుగా మంత్రిపదవి అయినా, ఈ జిల్లా పరిషద్ చెయిర్‌మన్ అయినా నాకొకటే— అని చెయిర్మన్ అయింతర్వాత ప్రారంభోపన్యాసంలో సెలవిచ్చారు లాయరు రామనాథం.

ఇది ఇలా వుండగా—

రంగనాథం బుర్ర ఆలోచనలతో వేడెక్కిపోతుంది. లోలోపలే ఏదో గొణుక్కుంటూన్నాడు ఈజీచెయిర్‌లో కూచొని. రంగనాథం ఎవరో కాదు—లాయరు రామనాథం ఏకైక పుత్రరత్నం. ఎప్పటికైనా తండ్రి అంతటివాడు కావాలన్నదే అతని నిరంతర ప్రయత్నం. ఆదర్శాలకేం గాని అడ్డొచ్చిందీ మధ్యే 'ప్రేమ' అనే గడ్డు పదం

కాలేజీలోనేమొ చదువు. కళేజాలోనేమొ

వలపు. మనసు ప్రేమసముద్రం అటు పోట్లు హృదయం మీద విసిరె మన్మథుడి పూలబాణాల గట్లు, తూట్లు.

తండ్రేమో పెళ్లిచేయుడు. తనేమో నోరువిప్పి అడుగడు. ఏమని అడగ్గలడు? నాకోరిస్టువాచీ కొనియ్యి నాన్నా, నాకో స్కూటరు కొనియ్యి నాన్నా అన్నట్టుగా నాకోపెల్లను తెచ్చిపెట్టు, నేను తాళి బొట్టు కట్టుతానని అంటాడా? ఎంత పిల్లి!

ఎవరైనా మిత్రులు తన పెళ్లిగురించి తండ్రి నడిగినప్పుడు 'ఇప్పట్లో ఆ ఉద్దేశ్యమే లేదు. పెళ్లి కాస్తా అయిందంటే బద్ధకించి పోతాడేమోనని అనుమానం. అసలువిషయం చెప్పాలంటే చదువు పూర్తి కాందే పెళ్లి చేసుకోననేదే వాడి సిద్ధాంతం' అని చెప్పుకుపోతుంటే అది వానాకాలమే అయినా అరికాలిమంట తలకెక్కేది రంగనాధానికి.

ఎవరైనా ఒక పిల్లనుచూసి ప్రేమిం చేస్తే మంచిదేమోనని వారం రోజుల్నించీ అతి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు రంగనాధం. ఆనాడు సాయంకాలం అలా ఊరి మీద పడ్డాడు.

ఈ వెధవ ప్రపంచంలో చివరికి ఒక విధవాడపడుచు కనిపించింది—అదీ ప్రక్క వీధిలోనే. అప్పటికి ఆపిల్లే తనకు పెన్నిధి అనుకున్నాడు.

రామాయణం చదివే ఈడులో లేదా పిల్ల. మెల్లగా ప్రేమాయణంలోకి దింపాడు రంగనాథం.

సుధ విధవైనా నెరజాణ కాబట్టి వీరిద్దరి ప్రేమ ఆరు రోజుల్లోనే మూడు పూలు ఆరు కాయలైంది.

రాత్రి ప్రణయం, పగలంతా విరహం తప్ప ఆ వారం రోజుల్లో వాళ్ల కళ్లకేమీ కన్పించలేదు. వాళ్ల మనసులో ఏ విషయమూ తలెత్తలేదు.

ఆనాటి రాత్రి సంకేత స్థలమైన ఊరి బడిదగ్గర కలిసారు. ఈ మధ్య కాలంలో బళ్లే ప్రేమ పూజారుల గుళ్లయినాయి గదా! మరి అజిటేషన్ల సమ్మెల మూలంగా మూసివేయబడినయి బళ్లన్నీ. జట్టురేగిన బడిపిల్లలతో నిండిపోయినయి ఊళ్లన్నీ, నిండిపోయినయి బూజు పట్టిన పుస్తకాలతో యిళ్లన్నీ.

ఆ చిన్నారి పిల్లల బడే సుధా రంగనాథుల రాసక్రీడలకు బృందావనము అయింది. బడిప్రక్కన పారుతున్న మురికి కాలువ ఒడ్డే యమునాతటము.

'సుధా! నీ పేరెంత మధురమో నీ రూపంత ముగ్ధ మనోహరము'

రంగనాథం రిమార్కు, ఆరు రోజుల సర్వే అనంతరం.

'మీరు కవిగారు కూడానా ?' సుధ గొంతులో వ్యంగ్యం.

'కపి చేష్టలేగాని నా కవి హృదయం నీకేం తెలుసు సుధా. అయినా నీలాంటి అపరంజి బొమ్మను చూస్తే కవిత్వంరాక వైరాగ్యం కల్గుతుందా?...'

మాటలులేని కొన్ని క్షణాల్లో కీచురాళ్ల రణగొణలు, యమునాతటిని కప్పల బెకబెకలు మాత్రం వినవచ్చినయి.

ఈతచెట్టు మీన్నుంచి పిట్ట ఒకటి 'తీ, తీ' అంటూ ఎగిరి చీకట్లో కలిసిపోయింది.

'నువ్వు విధవ్వి, మరి మానాన్న యీ పెళ్లికి అంగీకరిస్తాడో లేదో?'

'ఆ వెధవాలోచన్లు ఇప్పుడెందుకండి? హాయిగా...'

'హాయి మాటకేం గాని మన భవిష్యత్తును గురించి కూడా ఆలోచించాలి గదా.'

'మత్తులో మునిగివున్న ఈ గమ్మత్తైన మధురక్షణాల్లో భవిష్యత్తును గురించి బెంగ దేనికండి? వర్తమానం ఘడియల్ని హాయిగా అనుభవించి ఆనందించక'

'ఏవిటి? నువ్వు అన్నీ నా డైలాగులు కొడ్తున్నావు సుధా?'

'ఈనాటి మగవాళ్లు మరీ పిరికివారవుతున్నారు. మొదట్లో హుషారుగా 'మలయసమీరే' అంటూ ఉరకలేసేది మీరే. మధ్యలోనే నాన్నంటే భయం, లోకం దృష్టిలో తేలికయిపోతానేమో నంటూ పారిపోయేది మీవాళ్లే. ఆడది అడుగు వెయ్యదు. వేసిందంటే వెనక్కి వెళ్లేది లేదు.'

'సుధా! నువ్వు చలం పుస్తకాలు...'

'చదివితేనే కోరికలు పుట్టుకొస్తాయి కాని వితంతువు కొక శరీరం అంటూ ఉండదా? దాన్లో ఉన్నవి ఉడుకునెత్తురు ప్రవహించే నరాలుగావా? దుడుకుతనంగా ప్రవర్తిస్తే లోకాని కెందుకీ ఉడుకుమోత్తనం?...'

'నూరు వరాల మాటన్నావు సుధా. నీ సన్నిధే నాకు పెన్నిధి. నీ బిగి కౌగిలిలో ప్రాణంతో నన్ను సమాధి చేయి సుధా. నిన్నే పెళ్లి చేసుకొంటాను ఇదిగో ప్రమాణం చేస్తున్నాను.'

రంగనాథం సుధ చేతిలో తన చేయి నుంచబోయాడు.

సుధ తన చెయ్యిని లాక్కుంది.

'ఈ ప్రమాణాలమీద విమాన ప్రయాణాల మీద నా కాట్టే నమ్మకం లేదు, మన మనసులే సాక్షి.'

'ఓహ్, విమానప్రమాదంలో గతించిన మీ ఆయన్ని గుర్తుకొచ్చేట్టు నేను మాట్లాడేనా? సారీ సుధా'

'ఈ ప్రమోద సమయంలో ఏనాడో జరిగిన ఆ ప్రమాద ప్రసక్తి ఎందుకండి? మీసిదే నా కాసక్తి. మనల్ని విడదీయలేదు ఏ శక్తీ. ఏమండీ?'

'అదే, మా నాన్న వస్తున్నా డిక్కడికి ఎల్లుండి. మన వివాహ ప్రసక్తి అప్పుడే తీసుకొస్తాను. అన్నట్టు మరిచా. మా నాన్నెందు కిక్కడికి వస్తున్నాడో తెలుసా? విధవా పునర్వివాహ వికాస మండలి వదిహేడో వార్షికోత్సవ సందర్భంగా మా నాన్నగారిని ముఖ్య అతిథిగా పిలుస్తున్నారు.'

జిల్లా పరిషద్ చెయిర్మన్ లాయరు రామనాథం చాలురోజులు డిస్ట్రిక్టు హెడ్ క్వార్టర్సులోనే ఉంటాడు. అప్పుడప్పుడు తన ఊరికి వచ్చిపోతూ వుంటాడు.

గాఢ పరిష్వంగంతో ఆనాటి రాత్రి ప్రేమలీలలు ఘట్టానికి యవనిక పడింది. అతి భారంగా అడుగులేసుకుంటూ విడిపోయారిద్దరు.

లాయరు రామనాథం ఆరోజు ఉదయం వచ్చాడు. రంగనాథం తన ప్రేమ విషయాన్నెలా చెప్పాలో తోచక అవస్థ పడుతున్నాడు.

'నాన్నా' అని విప్పిన నోరును అప్పుడే చప్పున మూసేసాడు.

'ఏరా నాన్నా? చెప్పు రంగడూ' లాయరు రామనాథం లాలన.

కాదు నాన్నా...నాన్నా...రేపు ఏపేరివారు స్పీచెస్ యిస్తున్నారు.'

'హో అదా? ... అరె స్పీచ్ అంటే గుర్తు కొచ్చింది' సిగరెట్టు ఒక్క దమ్ము పీల్చి లాల్చీ జేబులు వెదికి 'అరె ఆ కాయితం పోయిందే' అని గొణుక్కున్నాడు.

'ఒరే రంగడూ ఆ కాయితం చూసావా ఎక్కడైనా?'

'ఏ కాగితం నాన్నా'

'అదేరా ఇవ్వాళ స్పీచ్ యివ్వాలిగదా. కొన్ని ముఖ్యమయిన పాయింట్స్ రాసుకున్నానురా. ఆ విడిచిన చొక్కాలో చూడరా.'

రంగనాథం తీసుకొచ్చాడు కాయితాన్ని.

'అది చదవరా, అందులోని కొన్ని విషయాలు సభికుల్ని చాలా చకితుల్ని చేస్తాయిరా రంగడూ. నా ఆదర్శాలు, ఆశయాలను సభికుల ముందుంచే సదవకాశం యిది. అందరూ అవి వింటూ అలా నోళ్లువిప్పి గుడ్లప్పగించి చూడాల్సిందేరా.'

నాన్నగారి చిక్కురాత సరిగ్గా అర్థం కాలేదు రంగనాథంకు.

'ఆ పాయింట్ అర్థమయిందా, అక్కడ చదువు' అని వేలితో చూపించాడు. రంగనాథం చదివాడు లోలోపలే, "నా కొడుకే ఏ వితంతువునైనా ప్రేమిస్తే ఇప్పుడే ఆమెను నా కొడుక్కు పెళ్లి చేసుకొంటాను...'

రంగనాథంకు చెమటలు పోసినయి.

ఏదో చెప్పబోయాడు కాని తెరవలేదు నోరు.

అప్పుడే వచ్చి యింటి ముందాగింది కారు. నల్గురు మనుష్యులు దిగారు. రామనాథంతో మూడుముక్కలు చెప్పారు. అందరూ కలిసి కాస్సేపట్లో బయటికి వెళ్లిపోయారు.

సాయంకాలం ఆరున్నర గంటలకు ప్రారంభించాల్సిన కార్యక్రమము సభాధ్యక్షులు వంకాయల వెంకటసుబ్బయ్యగారు లేటుగా వచ్చినందున ఎనిమిది గంటలకు మొదలయింది.

లేటు కమింగ్ మీద ఘాటైన ప్రసంగం ప్రారంభించాడో లేదో ఆ ఉగ్రవాది కార్యకర్తను తక్కినవాళ్లు వేదిక మీదినుంచి క్రిందకు తీసికెళ్లారు. వెంకటసుబ్బయ్య ముఖం వెలవెలా బోయింది.

ఛీఫ్‌గెస్టుగా లాయరు రామనాథం తన ఉపన్యాసం ప్రారంభించాడు. ప్రతి అయిదారు నిమిషాలకు సభికులు చప్పట్లు కొడుతూ నవ్వుతున్నారు. రామనాథం హుషారెక్కువైంది.

'...కూరల్లోకెల్లా అతి రుచికరమైనది, ప్రశస్తమైనదిగా వంకాయకూరనెలా మనవాళ్లు నిర్ణయించారో స్త్రీ సమస్యల్లోకెల్లా అతిముఖ్యమైనది ఈ వితంతు పునర్వివాహము అని నా అభిప్రాయము...'

'అధ్యక్షుల వారిమీద ఒకవిసురు విసిరాడురా' లన్నదొకంఠం జనంలోంచి.

మరో ఐదునిమిషాల తర్వాత, '...బహిరంగ సభలకే గానివ్వండి, సాహితీ సదస్సులకే కానీండి, మనమీనాడు సభా ప్రారంభ సమయానికొక గంట లేటుగా వెళ్తున్నట్లుగానే ఈ పునర్వివాహ విషయాన్ని చాలా లేటుగా గుర్తించారు. అత్యంగానే గుర్తించారే అనుకొన్నా ఈనాటికి ఏం సాధించాముని? ప్రతి సభలోనూ ఇండియన్ స్టాండర్డ్‌టైమ్‌ను గురించి మాట్లాడుతూ ఒకరినొకరు విమర్శించుకొంటూనే వున్నా ఆ విషయంలో ఏ ప్రగతి సాధించనట్లే ఈ పునర్వివాహాన్ని గురించి దేశంలో ఎన్ని మండలులు వెలసినా, ఇన్నేళ్లు గడిచినా ప్రోగ్రెస్ ఏమాత్రం కనిపించడంలేదు...'

'అబ్బ! అబ్బ! అధ్యక్షుల వారి మీద దెబ్బమీద దెబ్బ కొడ్తున్నాడోయ్' అన్నారెవరో సభలో. ఒకటే నవ్వులు.

అయినా లాయరు రామనాథంను ఎవరూ గద్దించలేదు వెంకటసుబ్బయ్యగారి మొఖం వెలవెలా బోలేదు.

అదే ఒక తిట్టుకు, విట్టుకు మధ్య భేదం, ఒకసాధారణ సభా కార్యకర్తకు, గొప్ప సంఘ సంస్కర్తకూగల తేడయేమో:

'ప్రతిఒక్కరూ ప్రసంగాలుచేసి తానూ ఒక గొప్ప సంఘ సంస్కర్త అని పేరు చెప్పుకొని చరిత్రలో తన పేరును సువర్ణాక్షరాలతో లిఖించాలని పట్టుపట్టడం, తన కాంస్య విగ్రహం కాకపోయినా కనీసం ఒక శిలావిగ్రహమైనా నౌరాస్తాలో ప్రతిష్ఠించాలని నిరశన వ్రతాలు చేయటమేతప్ప, ప్రాక్టికల్‌గా ఇదీ విషయం అని చేసి చూపించిన మొనగాన్ని ఒకణ్ని చూపించండి ఈ దేశంలో నాకు, ఒక్కగా నొక్కణ్ని ... ఉదాహరణకు నేనే ఉన్నాను అనుకోండి. నాకు ఒకకొడుకున్నాడు, పెళ్లీడు వచ్చినవాడు. వాడే కనుక ఒక వితంతువును ప్రేమించానని చెప్తే లేక ప్రేమించుకున్నా



రామయ్య నీటి వసతిగల నాలుగెకరాల పొలం కొన్నాడు. కొన్న పొలం మీద దినా బంగారం పండించాడు. రామయ్య గ్రోమోరే వాడతాడు.

**ఎందుకో తెలుసా?**

ఏటేటా పైరు పండించడం వలన భూమిలో తరిగే పోషక పదార్థాలు తిరిగి భర్తీ చేయక పోతే దిగుబడి తగ్గుతుంది. గ్రోమోర్ ఎరువులు, అమోనియా రూపంలో అంతే నత్రజని, అంతా నీటిలో కరిగే భాస్వరామ్లం, సమానంగా ఎక్కువగా కలిగి వుంటంచేత పైరుకు పూర్తి పోషణనిస్తాయి. గ్రోమోర్ ఎరువులు వరి, చెఱకు, జొన్న, మిరప—అన్ని పైర్లకు తప్పక వాడి ఎక్కువ పండించండి.




గ్రోమోర్ ఎరువులు గుళ్లు గుళ్లుగా వుంటం వల్ల, చల్లడానికి, మొక్క మొక్కకు వేయడానికి, గొఱుతో వేయడానికి వీలుగా వుంటాయి. గ్రోమోర్ 22-22-11 లోని పొటాషు కూడా నీటిలో పూర్తిగా కరుగుతుంది.

గ్రోమోర్ ఎరువులకయ్యే ప్రతి రూపాయి ఖర్చుకూ కనీసం మూడు రెట్లు లాభం వస్తుంది. ఇకనుంచీ ఎరువు అని అడక్కండి. గ్రోమోర్ అనే అడగండి.

గ్రోమోర్ అమోనియం ఫాస్ఫేట్ 28-28-0
గ్రోమోర్ అమోనియం ఫాస్ఫేట్ 20-20-0
గ్రోమోర్ యన్.పి.కె. 22-22-11
గ్రోమోర్ యూరియా 46-0-0




**కోరమాండల్ ఫెర్టిలైజర్స్**

## వెల వెలా పోయిన భూదేవిని
# గ్రోమోర్ తో
## కళ కళా పండించు



## చేనుకు చేవ, రైతుకు రొఖ్ఖం చేకూర్చుటలో పెట్టింది పేరు— గ్రోమోర్

గ్రోమోర్ ఎరువుల వ్యాపార వివరములకు సంప్రదించండి:
ప్రధాన పంపిణీదారులు ఇ.ఐ.డి. ప్యారీ లిమిటెడ్, 66 రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్

AIYARS-CF-32 Tel.

సరే ఫలాన వితంతువును పెళ్లి చేసుకుంటానని అన్నా తక్షణం పెళ్లి చేస్తాను. ఇది వట్టిమాటకాదు. మీముందు ప్రమాణంచేసి చెప్తున్నాను.'

సభకేసి చూసాడు కాస్సేపు. అంతా మౌనం.

రంగనాథం ఆడవాళ్లకేసి చూసాడు. అక్కడినుండి సుధ తనకేసి చూడ్డం గమనించాడు. గుండె దడదడలాడింది. తనకు సుధతో ఉన్న సంబంధం గురించి చెప్పాలా? ఉహుఁ ఇంత్రబతుకు బ్రదికి ఒక అఘ్రాణిత పుష్పాన్ని స్వీకరించటమా? ఏ కాలేజిగర్లునో పెళ్లి చేసుకోక, కాని సుధ? పాపం...

'చిల్లికానీ కట్నం తీసుకోకుండా నా కొడుక్కిప్పుడే పెళ్లిచేస్తాను. ఈ కట్నం అనేడి ఒక దురాచారం మన సమాజం పాలిటి పెనుభూతం. దాన్ని గురించి చెప్పాలంటే ఒక రోజయినా చాలదు. అది వేరే ఏదైనా సభలో విందురుగాని. కాని ప్రస్తుత విషయం గురించే నా బెంగ. కాని నాకా అదృష్టం ఏది? మా వాడికంత ఆదర్శం ఏది? పండిత పుత్రుడనే సామెత వుండనే వుంది. నాతల వెంట్రుకలెన్నో నాకన్ని ఆదర్శాలు, ఆశయాలు. కాని ఏం లాభం? మావాడిలో టార్చిలైటు—కాదు-ఎక్స్‌రేవేసి చూసినా అణుమాత్రం కూడా కనిపించవు. అది నా

# ఓడిపోయిన వాళ్లు

దురదృష్టం. పూర్వజన్మలో చేసుకొన్న పాప ఫలితం' సభలో ఆడవాళ్లకేసి చూసి,

'మీరు మరోలా భావించకద్దు నేనొకటి అడుగుతాను మిమ్మల్ని. ఇప్పుడు ఇక్కడ వున్న బాలవితంతువుల్లో ఎవరైనా మావాడిని ప్రేమించిన వాళ్లున్నారా? పోనీ పెళ్లి చేసుకోవటానికి ఇష్టపడే వాళ్లున్నారా? మావాడి కిష్టం ఉన్నా లేకపోయినా నచ్చజెప్పటానికి ప్రయత్నిస్తాను' కాస్సేపాగి.

'ఎవరూ లేరు. అవును ఇది నా దురదృష్టంగాక...'

'అది మీ దురదృష్టంకాదు' అంటూ ఒక అమ్మాయి లేచింది.

'ఎవరమ్మా నువ్వు?'

'పేరు సుధ. నేను, మీ కొడుకు రంగనాథం ప్రేమించుకున్నాం'

'నిజంగానా? ఎవరమ్మాయి వమ్మా' కళ్లజోడు సవరించు కున్నాడు, వెధవ చత్వారం' అని గొణుక్కుంటూ.

'పశుపతిరావు గారమ్మాయిని'

'హాహా ఇంజనీరింగు పై చదువులకని అమెరికా వెళ్తుండగా విమాన ప్రమాదంలో మరణించిన అబ్బాయి శంకరం తాలూకు...'




'.........

'రంగనాథం! ఈ అమ్మాయి చెప్పింది నిజమేనా?'

ఔనన్నట్టు తల వంకించి అతి భారంగా అడుగులేసుకుంటూ సభాప్రాంగణంలో నుంచి బయటికి వెళ్లాడు, విషాదఘట్టంలో సినిమా హీరో నిష్క్రమించినట్టు.

ఒక జిల్లాలోనే కాదు, రాష్ట్రమంతటా తెలిసింది ఈ విషయం.

అవి మే పదవ తేది. సుధ రంగనాథంల వివాహం అతి వైభవంగా జరిగింది. ఒక మంత్రిగారు, కలెక్టరు, ఇదితర ప్రభుత్వోద్యోగులు, కంట్రాక్టర్లు, వాహ్ ఒకటేమిటి, వేలకొద్ది జనం ఆ పెళ్లికి హాజరయినారు. రంగనాథం, రామనాథంలను మెచ్చుకోనివారు లేరు.

మరునాడు పత్రికలు లాయరు రామనాథం, కొడుకు కోడలు ఫోటోలను ప్రచురించి 'ఆదర్శ వివాహం' అనే మకుటంతో సుధా రంగనాథంల పెళ్లిని శ్లాఘించాయి.

రెండురోజుల అనంతరం మిట్ట మధ్యాహ్నం...

లాయరు రామనాథం కుర్చీలో కూచుని తల పట్టుకొని ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. రంగనాథం యింట్లోంచి అప్పుడే వచ్చాడక్కడికి.

'ఇన్నేళ్లుగా ఎన్నో పద్మవ్యూహాల్లో విజయం సాధించి చివరికి ఈనాడు వోడిపోయానురా రంగడూ, నేను వోడిపోయాను. నువ్వొక వితంతువును ప్రేమిస్తున్నానని నా కొక్కమాట చెప్తే నేనలా లెక్చర్ ఇచ్చేవాణ్ని కాను. అయినా నేనలా చెప్పబోతున్నట్టు నేను చూపిన కాయితంల్లా నీకు తెలిసి ఉండి కూడా ఎందుకు మాట్లాడలేదురా. మరి ఆ అమ్మాయి మన కాళ్లా వేళ్లా పడి బతిమాలుకొంటే కొంత డబ్బిచ్చి పీడా విరగడ చేసుకొనేవాళ్లం గదా. ఫారెస్టు కంట్రాక్టర్ భాస్కరరావు అరవైవేలు కట్నం ఇస్తానన్నాడురా, అరవైవేలు! పిల్ల? రంభనుకో. కాని ఏం లాభం? అంతా అయిపోయింది.'

రంగనాథంకు కోపం పెల్లుబికింది.

'మీరే దీనికంతటికీ కారణం నాన్నా! వోడ

పోయింది మీరుకాదు, నేను. వయసులో ఉన్న నాకు మీరు మొదటే గ్రహించి పెళ్ళి చేయకపోవటం పెద్ద పొరపాటు. పోని, ఈ భాస్కరరావు విషయం పదిరోజుల ముందు చెప్పినా నేనీ సుధను చూసేవాడ్ని కాను. ఆమాటకొస్తే అసలు సుధను నేను కామించానేగాని ప్రేమించలేదు నాన్నా. అందుకే ఆనాడు ఏ నిర్ణయమూ తీసుకోని నేను సభలో మౌనంగానే వున్నా, మీరే మళ్ళీ ఆడవాళ్ళకేసి అలా మాట్లాడి ఇంతదాకా తీసుకొచ్చారు. ఇప్పుడు అకులు పట్టుకొని ప్రయోజనమేవిటి చేతులు పూర్తిగా కాలింతర్వాత? ఒక విధవను పెళ్ళిచేసికొని నా జీవితంలో వోడిపోయాను, చిత్తుగా పరాజయం పొందాను.'

'మీ రెవరూ కాదు అసలు వోడిపోయింది నేను' అంటూ లోపలినుండి సుధ కంఠం వినిపించింది.

ఇద్దరూ అప్రతిభులై పోయారు.

'మీ ఇద్దరిలో ఇంత కుళ్ళుందని నాకెంత మాత్రమూ తెలియదు. నాకళ్ళతో చూసింది, చెవులతో విన్నది మాత్రమే నిజమని అనుకొన్నాను. ఇప్పుడు తెలిసింది మీ సిసలైన నైజం. ప్రేమ ప్రేమంటూ అహోరాత్రాలు నీ పేరే కలవరిస్తూ నీరూపే గుర్తుకు తెచ్చుకుంటూ ఉంటే మతి పోతున్నది అన్న మాటల వెనక ఇంత నీచత్వం ఉందనుకోలేదు.

'ఆదర్శాలు, ఆశయాలు అంటూ సభల్లో బల్లగుద్ది చెప్పి, సంఘంలో సంస్కర్తగా చలామణి అవుతూ, పత్రికల్లో తమ ప్రసంగ వ్యాసాల్లోని శ్రీరంగనీతులు చూసుకొని ముసి ముసి నవ్వులతో మీసంమీద చెయ్యి వేసుకొనే మీ ఉదాత్తమైన మనసులో ఇంత కాలకూట విషం ఉందా? ఛీ! ఛీ! సిగ్గులేదూ. పైకి ఎన్ని చెప్పితేనేం, హృదయ సంస్కారం లేకపోయిన తర్వాత. తమ కూతురు సుమంగళి అవుతున్నదంటే ఎంతో సంతోషపడ్డారు అమ్మా, నాన్న. ఎంత పిచ్చివాళ్ళు?!

విధంతువుగా వున్నా నా జీవితం సాఫీగా గడిచింది. ఈనాడు సుమంగళినైనా ఇప్పుడు నా హృదయంలో రేగే ఈ తుఫాను తీవ్రత ఎంతమంది చూడగల్గుతున్నారు... హే భగవాన్! మొదటిసారి నీ మూలంగా వోడిపోయాను. ఇప్పుడు మనసు, మమత అంటూ తోటి మనుషుల చేతుల్లో రెండోసారి వోడిపోయాను,' వెక్కి వెక్కి ఏడ్చింది సుధ! తండ్రి కొడుకులిద్దరూ తలలు వంచుకొన్నారు. ●

# వారఫలం

## 7-8-1970 శుక్రవారం మొదలు 13-8-1970 గురువారం వరకు

**మేషం:** వ్యాపారంలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వారం ఆఖరులో మీరు ప్రయోజనం లేని శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. సాటివారితో మాటపట్టింపులు తగవు రాజకీయ వ్యవహారాలలో చికాకులు యేర్పడుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు

**మిధునం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో యితరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

**కర్కాటకం:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. దైవకార్యాలు నెరవేరుతాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**సింహం:** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కన్య:** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

**తుల:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**వృశ్చికం:** వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో అనుకోని శ్రమకు గురి కాగలరు. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో తిరిగి అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది,

**ధనుస్సు:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో ప్రయోజనంలేని శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. కుటుంబ వ్యవహారాలలో కార్యభారం పెరుగుతుంది.

**మకరం:** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్టుగా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాలలో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కుంభం** నమ్మినవారి వల్ల యిబ్బందులకు గురి కాగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది,

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:** ప్రయత్నించిన ప్రతి పని సులువుగా నెరవేరగలదు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో ఆందోళనకు గురి కాగలరు. ప్రయాణాలలో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు తిరిగి అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతోషకరమైన వార్తలను వింటారు.

—మహేష్

# ప్రొద్దుటి
# తాజాతనము
# గంటలు తరబడి
# రోజంతా

ఔను, స్నానం అయిన తరువాత ప్రొద్దుటి పూటవుండే తాజాతనము రోజంతా గంటల కొద్దీ వుంచుకోవచ్చు....పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్క్‌తో. భారతదేశంలో విస్తారంగా అమ్ముడయే టాల్క్ పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్క్‌కు నాజూకైన పరిమళము అల్లా వస్తూనే వుంటుంది.... పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్క్ తడిని వెంటనే పీల్చుకుంటుంది, అతిసన్నిహితంగా చేరాలనిపిస్తుంది చల్లగా, తాజాగా, పరిమళిస్తూ వుంటుంది. ఉక్కతో ఒళ్లంత అంటుకుంటూండే ఉష్ణ ప్రదేశాల్లోకూడా. ఇది సంవత్సరం పొడుగునా అన్నికాలాలలోను వుపయోగించగల టాల్క్!

3 సైజులలో లభిస్తూంది
ఫ్యామిలీ-లార్జి-మీడియమ్




## పాండ్స్
## డ్రీమ్ ఫ్లవర్ టాల్క్

అతి మృదువుగా ఉల్లాసకరమైన టాల్క్

చీస్ బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు. యస్. ఎ. లో స్థాపితము.)

P-5482




**జరిగిన కథ**

అనూరాధ తల్లి అన్నపూర్ణమ్మ. తమ్ముడు రాజా. అన్నపూర్ణమ్మ కన్నబిడ్డల చదువుకోసం ఎంతో కష్టపడుతూవుంటుంది. ఒకనాడు అనూరాధ డాన్సు చూచి బహుమతినీయడానికి ఆగంతుకుడుగా వచ్చి డా. హరికృష్ణ పరిచయమవుతాడు. ఇంతలో మద్రాసులో ఒక నాటక సమాజం వారి పిలుపుతో నాట్యప్రదర్శన యివ్వటానికి మద్రాసు బయలుదేరుతుంది. స్టేషనులో హరికృష్ణ కలుసుకుని మద్రాసుకు ఆమెను తీసుకెళ్తాడు. హరికృష్ణ ఆమెని ఆకర్షించాడు. శారద గురించి తెలుసుకోవాలని ఆమెకి ఆసక్తి కలిగింది.

## 4

నృత్యం పూర్తయింది. ప్రేక్షకులు ఆనందంతో అభినందించారామె నెంతగానో. మేనేజరు దగ్గర సెలవుదీసికొని శారద వున్నచోటకి వచ్చింది అనూరాధ.

ఆమె యింకా కూర్చున్న చోటునుంచి కదలనే లేదు. అనూరాధ ఎదురగా నిల్చున్నా అలాగే బొమ్మలా చూస్తూండిపోయిందామె.

'అక్కా! వెళ్దామా?' అన్నది అనూరాధ.

'అనూ! మీ అమ్మ ఎన్ని నోములు నోచి కన్నది నిన్ను? కళ నిన్ను వరించిందా? నువ్వే కళను వరించావా? నాకింత కళామూర్తి చెల్లాయిగా లభిస్తుందని ఏనాడూ అనుకోలేదమ్మా! బావ చెప్పినపుడు ఏదో అనుకున్నాను. కానీ నిజంగా నీలో రాధ వుంది.' పరవశతతో మధురంగా నినదించిందామె కంఠం.

'నీనుంచి పొగడ్తలు ఆశించలేదక్కా!'

'పొగడ్త కాదు అనూ!'

'కాదని తెలుసు. కానీ నన్నింతగా అభినందించకు. గర్వంతో ఎగిరిపోతానేమో!' అన్నది అనూరాధ చిన్నగా నవ్వుతూ.

అలా జరగదులే! ఎగిరి ఎక్కడ వాలినా పట్టుకోడానికి బావ వున్నాడని తెలుసుకో అనూ!'

'అది నీ భ్రమే! అలా జరగదు!'

తన పరిహాసోక్తి ఆమెకు నచ్చలేదని గ్రహించింది శారద. అందుకే మరోమాట మాట్లాడకుండా కారు దగ్గరకు నడిచింది.

హరికృష్ణ నోరు విప్పనేలేదు. ఆశ్చర్యపోయారా అక్కాచెల్లెళ్లు. అనూరాధకా విచిత్రవ్యక్తి అర్థంగావడం లేదెంత ఆలోచించినా.

మనస్సున దాగిన ప్రతి అక్షరాన్నీ విన్పించుతాడో క్షణంలో.

కనుబొమకూడా కదిలించనంత నిర్వికారత కన్పించుతుంది మరోక్షణంలో.

నవ్వుల పువ్వులు జల్లడమే నాథ్యముం అంటాడోసారి. .

నవ్వక మన మాటే విననట్లు యోగిలా వుండిపోతాడు మరోసారి.

'ఆ అక్కాచెల్లెళ్ళను యింటిదగ్గర దింపి వస్తాను. గుడ్‌నైట్', అని సెలవు దీసికొన్నాడు.

'ఇతని జీవితాన దౌర్జనశాపం ఎంత ఘోరమైనదో!' అనుకున్నది అనూరాధ.

ఉదయాన లేవగానే తల స్నానంచేసింది అనూరాధ. శారద జడ అల్లి మల్లెలుంచింది తానుకూడా మల్లెల్ని తురుముకుంటూ అన్నది.

'బావకో చెల్లెలుంది. చూస్తావా ?' ఏదోభావం మెరుపులా మెరిసి మాయమైందామె కనులలో.

ఆశ్చర్యం తొంగి చూసింది అనూరాధ నేత్రాలలో. ఎక్కడ అని అడుగబోతూండగా శారదే అన్నది—

'దగ్గర్లోనే వుంది. వో పల్లెటూరు. నీరజ అక్కడే వుంది,'

'నీరజా ! ఆ అమ్మాయి పేరు ! బావుంది ! పెళ్ళయిందా?' ప్రశ్నించింది అనూరాధ.

'వుహూ ! కాలేదు. ఎలా...ఆ...! వోసారి వెళ్దామూ నీరజ దగ్గరికి. బావ వస్తానన్నాడు !' అన్నది శారద ఏదో చెప్పబోయి మధ్యలో ఆపి.

అనూరాధ తానారోజునే వెళ్ళిపోవాలి, అమ్మ ఎదురు చూస్తూంటుంది, అని చెప్పింది. కానీ శారద నాలుగురోజులు వుండిపొమ్మని కోరింది.

'ఈ అక్కయ్యకు నువ్వుతప్ప మరో చెల్లాయి లేదింతవరకు. ఆ సంతోషాన్ని కొన్నాళ్ళైనా అనుభవించనివ్వు.' అన్నది శారద.

అనూరాగ పూర్ణమైన ఆమె కోరికను నిరాకరించలేక పోయింది అనూరాధ. హరికృష్ణే అడగమన్నట్లు తోచిందామెకు. ఆ కోరిక వెనుక ఏదో అర్థం దాగివున్నట్లనిపించుతోంది. అతడు రాగానే ప్రయాణమయ్యారు మువ్వురూ. నీరజ కూడా ఎంతో అందంగా వుంటుందేమో అన్నగారిలాగానే అనుకుంది అనూరాధ. కానీ అన్నను విడిచి ఎందుకా పల్లెటూరులో వుంటుందో అర్థం గాలేదామెకెంతగా ఆలోచించినా.

వో గంటలోనే ఆవూరు సమీపించింది. వో పెంకుటిల్లు కన్పించుతోంది దేవాలయం ప్రక్కనే. అక్కడే ఆగిపోయింది కారు.

హరికృష్ణ ముందు నడిచాడు. శారద అనూరాధను 'లోనికి వెళ్దాం పద' అంటూ తోడుగా నడిచింది.

'ఎవరది? అన్నయ్యా! నువ్వేననుకున్నానులే!' అంటోందో కంఠం.

'వచ్చుకున్నావేమిటమ్మా! తల నొప్పిగా వుందా!' ఆప్యాయత వెల్లువలై దూకిందా కంఠాన.

అనూరాధ 'అది అతని గొంతేనా? ఎంత అనురాగం విరిసివుందో!' అని ఆశ్చర్యపడింది.

'శారదా! లోపలికి రండి!' అన్నాడు హరికృష్ణ.

ఎందుకో అతిథి మర్యాదలతో ఆహ్వానించలేదక్కడ. ఆ గదిలో కాలు పెట్టగానే శిలావిగ్రహంలా నిల్చుండిపోయింది అనూరాధ. '

ఎదురుగా కన్పించిన దృశ్యం మనస్సును రంపంలా కోసివేస్తోంది నిర్దాక్షిణ్యంగా.

సుమారు పదహారేళ్ళున్న అమ్మాయి నిర్జీవప్రతిమలా పడుకునివుంది మంచం మీద. ప్రక్కనే మంచానికి కొంచెం

# ఆరాధన

దూరంగా వో చక్రాలబండి వుంది.

ఆ అమ్మాయి సజీవంగానే వున్న—అని చెప్పడానికి మాత్రం ముఖం కాంతివంతంగా వుంది. కాళ్ళూ, చేతులు సన్నని పుల్లల్లా వున్నాయి. ఒక్క అడుగైనా వేయలేదని గ్రహించింది. అంగుళం కదలడానికి కూడా మరో మనిషి సాయం కావలసిందే.

'ఇదేరకపు వ్యాధి? ఇంత భయంకరమైన జబ్బు వుందా యీ లోకంలో?' అనూరాధ మనస్సు వణికిపోతోంది. బాధతో మెలిదిరిగిపోతోంది.

శారదే పరిచయం జేసింది అనూరాధని. నమస్కరించడానికి కూడా పనికిరాని తన చేతులవంక చూసిందోసారి. విరక్తిగా నవ్వింది. ఆ నవ్వులో అనంతమైన వ్యథ ఘోష పెడుతున్నట్లనిపించింది.

అనూరాధ మనస్సు నెవరో ముక్కలు ముక్కలుగా ఖండించుతున్నట్లు బాధ పడుతోంది. ప్రక్కనే కూర్చున్న హరికృష్ణని చూడగానే ఆమె కనులలో అశ్రుబిందువులు నిండుకొచ్చాయి.

జీవితాన విరిసిన వెన్నెలంతా ఆకస్మికంగా అంధకారంగా మారిపోయినట్లు ఏమీ తెలియని మూఢుడిలా కూర్చున్నాడు చెల్లెలి దగ్గర.

ఆ వ్యాధి ఆ అనురాగమూర్తికి కూడా లొంగలేదని గ్రహించింది అనూరాధ. అంతా నిశ్శబ్దమే అక్కడ. ఎవ్వరూ పెదవి కదుపలేక పోతున్నారెంత సేపటికీ.

నిర్దాక్షిణ్యంగా ఆ భయంకరమైన వ్యాధితో శిక్షించబడిన ఆ శాపగ్రస్తురాలే నోరు విప్పింది.

'కూర్చోండి. అన్నాయ్! పనిమనిషితో చెప్పు వంటచేయమని.' ఆ కంఠాన మాధుర్యమే లేదు.

హరికృష్ణ లేచివెళ్ళాడు. శారద కూడా వంటగదిలోకి వెళ్ళింది.

'చందమామలాంటి అన్నయ్యకీ నీరజ రాహువుగా వుందనుకోండి! భగవంతుడు కూడా పిచ్చివాడయ్యాడేమో నన్పించుతుంది అనూరాధగారూ! ఆ పిచ్చితో ఏమీ తోచక నన్నిలా సృష్టించివుంటాడు' అన్నది నీరజ.

ఏమని ఆ బాధామయిని వూరడించాలో తోచకుండా పోయిందామెకు.

'నా కోసం అన్నయ్య తన ఆనందాన్ని దూరం జేసుకుంటున్నాడు. ఈ రోగం నన్ను చంపదు. తాను చావదు. ఎదుటివాళ్ళని మాత్రం మరింతగా బాధిస్తుంది. ఇప్పటికి ఆరేళ్ళనుంచి అన్నయ్య ఈ మొండిఘటం కోసం తపస్సు చేస్తున్నాడనుకోండి.

కడుపునిండా తినలేడు. క్షణమైనా హాయిగా కన్ను మూయడు. నవ్వలేడు. నవ్వుల్ని విన్నా పెదవి విప్పడు. ఏం చేయను? చెప్పండి! వో గుక్కెడు విషం తాగుదామనుకుంటాను. అమ్మో!...'

ఆమెగొంతు బొంగురుపోయింది. కనులలో అశ్రుబిందువులు మెరిశాయి. తల ప్రక్కకు త్రిప్పి తలగడతో కళ్ళు వత్తుకుంది.

'ఈ అస్థిపంజరం కన్పించకపోతే తానూ ఈ లోకంలో ఎవరికీ కన్పించనంటాడు. ఎంత చెప్పినా వినడు. అందుకే మరీ అనుక్షణమూ ఎదురుగా వుంటే బాధతో ఎముకలగూడులా మారిపోతాడేమో నన్న భయంతో ఈ వూళ్ళో వుండిపోతానన్నాను. పల్లెటూరిగాలి నా ఆరోగ్యానికి మంచిది. నాటువైద్యం చూద్దాం! అన్నాను. అన్నయ్యను మోసగించడమే అది కానీ నా కోసం జీవితాంతం కుమిలి పోవడం చూడలేక పోతున్నాను. ఏం? నే చేసింది తప్పంటారా?' బాధ తరంగాల్లై దూకుతోందామె హృదయాన. కాదన్నట్లు తలూపింది అనూరాధ. పెదవి కదిపితే లోన దాగివున్న దుఃఖం కట్టలు త్రెంచుకుంటుందేమో నన్పించుతోందామెకు

ఆ డాక్టరిపైన అంతులేని జాలి కలిగిందా క్షణంలో. ఆతని వోర్పుకి ఆశ్చర్యపడిందెంతగానో. త్యాగంతప్ప ఏదీ మిగలని ఆ యువకుని జీవనవీణియ అందుకే మూగవోయిందని గ్రహించింది.

శారద, వంట పూర్తయిందంటూ అనూరాధను పిలిచింది. ఆమెకు ఒక్క ముద్దకూడా మింగుడు పడటంలేదు. పనిమనిషి ముద్దలుచేసి నీరజ నోటికి అందించుతోంది ప్రక్కన నిలబడి.

ఆ దృశ్యాన్ని చూడలేక పోతోంది అనూరాధ. నవ్వుతూ, నవ్విస్తూ, సెలయేరులా పరుగులు పెట్టవలసిన వయస్సు. కానీ పాపం! కాళ్లూ చేతులు అన్నవి లేనట్లు విరిగిన బొమ్మలా పడుంది. అందుకే ఆమె హృదయం దహించుకు పోతోంది.

హరికృష్ణ ఏదో నాలుగు మెతుకులు మర్యాదకన్నట్లు విషంలా మింగాడు. అందరికన్నా ముందే లేచి వెళ్లిపోయాడు. అతని నేత్రాలు అనుక్షణమూ అశ్రుసిక్తాలయి వుండడం గమనించింది అనూరాధ. చెల్లెలి బాధను చూడలేక అవిధంగా లేచి వెళ్లిపోయాడని గ్రహించింది.

'ఏమీగాని తనవే అంతగా దుఃఖం పైన వేసుకుపోతోంది. ఇక మనస్సున మనసైన ఆ అన్న బ్రతుకు నిండుగా బండెడు దుఃఖంతప్ప ఏం వుంటుంది?' అనుకున్నది.

ఆ బాధను కొంతసేపైనా మరిచి పోవడానికి వీలులేదామెకు. వో పుస్తకం చదవలేదు— చేతుల్లో పుస్తకం నిలిచేంత వోపికకూడా లేదు. పోనీ కూర్చుని ఏ వినో దాన్ని చూద్దామన్నా నడుం నిలువదు.

'భగవాన్! ఇంత నిర్దయుడవని ఏనాడూ అనుకోలేదే! ఎందుకింత కక్షనీకు? నీబిడ్డలని నువ్వే శపించుతున్నావా తండ్రీ! ఇదేంచిత్రం! ఇదో ఆటా నీకు? ఇందులోనూ ఆనందం లభిస్తోందా! ఉహూ! నేను నమ్మను. నమ్మలేను. మరి...మరి... ఏమిటీ ఘోరం!!' అనూరాధ హృదయాన ఆవేదన ఘోషపెడుతోంది.

తిరిగి బయల్దేరేముందు అన్నది నీరజ. 'మిమ్మల్ని చూస్తోంటే నాలో ఎందుకో అంతు లేనంత ఉత్సాహం పొంగి పొరలు వస్తోంది. మీతో కలిసిమెలిసి వుండా లనిపించుతోంది. కానీ...ఆ!... ఏంలేదు లెండి! వెళ్లండి! ఉహూ! వెళ్లిరండి! ఈ నీరజను మరిచిపోకండి! ఎప్పుడైనా గుర్తుకువస్తే వో రెండు మాటలు వ్రాయండి. ఎవరో ఒకరు చదివి విన్పించుతారు, ఎలా మరిచిపోతారనలు ?! పీడకల ఎన్నాళ్లయినా గుర్తేవుంటుంది చూడండి, అంతే వేసుకూడా! చూసినవాళ్లు బ్రహ్మ ప్రయత్నం చేసినా మరిచిపోలేరు. అవునా !...' నవ్వింది నీరజ. ఆ నవ్వు వింటూంటే హృదయం తరుక్కుపోతోంది. ఆ మాటలు వింటూంటే నిలువెల్లా బాధ జరజరా పాకిపోతోంది విద్యుత్తులా.

'లేదమ్మా! నీరజా! నేను నీదగ్గరే వుంటానెపుడూ! నవ్విస్తూ, నవ్వుతూ కథలు చెబుతాను. కబుర్లు విన్పించుతాను. పువ్వులా పెంచుకుంటాను. గుండెల్లో దాచుకుంటాను' అని చెప్పాలన్నంత ఆవేశం, అనురాగం వ్యాపి చేశాయామెను. కానీ ఒక్క అక్షరం కూడా వెలికి రానేలేదెంత ప్రయత్నించినా.

మౌనంగా సెలవు దీసికొన్నారందరూ. హరికృష్ణనుంచి వుండి వుండి నిట్టూర్పులు వినవస్తున్నాయి. అతడు కారు నడుపుతున్నాడన్న మాటేగానీ ఎదురుగా వస్తూన్న దేనినీ చూడడంలేదు. వో లారీ ఢీకొన్నంత పన్కైంది. హఠాత్తుగా బ్రేక్ పడింది యాంత్రికంగా.

ఎగిరిపడ్డారు శారదా, అనూరాధలు. వెనుదిరిగైనా చూడలేదు హరికృష్ణ. కారులో మరో యిద్దరు వున్నారన్నమాటే మరిచిపోయినట్లు చక్రం త్రిప్పుతున్నాడు.

అతని మనస్సు వికలమైపోయిందని గ్రహించింది అనూరాధ. శారద కారు దిగుతూండగా అన్నాడు మద్రాసు వచ్చిన తర్వాత—

'హిందీ పిక్చరొకటి కొత్తది వచ్చింది అజంతా మహల్లోకి వెళ్దాం! కూర్చో!'

శారద అతని ముఖంవంక చూసి కారులో కూర్చుండి పోయింది మౌనంగా. టిక్కెట్లు తెచ్చి హాల్లోకి నడిచాడు. సినిమా మొదలైందప్పటికే.

కథ రసవత్తరంగానే నడుస్తోంది. నటీనటుల నటన కూడా ముచ్చట గొల్పుతోంది. పాటలు మధురంగా వున్నాయి. కథలో లీనమైపోయిన అనూరాధ ముందున్న మనిషితల అడ్డంవచ్చి ప్రక్కకు జరిగింది. శారద 'కన్పించటం లేదా!' అన్న ప్రశ్నకు సమాధానమిస్తూ హరికృష్ణ వంక చూసింది.

అతడు వెనక్కు వాలి కళ్లుమూసుకుని కణతలు నొక్కుకుంటున్నాడు. —ఒంటరిగా బాధను భరించలేక అలా సినిమాకు వచ్చాడని గ్రహించింది అనూరాధ. ఎంతో జాలివేసిందతనిపైన. ఆమె కూడా సరిగా చూడలేక పోయిందాపైన. సినిమా పూర్తికాగానే వెళ్లేముందు 'డ్రింక్స్' తెప్పించాడతడు.

తానుమాత్రం తెప్పించుకోలేదు.

'మీరు తీసుకోరా! కాస్త చల్లగా వుంటుంది!' అన్నది అనూరాధ.

'ఇదిగో! ఈ గ్లాసు మీరు తీసికోండి! అక్కా! మరో డ్రింక్ తెప్పించు!' అన్నదామె తిరిగి.

అప్యాయంగా చేతి కందించిన గ్లాసును నిరాకరించలేక పోయాడతడు. తాగిన తరువాత కొంచెం తేటపడిందతని ముఖం.

తర్వాత బయలుదేరారందరూ. శారద యింటికి వచ్చేసరికి ఓ జాబు వచ్చివుంది. ఆమె భర్త, సతీశ్‌బాబు మరో నాలుగు రోజులవరకూ రాలేనని వ్రాశాడు.

'అనూరాధ తోడుందిగా!' అన్నాడు హరికృష్ణ.

ఆ మాటల్లో ధ్వనించిన ఆత్మీయత అనూరాధ నాశ్చర్య పరచింది. ఎప్పటిలా! 'అనూరాధగారు!' అనలేదతడీసారి. 'అనూరాధ' అని చెప్పడమే బాగుందన్పించిందామెకు. తల్లికి మరో నాలుగురోజుల వరకు రాలేనని వ్రాసింది.

తమ్ముడు రాజుకి, తల్లికీ మంచి బట్టలు తీసికొందా రోజున. 'పెన్' కొని దాచింది సూట్‌కేసు అడుగున రాజుకని. తనకుమాత్రం ఏమీ తీసుకోలేదామె.

ఆ రోజంతా మద్రాసు తిరగడమే సరిపోయింది. సముద్రం, నౌకలు అన్నీ ఎంతో అందంగా అగుపించాయి. ఇంకా మిగిలిన చిత్రాలన్నింటినీ చూపించింది. శారద అనుక్షణం ప్రక్కనేవుండి చూపించింది. హరికృష్ణ ఆ రోజంతా కన్పించనేలేదు. ఫోనుచేసింది శారద. 'బాబుగారు పడుకున్నారమ్మ! ఒంట్లో కులాసా లేనట్టుంది' అన్నది పనిమనిషి.

'ఇంతే అనూ! నీరజకోసం అహర్నిశలూ బాధపడుతూంటాడు. వో హాస్పిటలైనా ప్రారంభించమంటూ రాయన. ఉహూ! విన్పించుకోడా మాట. 'నీరజకు ఆరోగ్యం చేకూర్చలేని నేను డాక్టరుగా పనికిరాను' అంటాడు. అబ్బ! ఎంత విరక్తిగా మాట్లాడుతాడని చెప్పను ?!"

శారద కంఠాన ఆవేదన వెల్లుబికింది.

'మరీ సున్నితహృదయం అక్కా! ఆయనది. ప్రతి దాన్నీ కొండంతచేసి భయంతో, బాధతో ముడుచుకు పోతారనుకుంటాను,' అన్నది అనూరాధ.

అనూరాధ నంత ఆప్యాయంగా చూసిన ఆ డాక్టరు ఆమె వెళ్తున్నానని ఫోను చేసినా 'రాలేను. క్షమించు. అనూరాధా!' అన్నాడు.

శారదా, సతీశ్‌బాబుు స్టేషన్‌కి వచ్చారు మంజులతోపాటు. రైలు కదుల్తూండగా వచ్చాడు హరికృష్ణ. అతను రాకుండా వుండలేడని అనూరాధ అనుకుంటూనే వుంది. ఆమె వూహ నిజమైంది.

'ఈ డాక్టర్ని మరిచిపోకు? ఎప్పుడైనా ఏమైనా కావాలని అర్థించులేనేమో! లేదనిమాత్రం అనకు అనూ!' అన్నాడు బాధ, అనురాగం మేళవించిన స్వరంతో. 'అనూ!' అని ఆత్మీయంగా సంబోధించాడు.

అలాగేనని తలూపింది. శారద జాబు వ్రాయమని చెప్పింది. అనూరాధ మనస్సున అనురాగబంధం అల్లుకున్న ఆత్మీయత విడిపోతూన్నందు కెంతగానో విలవిలలాడిపోయింది.

ఆమె మనస్సున, హరికృష్ణ, నీరజ నిలిచిపోయారు. ఆలోచన ఎటు సాగినా చివరకి శాపగ్రస్తులైన ఆ అన్నాచెల్లెళ్ల దగ్గరే ఆగిపోతోంది.

* * *

ప్రయాణం మూలాన అలసిపోయింది అనూరాధ. ఆ రోజంతా బద్ధకంగానే వుంది. వచ్చి వారం రోజులయింది. మద్రాసు వాళ్లిచ్చిన వేయి రూపాయలతో సంసారానికి అవసరమైన సామగ్రిని కొన్నది అన్నపూర్ణమ్మగారు. మిగిలిన అయిదువందలు బ్యాంకులో వుంచింది.

శారదకు జాబు వ్రాద్దామని కూర్చున్నది అనూరాధ. అంతలో 'పోస్టు' అన్న కేక విన్పించి వరండాలోకి వెళ్లింది. 'పోస్టుమాన్', బరువైన కవరొకటి అందించాడు.

'ఎవరు వ్రాశారు?! శారదక్కయ్యేమో!' అనుకుంటూ లోనికి వెళ్లి మంచం మీద కూర్చుని కవరులోని కాగితాల్ని తెరిచింది.

హరికృష్ణ వ్రాశాడు. వ్రాసాడనే అనుకున్నదామె. ఆ సారి ఎంతో ఆత్మీయత వెల్లివిరిసిందా జాబులో. సంబోధన అందంగా వుందనిపించింది.

'మల్లియలా అల్లనైన మనస్సున్న అనూరాధా!

అందమైన కలలా, వరమీను వచ్చిన దేవతలా నిలిచిపోయావీ డాక్టరి జీవితంలో.

నువ్వు తప్ప నాకెవ్వరూ లేరనిపించుతోంది. ఎందుకని ప్రశ్నించకు? నీతో మనసు విప్పి చెప్పుకోవా లన్పించుతోంది. ఇదేమిటని దూరంగా జరిగిపోతావా?!

అన్నీ వున్నా అనుభవించలేని వారుంటారు. ఆ కోవలో వాడినే నేను కూడా. ఎవరి ముందూ ఏనాడూ చెప్పుకో లేదింతవరకు నా గురించి. కానీ నిన్ను చూసిన క్షణంనుంచీ నాలో అనంతమైన ధైర్యం కలలు గంటోంది. నా జీవితంలో నేననుకున్నదేనాడూ జరగలేదు.

అమ్మను లక్షల కాశపడి మామయ్య అరవై సంవత్సరాలు దాటిన మనిషితో వివాహం జేయించాడు. అప్పుడు అమ్మకు ఎన్నేళ్లనుకున్నావ్? పద్నెనిమిదేట! ఎంత ఘోరమో చూశావా! తల్లీ తండ్రీ లేని అమ్మ, తన అన్న పన్నిన వలలో చిక్కుకుని విలవిలా తన్నుకుంది. వీలున్నంత వరకు డబ్బు సంగ్రహించిన మామయ్య మళ్లీ అమ్మ ఏమైందీ అని కూడా చూడలేదంటే నమ్ముతావా అనూ! కాని నిజంగా అంతే జరిగింది.

నేను నాన్నగారిని 'తాతా' అని పిలిచేనట ఆ మెరిసిన మీసాల్ని, గడ్డాన్ని చూసి. అమ్మ మనస్సు ఎంత ఆక్రోశించిందో అపుడు!

చెల్లాయి పుట్టగానే అమ్మ కన్ను మూసింది. నాన్నకు వృద్ధాప్యంతో బాటు, మనోవ్యథ కూడా తోడైంది. మంచం మీద దగ్గుతూ, ఆయాసపడుతూ కన్నీళ్ళు తుడుచుకుంటూ 'జానకీ! నీకు అన్యాయం చేశాను. నీ బ్రతుకు బండలు జేశాను' అని గొణుక్కొంటూండే వాడెపుడూ.

ఆయాల చేతుల్లో పెరిగింది నీరజ. అంతవరకు దూరంగావున్న మామయ్య ఆప్తబంధువులా, ప్రాణస్నేహితుడిలా ఆదుకుంటానంటూ వూడిపడ్డాడు.

నిరక్తితో క్రుంగి కృశించిపోతూన్న నాన్నగారు ఆస్తినీ, కన్న బిడ్డలనీ ఆ కిరాతకుని చేతుల్లో వుంచి కన్నుమూశారో పుణ్యక్షణాన.

మామయ్య మా ఆస్తినంతా తన యిష్టం వచ్చినట్లు వ్రాయించాడు. మాకు మైనారిటీ తీరేవరకూ తానే సాయంగా వుంటానన్నాడు. నీరజా, నేనూ హాస్టల్లో వుండేవాళ్లం. సెలవులకి అందరూ యిళ్లకు వెళ్తొంటే ఈ అన్నాచెల్లెళ్లు కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నా ఆశల్ని చంపుకునేవాళ్లు.

అత్తయ్య అరుపులు విని మనస్సు తునకలై పోతుందన్న భయంతో నీరజ వేస



కూడా ఒంటరిగా హాస్టల్లోనే గడిపివేసేది. పిల్లాయికి అపుడు ఎన్నేళ్లనుకున్నావు? ఆరేళ్లు! కాన్వెంటే చెల్లాయికి అమ్మా, నాన్నా!

నా గుండెల్లో దుఃఖం గూడుకట్టుకు పోయి వుండేది. ప్రతి ఆదివారమూ నీరజను వెంటబెట్టుకుని మద్రాసంతా తిరిగేవాణ్ణి. ఆపాటి ఆనందాన్ని కూడా అందనీయలేదు విధి. నీరజ కపుడు పదో సంవత్సరం.

వాళ్ల వార్డెన్ నాకు కబురంపిందా రోజున. భయపడుతూనే వెళ్లాను. నీరజ స్పృహ లేకుండా పడివుంది. వారంరోజుల నుంచి అనారోగ్యంగా వుంటోందనీ ఆనాడు అలా వుదయమే పడిపోయిందని చెప్పింది వార్డెన్.

హాస్పిటల్లో జాయిన్ చేశాను. కానీ తిరిగి నీరజ మనుషుల్లో కలవలేక పోయింది. కాళ్లూ, చేతులు రాను రాను సన్నగా పుల్లల్లా మారిపోయాయి. నడుంలో రవ్వంతకూడా పట్టు వుండకుండా పోయింది.

ఎంత బలమైన ఆహారం యిచ్చినా ఆ పరిస్థితి మారలేదు. ఎందరో డాక్టర్లు పరీక్షించారు. వ్యాధి యిది అని కూడా చెప్పలేకపోయారొక్కరైనా. నా కెందుకో వైద్యవృత్తిమీద వున్న ఆసక్తి క్షీణించి పోయిందా రోజుల్లోనే.

# ఆరాధన

డాక్టరీ పాసయ్యాను. కానీ ప్రాక్టీసు పెట్టాలనిపించలేదు. నీరజ అలా జీవం లేని బొమ్మలా పడివుండే దెపుడూ. మమ్మల్ని వోదార్చడానికి ఎవ్వరూ లేరు. మా బాధను పంచుకోడానికొక్కరూ రాలేదు.

మామయ్య నన్ను పెళ్లి జేసికోమన్నాడా పరిస్థితుల్లో. నీరజను పూవులా చూడగలిగిన మృదుహృదయం ఎదురైతే తప్పక చేసుకుంటానన్నాను. అందుకే నేనూ చూస్తున్నాను అన్నాడు మామయ్య. కానీ ఆయన గోముఖవ్యాఘ్రం అని తెలుసుకున్నా నెప్పటికో.

వచ్చినవాళ్ల మనసుల్ని విరిచే వాడు. 'నీరజ కుంటిపిల్ల. డాక్టరైనా పైసా సంపాదించలేదు వాడు. ఎంత ఆస్తివుంటే మాత్రం ఏమండీ! కూర్చుని తింటే కొండలైనా తరిగిపోవూ! పైగా మీకెందుకండీ ఈ బెడద? జీవితాంతం మీ అమ్మాయి, విసుగూ విరామం లేకుండా ఆ నీరజకు సేవ జేస్తూనే వుండాలి. ఎందుకంత బాధ! మరో మాట! నాకూ పిల్లలున్నారు గనుక చెబుతున్నానండోయ్!

ఈ హరికృష్ణ తండ్రి వంశంలో పుట్టిన ప్రతి ఆడపిల్లా అలా కాళ్లూ చేతులు లేనివాళ్లుగానే అయ్యేవారు. ఏమో! ఎవరికి తెలుసు చెప్పండి! మగ పిల్లలు కూడా అలాగే కుంటివాళ్లు అయిపోతారేమో! లక్షణంగా మరో అబ్బాయికిచ్చి పెళ్లి చెయ్యండి' అంటూ నా గురించి, మా వంశం గురించి లేనిపోని అబద్ధాల నెన్నింటినో సృష్టించి, వచ్చిన ప్రతి మనిషినీ సాగనంపేవాడు.

నాకే విసుగు కలిగింది. అందుకే పెళ్లే చేసుకోనని చెప్పానాపైన. మామయ్య మనస్సులో ఎంతగా దీవించాడో నన్ను! నీరజకా పెళ్లి లేదు. నాకూ ఆ యోగం లేకుండా చేశాడా మహానుభావుడు! ఉన్న ఆస్తి అంతా తన కొడుకులకే రాక పోతుందా అని ఆయన ఆశ. అందుకే కొన్నిసార్లు అందమైన వలలు పన్ని వుంచేవాడు నా చుట్టూరా.

వాళ్ల పెద్ద అబ్బాయి పెళ్లి ఖర్చు అంతా నేనే భరించాలట. 'ఎంతో లేదురా! వో అయిదువేలే!' అన్నాడు. నాకు నవ్వు వచ్చింది. అసహ్యతా కలిగింది. ఇవ్వనన డానికి వీల్లేదు 'ఏం చేస్తావోయ్! హరీ! ఎవరు తింటారీ సంపదనంతా! నువ్వో భీష్ముడివి. నీరజ! పాపం! ఏ సుఖానికి నోచుకోలేదయ్యో! ఆ! ఏదో! ఈ మామయ్యను కాస్త నో కంట కనిపెడుతూ వుండు—' అనేవాడు. ఇవ్వక తప్పేదిగాదు.

శారద నాకు దూరపుబంధువు. మనసు నిండుగా అనురాగ మధువు నింపుకున్న కళామయి. మెడిసిన్ నాతోపాటే చదివింది. నా హృదయాన సందడి చెలరేగిందా అనురాగమయి రాకతో.

నీరజ సంగతి విన్నది. మనసు విప్పి చెప్పానంతా. వెన్నెల పండించు ఈ హరి జీవితంలో— అని కోరాను. నవ్వులు నిండించు నా ప్రియుకున— అని అర్థించాను.

పువ్వులా నవ్వింది. మందారాలు విరిశాయి నా మనసున. ఆశలన్నీ కలబోసుకుని అందాలు చిందే మందారాన్ని మలచుకున్నాను. మధురోహల పల్లకిలో, షహనాయి పాటల్లో తేలిపోయాను.

(ఇంకా వుంది)



# లవ్‌లెటర్

బొమ్మలకథ సీరియల్

13

ఎస్.బి.శంకర్ కుమార్

ఈ సన్నాసి ఎంతకీ తిరిగి రాడేం?




ఏరా! ఆ సీక్రెట్ మెసేజ్ అర్థం చెప్పిందా నీ సుజాత!

ఆ! చెప్పింది! ముందు రూము? నడు!




ఆయన సుజాత నాన్న అయుంటాడు! ఆయన ముందు ఆ ఉత్తరం తనే రాశానని చెప్పడానికి సుజాత సిగ్గుపడుతుంది!

పోనీ ఇంకోసారి ట్రై చెయ్

ఇంకోసారి లేదు గింకోసారి లేదు! ఏదీ! ఆ కవరూ ఉత్తరం ఇలా పట్రా!

ఏం! చింపేస్తావ?




నిజంగానే రాంబాబు చెప్పినట్టు కవరు లోపలివేపున ఏవో అక్షరాలు కనబడ్డాయి! ఆశ్చర్యంతో సాంబాబు ఆ కవర్ని జాగ్రత్తగా చింపి చదవడం ప్రారంభించాడు!

*?*?*!*

ప్రియమయిన శ్రీవారికి,
ఆశ్చర్యంగా వుందికదూ! నేను
మిమ్మల్ని కాస్సేపు ఏడిపించాలనే
ఇలా రాశాను! ఇంతకీ మీరు
ఇక్కడికి ఎప్పుడొస్తున్నట్టు? ఈసారి
మీ మిత్రుడు రాంబాబును కూడా
మీ వెంట మా వూరికి తీసుకురండి!
ఇంతే సంగతులు! ఇట్లు
మీ శ్రీమతి
సుమతి



# పేరులో ఏమున్నది

నడిమింటి లలిత



మిత్రులు వెళ్ళిపోతున్న దారిని దీ..లుగా చూస్తూ నిల్చుండిపోయాడు విశ్వేశ్వర్, పార్కులో ఒక చెట్టుదగ్గర. మైకులోంచి వినిపిస్తున్న రేడియో రణగొణ ధ్వనిగాని, చుట్టూ కాకిగోల చేస్తున్న పిల్లల్నిగాని లక్ష్యపెట్టకుండా ఎక్కడో శూన్యంలో చూపు నిలిపి, ఇంకెక్కడికో దూరతీరాలకు మనసును పంపించాడు దుఃఖాన్ని నింపుకు రమ్మనిచెప్పి. తనెదురుగానే హీరోయిన్నెత్తుకుపోతున్న విలన్ని చూస్తూ కూడ, రెండు తన్నే ధైర్యంలేక బిక్కచచ్చిపోయి నిల్చున్న హీరోలా వుందాతని భంగిమ. (దమ్ములేనివాడు హీరో ఎలాగయ్యాడూ? అనడక్కండి మరి. 'నాయకుడు ధీరోదాత్తుడు ధీర లలితుడు' అయివుండాలనే రూల్సు ప్రాచీన నాయకుడివి. 'ఆధునిక నాయక లక్షణాల్లో చేతకానితనం, చేవలేని తనం కూడ ఓ ఆకర్షణే' అని ఇంతకుముందే ఎందరో మహానుభావులు తమ తమ రచనలద్వారా నిరూపించారు.) విశ్వేశ్వరం మామూలుగానే వున్నట్లైతే వాతావరణం అలా వుండమన్నా వుండదసలు. ఆ రేడియో సంగీతానికి లయ బద్ధంగా విజిల్సు వేసుకుంటూ ఆనందిస్తాడు తనలో తను. ఇన్ని బఠాణీలో, ఇంత వేరుశెనగ పప్పో కొని తెచ్చుకొని తింటూ, తనని చూసి నవ్విన ప్రతీ చిన్నపిల్లాడి నోట్లోకీ గురిచూసి విసిరి మురిసిపోతూ వాళ్ళతో సరిగ్గా ఆడుతాడు, అరుస్తాడు. నార్మల్‌గా విశ్వేశ్వరం ముఖం యొక్క పవరు సిక్స్టీ వోల్ట్సని చెప్తే... ప్రస్తుతం జీరో వోల్ట్సని చెప్పడానికూడ కొంచెం ఆలోచించాలి. ఆ పార్కులో అక్కడా అక్కడా పెట్టిన బొమ్మల్లో తనూ ఒక బొమ్మే అనుకొని నిల్చుండిపోయిన విశ్వేశ్వరం 'ఖయ్యి!' మన్న ముక్త కంఠధ్వనికి గూబ పగిలినంత పనై, త్రుళ్ళిపడి, తన చేతులు పట్టుకు వ్రేలాడుతూన్న గుంట లిద్దరికీ చెరో రెండు జెల్లలూ కొట్టాడు, దోసెడు నూనింకి పోయేలా. సెనక్కాయలకి బదులు జెల్లకాయల రుచి తెలిసేసరికి హడలిపోయి దూరంగా పోయారు పిల్లలు. బలవంతంగా వర్తమానంలో పడ్డ విశ్వేశ్వరం గట్టిగా 'హుం' అని నిట్టూర్చి, అంతవరకు గుండెల్లో స్టాక్ చేసిన గాలిని బయటికి తోలేసి, వుస్సూరుమని ఆ క్రిందనే రుమాలు వేసుకోవాలన్న ఇంగితంకూడ లేకుండా చతికిల బడ్డాడు. ఇంతవరకు నిట్టూర్చడం అంటే ఏమిటో, ఎలాగో అర్థంకాని మానవుడతడు, అని అంటే అబద్ధం కాదు. నిజమే. నిట్టూర్చవలసిన అవసరం వచ్చే దౌర్భాగ్యుడేం కాదు విశ్వేశ్వరం. హాయిగా కడు

పులో చల్ల కదలనివ్వకుండా నెల తిరిగే సరికిన్ని రాళ్ళు దోసిట్లో పోసే లెక్చరరుద్యోగం చేసుకుంటున్నాడాయె. మోహమాటాలకి పోయి ట్యూషన్లు లాంటి లొసుగులేమీ వుంచుకోలేనాయె వీధిజీవితం ఇది. పోనీ ఇంటిపోరా? ఇంతిపోరా ?... ఛ...ఛ...అదికూడ ఏం లేదు. ఎప్పుడు చూసినా వెల్లవేసిన గోడలో తెల్లగా నవ్వే చిన్నిబొమ్మరిల్లు లాంటి ఇల్లు తనిది. ఆ ఇంటి గుమ్మంలో ఇలా కాలు పెట్టే సరికల్లా కలకల నవ్వుతూ, గలగల నడుస్తూ ఎదురొచ్చే చలాకి చిన్నది విశ్వేశ్వరుని సతీమణి. అందునా మామూలు ఆడపిల్లా?...సన్నగా సళాకులా సన్నజాజిపువ్వులా, తొగడదారంలా,...ఇంకా ఆయా జనరేషన్ కర్థం అయేలా చెప్పాలంటే 'ది యంగ్ హిందీ హీరోయిన్'లా స్మార్ట్‌గా వుండే ఛార్మింగ్ లేడీ, సదరు విశ్వేశ్వరుని భార్య ప్రేమలీల. కావాలంటే ...ఇంకా చెప్పాలంటే మరో రెండు అడిషనల్ క్వాలిఫికేషన్లూ వున్నాయి ప్రేమలీల రేడియో ఆర్టిస్టు. అడపా దడపా లలితసంగీతమూ, ఈ మాసపు పాటా పాడుతూంటుంది. కాని వర్తమానంలో ఆమె కేవలం రేడియో ఆర్టిస్టు మాత్రమే కాదు, చిన్న సైజు రచయిత్రి కూడ. అప్పుడూ అప్పుడూ పొట్టి పొట్టి కథలూ, చిట్టి చిట్టి వ్యాసాలూ గిలుకుతూంటుంది. పోనీ...తనకున్న ఇన్ని క్వాలిఫికేషన్లు చూసుకొని ఆ భామాలలామ భర్త నేమన్నా నిర్లక్ష్యం చేస్తోందా?... తప్పండీ!...అన్నవాళ్ళ కళ్ళు పోతాయ్. ఎప్పుడో ఏకాంతంలో ఏదో సరదాగా 'నాథా! నా పాదసేవ... లేనే నీ జన్మ మేలా...' అని పాడినా, అంత చిన్న విషయాన్ని స్పోర్టివ్‌గా తీసుకోలేని, అంత మాత్రం సెన్సాఫ్ హ్యూమర్‌లేని జడుడేం కాదు విశ్వేశ్వరుడు. పైగా 'నీ చరణ కమలాల నీడయే చాలు, ఎందుకే వో దేవి నందనవనాలూ?...'అని గొంతు కలిపే సరసుడు కూడ. ఇంక పతిదేవుడి కాస్త తల్నొప్పొచ్చినట్టుగా అనుమానం తగిలేతే చాలు ...అమృతాంజనం మర్దనం చేసేస్తూ, జాలి చూపులు చూస్తూ దిగాలుగా కూర్చుండిపోయే బేల ఈ ప్రేమ లీల. అయిన కీ... విశ్వేశ్వరుడెందుకు విశ్వసింపవలసి వచ్చె? ప్లీజ్ రీడ్ ది ఫాలోయింగ్ లైన్స్. అరుదైన ఈ విశ్వేశ్వరుని నిట్టూర్పుకి కొంచెం కారణం ఇంతకు మునుపు వెళ్ళిన మిత్రబృందం అని చెప్పొచ్చు. అంటే వాళ్ళేమన్నా అక్కణ్ణే తిట్టేరా తిమ్మేరా?...అబ్బబ్బే అదేం కాదు. వాళ్ళలో నాళ్ళు కొన్ని ప్రశ్నలేసుకున్నారంతే. పోతే...వాటి జవాబులు విశ్వేశ్వరం దగ్గర టిక్కడిపోయాయి. అక్కడే వొచ్చింది చిక్కు 'రచయిత్రికి, లేక గాయనికి, లేక తదితర ప్రత్యేక స్త్రీకి, భర్తవలన ఒనగూడు అదనపు ప్రయోజనము లేమి?' ఇది సహోద్యోగి భాస్కరరావు ప్రశ్న. 1. 'రచయిత్రి అయినచో, కథావస్తువులకు తడుముకో నవసరములేదు. భర్త తిట్టుకో నవల, మెచ్చుకో కథ వ్రాయవచ్చును. 2 సంకుచితముగనున్న తన పేరునకు భర్త పేరును చేర్చి విస్తృతము గావించుకొనవచ్చును...'

'షటప్' రెండో మిత్రుని మాటలను తన గర్జనతో నిలిపేసి మరో ప్రశ్న బనాయించాడు ఉద్దండ పిండం రామకృష్ణ. 'సాధారణ స్త్రీ భర్తకు, అసాధారణ (అనగా టాలెంటెడ్) స్త్రీ భర్తకు గల భేదము లేమి?' '(ఇక్కడ స్త్రీ భర్త అనగా స్త్రీ యొక్క భర్త అని గ్రహించండి విమర్శక సింహాలూ! స్త్రీ భర్తలూ, పురుష భర్తలూ అని రెండు విధాలా? అంటూ ఆగ్రహించకండి నా పైన.) గొంతు సవరించుకున్నాడు మోహన్.

'సాధారణ స్త్రీ భర్త తన భార్య వంటకములను, ఇంటి సర్దుబాటును, దిద్దుబాటును మాత్రమే విమర్శించుటకు (అనగా కేవలము తిట్టుటకు) వీలగును, కాని అసాధారణ స్త్రీ భర్త అదనముగా ఆమెలోని 'కళ'ను కూడ తిట్టుటకు వీలున్నది. సాధారణ స్త్రీ భర్తనుండి సంసారపక్షమైన సంభాషణమునే ఆశించునుగాని, అసాధారణ స్త్రీ ముఖ్యముగా రచయిత్రి, భర్త నుండి వుద్యోగపరమైన సంభాషణలు సాగించుట కొక విధంగా కుతూహల పడుచుండును. అందులకు కారణం కేవలం తన రచనలలో ఆ వాతావరణము చిత్రించుటకే. (ఉదాహరణకు......రచయిత్రి భర్త ప్లీడరనుకోండి, అనుకుందాం...దానికేం?...... ఇంక ఆమె రచనల్లో తరుచు కోర్టు సీన్సు, పాయింట్సు లోపించిన పిడివాదనలు కోకొల్లలుగా వుంటాయి) తరువాత ... సాధారణ స్త్రీ భర్త తన భార్యలోని తెలివిలేమిని యథేచ్ఛగా యెత్తి చూపించగలడు. అసాధారణ స్త్రీ భర్తకా స్వేచ్ఛ లోపించి యుండును. అతి ముఖ్యమైన విషయ మేమనగా...సాధారణ స్త్రీ భర్త యొక్క పేరు కేవలము వారి బంధువర్గమునకు మాత్రమే విదితము. అసాధారణ స్త్రీ భర్త పేరట్లుగాక (లొట్టెలై) యావదాంధ్ర పత్రికా పాఠకులకు సువిదితము.' అక్కడితో అలిసిపోయి, ఆగిపోయాడు మోహన్. అంతవరకు నోరు తెరచి బెట్టుకొని వింటూన్న విశ్వేశ్వరం తక్కున నోరు మూసేసుకుని, సైమల్టేనియస్‌గా తల వంచుకున్నాడు. 'గుడ్ బోయ్. మంచి పాయింట్లే చెప్పావ్' అంటూ అభినందించాడు రామకృష్ణ.

'చిన్న...బుల్లి డౌటు మాస్టారూ?' అంటూ కీచుమన్నాడు వెంకటేశ్వర్లు. 'నాకు తెల్సోయ్ నీ డౌటూ... రచయిత్రి భర్త పేరెలా నలుగురికీ తెలుస్తుందనా? వెర్రి శిశువా!... కళ్ళెదుట సజీవ నిదర్శనం చూస్తూ కూడా నీకీ అనుమానమెందుకొచ్చింది? ప్రేమలీలా విశ్వేశ్వర్' వో రచయిత్రి...'. 'అర్థమైపోయింది గురూగారూ!' అంటూ మధ్యలోనే ఆపేసి చెంపలు వాయించుకుంటూన్న వెంకటేశ్వర్లు వైపు యోగిలా చూశాడు భోగియైన రామకృష్ణ. ఆ తర్వాత నలుగురూ కంగ్రాట్యులేషన్స్ పేరిట విశ్వేశ్వరం చెయ్యి నలిపేవరకు కుదిపి ఎవరి దార్న వారు పోయారు. అయితే ఇంత చిన్న విషయానికే అంత పెద్ద నిట్టూర్పు వదలాలా? అంటే అక్కర్లేక పోవచ్చు. ఇంతకు పూర్వమే ఈ పేరు తాలూకా స్పర్థ విశ్వేశ్వరుడిలో రేగి వుండవచ్చు. వచ్చేమిటి?...వచ్చింది నిశ్చయంగా. పెళ్ళయిన కొత్తల్లో వొసారి రేడియో అనౌన్సరు 'లలిత సంగీతం...గాయని...శ్రీమతి ప్రేమలీలా విశ్వేశ్వర్' అని ఆ క్రొత్త పేరుకి ప్రారంభోత్సవం చేసినప్పుడు, అది వింటూ వుబ్బిపోయాడు విశ్వేశ్వర్. తన ప్రియసతి పేరెంత రమ్యంగావుంది! అని మురిసిపోయాడు. ఆ తర్వాత ఏదో

# పేరులో నేమున్నది

పత్రికలో అంత పొడుగు పేరుతో పడిన ఆ పొట్టి కథను చూచి చిరుగా నవ్వుకున్నాడు పెద్దమనిషిలా. కాని తరుచు, ఇంచుమించు ప్రతీ పత్రికలోనూ ఆపేరు కన్పిస్తూ, విన్పిస్తూండటంతో అతని హృదయం చిర్రుబుర్రు మనడం మొదలు పెట్టింది. విలోమానుపాతంలా భార్య పేరుకు ప్రాముఖ్యత హెచ్చుతున్న కొద్దీ భర్త పేరు ప్రాముఖ్యత తగ్గుతూన్నట్టుందేమో!' అని అనుమానిస్తూన్న ఆత్మని ఠంగునమొట్టింది హృదయం.'అనుమానం ఏమిటి ? మొద్దు పెద్దమ్మా ! అది కటికనిజం అయిపోతేనూ' అంటూ. తదాదిగా విశ్వేశ్వరుడి హృదయం వీరభద్రావతారం దాల్చింది. ఇవాళ మిత్రులు ధూపం వెయ్యడంతో అది కాస్తా వీరాంగం వెయ్యసాగింది. చీకటిలో చిక్కబడి పోయినా, వీధిదీపాల్లంత స్పష్టంగా వెలుగుతున్నా, వీడింకా ఇవాళ కదల్డేం ? అని కళ్లు చికిలించుకొని చూస్తూన్న చుక్కల్ని మరి చూడలేక, మెడ నెప్పెట్టి, లేచి, తప్పనిసరిగా గృహోన్ముఖుడయ్యాడు విశ్వేశ్వరం.

'అదేవిటండీ ? ఇవ్వాడా వండం ఎందుకు తాగారూ?' లుంగీ అందిస్తూ ఆశ్చర్యంగా అడిగింది ప్రేమలీల. "ఆవందం తాగడ మేమిటి?' అంటూ పరధ్యానంగా ప్రశ్నించాడు పతి దేవుడు. "మరామఖం ఎందుకలా వుంది?' నిలదీసింది భార్యా మణి. తేరుకున్నాడు విశ్వేశ్వర్. "విట్టనవ్వొచ్చేదేగనీ, ఆ నవ్వే వోపిక నాకిప్పుడు లేదోయ్.' అంటూ కుర్చీలో చేరబడ్డాడు. పాపం.? ఈపేరు తెచ్చిన పేటాపన ఇంతా అంతా కాదు తన ప్రాణానికి. ఇంతకుముందో సారి మృదువుగా కదిపి చూశాడీ విషయాన్ని, "హాయిగా. సింపుల్‌గా నీపేరే వుంచుకోక చివర నన్నూ కలిపావెందుకూ?' అంటూ. తియ్యగా నవ్వేసింది ప్రేమలీల. 'బ్రతుకులోనే యిద్దరం భాగస్వాముల మయాం. ఇంక యీ చిన్నచిన్న విషయాల్లో భాగస్వామ్యం. వుంటే ఏం? అయినా పేర్లో ఏవుంది పోనిద్దురూ !' అంటూ గాలికి వదిలేసింది ఆ సమస్యని. విశ్వేశ్వరుడు లైక్‌చేసే కోణంలోకి కళ్లు తింపి. 'నేనూ అదే అంటున్నా. పేర్లో ఏముంది? అందుకే నాపేరు చేర్చొద్దు.' అన్నాడు కొద్దిగా 'వీక్' అయిన విశ్వేశ్వరం, మృదువుగా ఆమె ముంగురుల్ని సర్దుతూ. 'హబ్బా ! నాకీపేరే బాగుంది.' అంటూ గునుస్తూ, అతని మెడకీ, భుజానికీ మధ్యవున్న కొద్ది జాగాలో ముఖాన్నిరికించుకుంది ప్రేమలీల. నిస్సహాయంగా పళ్లు కరచుకొని, రెండు నిమిషాలు వూపిరినిలిపి, ఆతర్వాత తాపీగా ఒదిలాడు. (అంతేగానీ 'హుఁమ్మని నిట్టూర్చలేదు.) ఆదారి, లాభంలేదని అప్పుడే తేలిపోయింది. గతమంతా కళ్ల ముందు తిప్పుకుంటూ, భోజనం కానిచ్చి శయనించిన విశ్వేశ్వర్, చిటమట లాడుతూన్న మనస్సుని సమాధాన పరిచే ధోరణిలో చెయిజాపి రేడియో ఆన్ చేసాడు. వెనువెంటనే అతనిలోని వీరభద్రుడు 'హాఁ' మని లేచాడు ఆవేశంతో వూగిపోతూ. కారణం...ఆ మాస (సిక)పు పాట పాడిన గాయనిపేరు విన్పించడమే. టపీమని రేడియో పీకనొక్కి అదేవూపున 'లీలా !' అంటూ గావుకేక పెట్టాడు. పెరట్లో కంచాలు తొలుస్తూన్న ప్రేమలీల, యిరుగు పొరుగు కొంపల్లో దేనికి నిప్పంటుకుందో అర్థంకాక, పరుగు పరుగున వచ్చేసి 'హేవిటి?' అంది వగర్చుతూ. 'ఇదిగో ! ఆఖరుసారిగా అడుగుతున్నాను. నీపేరు చివర నాపేరు తీస్తావా తియ్యవా ?' ఖంగుమంది విశ్వేశ్వరుడి కంఠం. ఆ దాటుగా మీదపడిన చైనా దుండగుల్ని చూచి దిక్కు చచ్చిపోయిన ఇండియూలా వెర్రి చూపులు చూసిన ప్రేమలీల ఆ మరుక్షణంలోనే భారత వీరయోధుడిలా తేరుకొని, హేలగా వో నవ్వునవ్వి, 'ఇంతేనా? ఇంకేమిటో అనుకొని చేతిలోపనలా ఒదిలేసొచ్చాను. వంటిల్లు సర్దేసొస్తానాగండి. తీరిగ్గా కూర్చుని రాత్రంతా కాట్లాడుకుందాం.' అంటూ సుతారంగా వెనుదిరిగింది.

'వీల్లేదు. ఇదిప్పుడే ఫైసలైపోవాలి కావాలంటే తగువైపోయాక తీరిగ్గా తెల్లవారు జామున సర్దుకో నీవంటిల్లు.' అంటూ హుంకరించాడు.

బాగుందండి సొద. ఇంతవరకూ ఇలా రాసుకుని, ఇకముందు మళ్లీ మీపేరు చెరిపేసి రాసుకుంటే నలుగురూ నవ్వరూ? అయినా వుండీ వుండి మీ కేమొస్తుందబ్బా ! ఇలా రెచ్చిపోతూంటారు.' అంటూ విసుగులో అందం ప్రదర్శిస్తూ ముక్కు విరిచింది, కళ్లు చికిలించింది, పెదాల్తో నవ్వబోయి ఆగిపోయింది 'రోగం' అన్న మగసింహం గర్జింపు వింటూ. 'పున్నమికీ, అమావాస్యకీ రెచ్చిపోవడానికి నే నేమీ పిచ్చివెధవని కాను. తెలుసా ? నాకున్న పేరేదో నాకుంది. ఆ వున్నపేరు నాకు చాలు. అదనంగా నువ్వు నా పరువు పెంచొద్దు. వింటున్నావా ? నీ పేరేదో నువ్వు నిలబెట్టుకో. అంతే తప్ప నాకోసం కష్టపడక్కర్లేదు. ఇలాటి తోకపీకుడు వ్యవహారాల్నాకు నచ్చవు. అర్థమైందా ? ... ఇటుపై నింక నీ కథలూ, గిథలూ ... అన్నీ నీ పేరుతోనే పంపించుకో. చివర నాపేరు తగిల్చావా... నీ కథలు పోస్టుబాక్సులో పడేబదులు వీధి కాలవల్లో విహరిస్తాయి: గుర్తుంచుకో' అంటూ కథాకళి ప్రదర్శించాడు. 'అర్థరాత్రకమ్మ శివాలిపి బాగుంది లెండి. పడుకోండి.' అంటూ నిర్లక్ష్యంగా మరోసారి అవతలికి నడవబోయింది ప్రేమలీల. జబ్బవూడొచ్చేలా పట్టుకు లాగాడు విశ్వేశ్వరం. అదాటుగావచ్చి మంచం మీద పడింది అలాంగి. ఆ అపసవ్యపు పడటంలో మంచంకోడు, పక్కలో కఠినంగా ఒత్తుకుంది. ఆడప్రాణం కళ్ల నీళ్ల పర్యంతమైంది. పర్యవసానం?... ఆమెలో స్త్రీ సహజమైన మొండితనం ఉవ్వెత్తున లేచింది. 'నే మార్చుకోను. ఏం? నేనేం నీతిమాలిన పనిచేశానూ ? నా భర్తపేరే రాసుకున్నాను గానీ, ఇంకెవడో తలమాసిన వాడి పేరు రాసుకోలేదుగా.' అంది సర్చుక్కూర్చుని గట్టిగా. తాతలకి వినికిడప్పేలా, నమ్మకంగా చెంపమీద పెద్ద ఖర్చు కిచ్చేశాడు విశ్వేశ్వరుడు. ఒకే ఒక్క క్షణంలో ప్రేమలీల ముఖంతో పాటు చెవులు, మెడకూడ ఎర్రగా అయిపోయాయి. రెండు కళ్లూ నాలుగువైపుల్నించీ జలపడ్డ ఒకటోరకమైన బావుల్లా అయిపోయి, ఆ నీరు పూరి పూరి, గట్టు దాటి, మైదానాల్లాంటి చెంపలమీద

C I B A Cosmetics






# మీ కోసమే కావలసినన్ని తీరుల్లో టూత్‌బ్రష్‌లు కేవలం మీ కోసం

మీ పళ్ళకోసం...
మీ ఇగుళ్ళకోసం...
మీక్కావలసిన తీరుల్లో...
మీ వయసుకు జోడుగా...

ఒక్క బినాకా లోనే—
తీరుతీరులుగా,
వయసుకు జోడుగా









బినాకా టూత్‌బ్రష్ కొసలు గుండ్రంగా వుంటాయి—ఇగుళ్ళను ఏమాత్రం గాయపరచవు



## టూత్‌బ్రష్ బినాకా గనక అయితే అదే మీకెంతో మంచిది

Binaca®

స్వేచ్ఛగా ప్రవహించింది. సరిగ్గా అదే క్షణంలో విశ్వేశ్వరుని ఆత్మ, హృదయమనే ఒక గటి కిక్కుతో బార్డర్ అవతల పడేసింది. వీరభద్రుడు స్పృహ తప్పిపోయాడు. ఫలితంగా అంతవరకు బాయిలింగ్ పాయింట్ దగ్గరున్న విశ్వేశ్వరుడి రక్తం తుస్సుమని మెల్టింగ్ పాయింటుకి దిగజారిపోయింది. విశ్వేశ్వరుని చేతులు రెండూ ముందుకొచ్చి ప్రేమలీలను గుండెలకి దగ్గరగా జరిపాయి. 'వెధవ పనే చేశానోయ్ ప్రేమా! నిన్ను కొట్టాలన్నది నా వుద్దేశమే కాదసలు. పోనీ నన్ను కొట్టేయ్. చెల్లుకి చెల్లు.' అంటూ బుద్ధిగా చెంపందించాడు, పశ్చాత్తాపం అంతా ముఖంమీద పులుముకొని. 'ఛీఛీ! ఒదలండి నన్ను.' అంటూ గింజుకుంది దెబ్బతిన్న స్త్రీలలామ. 'నా మాటలు పూర్తిగా విను మరి. ఇప్పుడు నే చేసిన పని సాధారంగ తీసుకొని నన్నో దుర్మార్గపు మొగుడిగా చిత్రిస్తూ ఓ కథ...పోనీ ఓ నవల రాసెయ్. కానీ...నీ పేరు చివర నా పేరు తగిలించొద్దు. ఎందుకో అలా చేస్తే నా కిష్టం వుండడంలేదు. ఈ చిన్న విషయంకోసం నువ్వు హింస పడొద్దు. నన్ను పెట్టొద్దు ఏం?' అన్నాడు ముద్దొయింపుగా. అంటూ పది [illegible]డు. 'ఛీ! సిగ్గులేని మనుష్యులు.'

# పేరులో నేమున్నది

అంటూ రివ్వున లేచి వెళ్ళబోయి 'పుట్టి బుద్ధెరిగాక మా అమ్మే నన్నెప్పుడూ కొట్లేదు. ఈనాటికి మీ చేత...' అంటూ తర్వాతి మాటలు వెక్కిళ్ళా పేస్తూంటే తలుపట్టుకొని బావురుమనబోయి, అంతరంగంలోని రచయిత్రి హుంకరించడంతో వంటింట్లో కూర్చొని కరువుతీరా, రాగయుక్తంగా ఏడ్చింది గాయని ప్రేమలీల. చేసిన పనికి సిన్సియర్‌గా బాధ పడ్డాడు విశ్వేశ్వరం ఆ రాత్రంతా.

ఆ తర్వాత ఓ వారం పదిరోజులు ఇంట్లో కోల్డ్‌వార్ నిర్విరామంగా సాగింది. భార్యాభర్త లిద్దరికీ మాటల్లేవు. చూపు లసలే లేవు. పాత తారలు రేట్లు పెంచి బిర్ర బిగిసిపోతే, ఆ అవకాశాలు వాడుకునే నూతన తారల్లా, ఆ నీరవ నిశ్శబ్ద వాతావరణంలో వంటింటిపాత్రల 'పాత్ర'కి ప్రాముఖ్యత హెచ్చింది. వంకపోయిందన డానికి సూచనగా గిన్నెమీద 'ఖణేల్' మని నర్తించే గరిటె, పెనువగానే టేబిల్ మీద 'దభేల్' మని కూలబడే కాఫీగ్లాసూ హీరోయిన్లనుకుంటే...కాలేజీకి వెళ్లే వేళప్పుడు 'టక్...టకా టక్' మనే బూట్లూ ఇంటికొచ్చేసరికి 'ధన్ ధన్' మని డైలాగు లప్పగించే పుస్తకాలూ హీరోల లిస్టులో వేసుకోవచ్చు. ఈ లోపులో ప్రేమలీల తర

ఆరోప్రాణం స్నేహితురాలికి లిఖితరూపం పరిస్థితుల్ని చూపించింది. ఓసాయంత్రం దానికి వచ్చిన జవాబు చదువుకుంటూనే 'కిసుక్కు' మని నవ్వేసుకొని, అది (ఆ ఉత్తరం) పతిదేవుడి కంటబడేలా నిర్లక్ష్యంగా టేబిల్ మీద విప్పి పడేసింది. బూట్లు టక టక లాడించుకుంటూ వచ్చిన విశ్వేశ్వరాన్ని చూస్తూనే వంటింట్లోకి దూరింది. రివాజుగా పుస్తకాలు గిరాటేయబోయిన విశ్వేశ్వరం టేబిల్ మీద వుత్తరాన్ని పురుగును తీసినంత సొంపుగా మునివేళ్లతో తీశాడు. 'చదవనా ఒద్దా?' అని సందేహిస్తూన్న మనసుని 'ఎన్నడూలేని అరమరికలీనాడెలా వస్తున్నాయి. చాల్లే' అని మందలించింది ఆత్మ. నిస్సంకోచంగా విప్పి, నిర్భయంగా చదివేశాడు విశ్వేశ్వరం. ఆనాడు విశ్వేశ్వరం చదివిన ఆ వుత్తరం ఏనాటికైనా సరే...అసాధారణ స్త్రీలోకం (అనగా ఏవిటో ముందే చెప్పాగా) లైన్‌బై లైన్ కంఠస్థం చేసుకోవాల్సిన వుత్తరం. ప్రతి కున్నంతకాలం రోజూ నిశ్చల మనస్సుతో పారాయణ చెయ్యదగిన వుత్తరం. సరే బాగానే వుంది. బట్ వాటార్ద కంటెంట్స్ ఇన్ దట్ నోబుల్ లెటర్? ఇదిగో మహాశయా! అక్షరాలా మీ ముందే పరిచేస్తున్నాను. చిత్తగించండి. 'మై డియర్ అండ్ నియర్ ప్రేమా! నీ 'వుత్త'రం పూర్తిగా చదవగలిగాను. విషయాలు నిరుచగ్గా చొప్పగిడ్డిలా వున్నాయి లెమ్మా!! 'పేరు తెచ్చిన ప్రళయం' అనే పేరుగల ఒకా (మీ) సినిమాలో హీరోకి పోర్షను రాదు; యాక్షను లేదు. అటువంటి సందర్భాల్లో హీరో ఎప్పుడూ కూడ ఒకే ఒక్క చెంప పెట్టుతో ఆగిపోకూడదు. రెండు గుద్దులూ, మరో రెండు తాపులూ వుండాలి. బ్రూట్, ఇడియట్, రోగ్...లాంటి తిట్లు వాడాలి. తిట్లూ, దెబ్బ ఆల్టర్నేట్‌గా వాడాలి. అదీ సరైన పద్ధతి. పోన్లే ... అదలా ఒదిలెయ్. ఎందుకంటె హీరోయిన్తో పోల్చి చూస్తే హీరో వెయ్యి రెట్లు మెరుగు. మొదట్నించి కొసవరకు హీరోయినుకప్పి తప్పుడు డైలాగులే. అలాంటి సీన్స్‌లో హీరోయినెప్పుడూ కూడ 'ఛీఛీఛీ!' అని కుక్కలు మీద పడ్డాన్నట్టు యుంజా [illegible]ం చుకో కూడదు. సంతుగా, చిన్న నవ్వు



నవ్వాలంతే. ఇక్కడ డైలాగ్స్ కన్నా పేషి యక్స్‌ప్రెషన్సెక్కువగా కన్పించాలి. 'వాక్యాన్ని పదాల కర్థాలు తెలీవు. కొంచెం చెబ్దురూ! పేరు మార్చడి కేం పోయింది అలాగే చేద్దాం' అంటూ ముద్దు లొలికించి, 'సీతాపతి, శ్రీనాధుడు, గిరిజారమణుడు, రుక్మిణీ వల్లభుడు...' ఇలాటి పదాల కర్థమేమిటండీ?' అనడగాలి ఎంతో అమాయకంగా. హీరో చెప్తాడు కోపంగానో, శాంతంగానో. అప్పుడు మళ్ళీ 'మరీ...మరీ...సీత 'యొక్క' భర్త శ్రీదేవి 'యొక్క' పతి...ఇలా అర్థాలు చెప్పేటప్పుడూ... 'ఆ భర్తలకి ఒరిజినాలిటీ ఏదండీ?' అనడగాలి ఇంకా ముగ్ధత్వం నింపుకొని కళ్ళు విశాలం చేసుకుంటూ. 'పురాణాల్లోని అంతటి టాప్ మోస్ట్ హీరోలకే లేని ఒరిజినాలిటీ నీకేముందోయ్?' అన్నట్టు రెప్ప టప టప లాడించాలి. ఆ సీతకన్నా, శ్రీదేవికన్నా, గిరిజకన్నా వెయ్యారు రెట్లు నయం మేం. మిమ్మల్ని పూర్తిగా వెనక్కి తొయ్యకుండా మా ప్రక్కనే నిల్చోబెట్టుకుంటున్నాం. గుర్తించారా? మా విశాల హృదయం?' అన్నట్టుగా అలతి నవ్వు నవ్వాలి. బస్. అయ్యగారి ఆట కట్టయిపోతుంది (అది రూలు) హీరోయిన్ తన పాత్ర నర్థం చేసుకు నటిస్తే ఇది క్లాస్ పిక్చరే అయివుండును ...గనీ...నా విమర్శ పంపాను. తర్వాత నీ యిష్టం మరి... నీ స్నేహితురాలు.'

చదివి యథాస్థానంలో గప్ చిప్‌గా ఆ వుత్తరాన్ని పడేసిన విశ్వేశ్వర్, పేరు గొడవ అక్కడితో వదిలేసి, ఆ రాత్రి భోజనాల దగ్గర రెండో కంచం అవతలికి కెడ్సేసి, తను ఉంటున్న అస్సంలోనే భార్యామణికి షేరిచ్చి, సంధి పత్రం మీద సంతకంచేసి తన కథ సుఖాంతం చేసుకున్నాడూ...అని నేనిలా ఇంత క్లియర్ కట్‌గా రాసేస్తున్నాను గనక మీకు తెలిసిపోతుంది. కానీ... 'ఆ వుత్తరాన్ని నూటొక్కసారి ముద్దు పెట్టుకొని, మొట్ట మొదట విశ్వేశ్వరం తనకి కొన్న సిల్కు చీర మడతల్లో దాన్ని భద్రంగా దాచుకుంది 'ప్రేమలీల' అని నేను చెప్పడం లేదు కదా! మరి మీకెలా తెలుస్తుంది పాపం!? ●

# ఒక వారం విపరీతం — ఫాలాక్షుడు

## ప్రిన్సిపాల్ పై దౌర్జన్యం

బెంగుళూరులో 22 ఏళ్ళ దయాళ్ కుమార్ లాకాస్ అనే వ్యక్తి ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాలు మునిగవియప్ప వద్దకు వెళ్ళి తనకు డిగ్రీ తరగతిలో సీటు కావాలని అడిగాడట. సీట్లన్నీ భర్తీ అవడం వల్ల ప్రిన్సిపాల్ అదే విషయం అతనికి చెప్పి, మరో కాలేజీలో ప్రయత్నించుకోమని చెప్పారట. ఆమాట కా విద్యార్థికి కోపం వచ్చి "బయటకు రా, నీ సంగతిని చూసుకుంటా" నని భయపెట్టి వెళ్ళిపోయాడట. ఇలాటి బెదిరింపులు మామూలేనన్న వుద్దేశ్యంలో వున్న మునిగవియప్ప 15 వ తేదీ వుదయం యథాప్రకారం కాలేజికి వచ్చి, తన కారు గరాజ్ లో పెట్టి రూముకు వెళుతుండగా అక్కడే మాటువేసి, తప్పాడుతున్న లాకాస్ కాగితంలో చుట్టి తెచ్చుకున్న ఇనుప దూలం ముక్కతో



ఆయన తలమీద, మోకాళ్ళ మీదా శక్తివంచన లేకుండా బాదాడట. దాంతో ఆయనక్కడే కుప్పగా కూలిపోయాడట. పక్కనే వున్న సెంయింట్ మార్థాస్ ఆసుపత్రిలో చేరుస్తే ఆయన 15వ తేదీ రాత్రి 10—40 గంటలకు చనిపోయారట— ఇదేనా విద్యా కాంక్ష!!

*　　　*　　　*

ఢిల్లీలో 20 ఏళ్ళ బిహారి అనే కుర్రాడు తను పనిచేసి, మానేసిన చోటుకు వెళ్ళి తనకు బకాయి డబ్బు లెక్కప్రకారం మూడొందలు రావాలని అడిగాడట. దానికా షాహుకారు తల అడ్డంగా వూపి, నయాపైసా కూడా ఇవ్వనసేసరికి బిహారి ఆత్రంతో సర్రున కత్తి దూసి, తన పొట్టలో కసుక్కున పొడిచేసుకున్నాడట— పాపం!!

*　　　*　　　*

## సజీవ మండూక భక్షకుడు!

రోజుకో యాపిలు పండు తింటే ఇక డాక్టరప్పవాడి అవసరమే వుండదు [ఏనాపిల్ కీప్స్ డాక్టరవే' అనే సామ్యమొకటుంది. ఆపిలు పండు కన్నా డాక్టరుతో మూడుసార్లు ముచ్చటే కారు చౌక [కొన్ని చోట్ల] అనేది వేరే విషయం. ప్రబిమ్మంగా నేళో ఆర్పీ అనే 57 ఏళ్ళ ఆయన రోజుకో సజీవంగ వున్న చిరుకప్పను ఆహారంగా స్వీకరిస్తున్నాడట ఈయనకు యీరకంగా కప్పలు తినడం 46 సంవత్సరాలుగా ఆచరణలో వున్నట్లు ఆయనే ప్రకటించాడట. అనగా యీనాటికి హీనపక్షంగా 15 వేల కప్పలన్నైనా తిని వుంటుండాలి. సజీవంగ మింగిన కప్పపిల్లలు తన పొట్టలో బతికున్నట్లు గానీ, ఎదుగుతున్నట్లు గానీ, మరి అల్లరిగానీ లేదని చెప్పాడటీయన—పాపం!




## ఆడఖైదీల అగచాట్లు

సౌత్ వియత్నాం ఘోర పరిస్థితిలో ఆడ ఖైదీల బాధలు వినవీల్లేనంత భయంకరంగా, జుగుప్సాకరంగా వుంటున్నాయని పాలోకాండర్ అనే పోటు యీ ఖైదీలను పులిబోనుల్లో వుంచుతున్నారనీ, తాగడానికి సబ్బు నీళ్ళిస్తున్నారని, మెడలోతు నీటిలో పడేసి వుంచుతున్నారని వార్త! ఇంతే గాక ఆ ఆడఖైదీలను కేవలం కుక్కలచేత చెరుస్తున్నారట— రామ రామ!

## పాఠశాలపై పడిన బందిపోట్లు!

గ్వాలియర్ జిల్లాకు చెందిన ఒక గ్రామంలో ఒకపాఠశాల మీద పడ్డ బందిపోటు ఆ పాఠ




శాలలోని 40 మంది పిల్లలను, ఒక ఉపాధ్యాయుణ్ణి, ఓ చప్రాసిని ఎత్తుకుపోయారట. ఆ పిల్లల తలిదండ్రుల వద్ద నుంచి డబ్బు గుంజడానికే ఎత్తుకుపోయి వుండుంటారని ప్రభుత్వంఅనుమానిస్తోంది. లేక సరదాకి తీసుకెళ్ళి అల్లల్లా వూరు చూపించి, పూవుల్లో పెట్టి తీసుకొస్తారా! ఏమో!! వెర్రి అనుమానాలు!!!

*　　　*　　　*

ప్రెసిడెంటు సుకర్నో మరణానంతరం ఆయన ఆస్తి పంపకాల విషయంలో ఆయనభార్యలకు తగువులొస్తున్నాయట. ఆయనకు కనీసం ఆరుగురైనా భార్యలున్నట్లు యీ తగాదాల ద్వారా తెలుస్తోందట— ఈజిప్ట్! ●

# ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక

## కొత్తరకం పోటీ!

# 1970 దీపావళి కథలపోటీ!!

# రు. 5000 బహుమతులు

## ఇంకా ఇతర ప్రత్యేక బహుమతులు!!

ఈ ఏడు దీపావళి కథలపోటీని సరికొత్తరకంగా నడపటానికి నిశ్చయించుకున్నాము!

ప్రతి సంవత్సరం **మూడు కథలకి మూడు బహుమతులు ఇస్తున్నాము.**

ఏ కథలు ఉత్తమమయినవో మేమే నిర్ణయిస్తున్నాము.

ఈ ఏడు ఈ పద్ధతులని మార్చివేస్తున్నాము! ఈ ఏడు దీపావళి కథలపోటీకి వచ్చిన కథలలో పదింటిని (10ని) ఉత్తమ కథలుగా ఎన్నుకుంటాము. ఈ కథలలో ఒక్కొక్కదానికి రు. 500 బహుమతిచొప్పున ఇస్తాము. ఈ బహుమతుల పంపిణీ బాలట్ నిర్వహణకి ముందే జరుగుతుంది. ఉత్తమ కథలుగా ఎన్నికఅయిన 10 కథలని దీపావళి ప్రత్యేకసంచికలో మొదలుపెట్టి వరుసగా ప్రచురిస్తాము. వీలునిబట్టి సంచికకి మూడు నాలుగు కథలు వేస్తాము ఈ 10 కథలు ప్రచురించే వరుసని లాటరీద్వారా నిర్ణయిస్తాము. అంటే ఒక కథ ముందు పడినంత మాత్రాన అది తర్వాతపడిన కథలకన్నా ఉత్తమమయినదనే సూచన ఉండటానికి అవకాశం ఉండదన్నమాట.

## *పాఠకుల నిర్ణయం: బాలట్*

పయిన చెప్పిన విధంగా అచ్చుఅయిన 10 కథలలో ఏవి ఉత్తమమయినవో పాఠకులే నిర్ణయించటానికి ఒక బాలట్‌ని ఏర్పాటుచేస్తాము. పాఠకులకి ఈ బాలట్ ఆసక్తికరంగా ఉండేందుకు, బాలట్–పోటీని ఒకదానిని కూడా నెలకొల్పుతాము. ఈ పోటీ వివరాలు బాలట్ ప్రకటనతోబాటు, 10 కథల ప్రచురణ పూర్తిఅయిన తర్వాత, ప్రచురిస్తాము! పాఠకుల ఎన్నికప్రకారం మొదటి మూడు ఉత్తమకథలుగా నిర్ణయింపబడ్డ కథలకి మళ్ళీ ప్రత్యేక బహుమతులని ఏర్పాటు చేస్తాము. ఈ బహుమతుల వివరాలు బాలట్ ఫలితాలతోబాటు వెల్లడిస్తాము. రచయితలందరూ మాతో సహకరించి ఎప్పటిలాగే ఈ సంవత్సరం దీపావళి కథలపోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

## నిబంధనలు

1. కథలు ఇంతకిముందు ప్రచురణకాని స్వంతరచనలై ఉండాలి ప్రతికథతోనూ రచయిత అది తన స్వంతరచనేనని, దేనికీ అనువాదం కానీ, అనుసరణకానీ కాదని హామీ రాసి పంపాలి. ఈ హామీలు వేరే కాగితంమీద కాకుండా కథ వ్రాతప్రతిమీదే రాసి ఉండాలి.

2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3. వ్రాతప్రతిమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒకవైపుమాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు, పూర్తి చిరునామాకూడా వ్రాతప్రతిమీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సయిజు నోట్‌బుక్‌కి రెండురెట్లు) పేజీలకి మించరాదు.

4. కవరుమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్రవారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్ మదరాసు–1'కి పంపాలి

5. పోటీ గడువు తేదీ 31–8–'70. ఆ తర్వాత మా కార్యాలయానికి చేరిన కథలు మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా వెలువడే 30–10–70 తేదీకల ఆంధ్ర సచిత్రవారపత్రికలో ప్రారంభించి వరుసగా ప్రచురిస్తాము

7. 10 ఉత్తమ కథల ఎన్నికకి సంబంధించిన తుది నిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకునిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపటానికీ వీలు ఉండదు.

8. బాలట్‌తోబాటు ఎటువంటి పోటీ నెలకొల్పబడినా ఆ పోటీకి సంబంధించిన తుది నిర్ణయాలన్నీ ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడివే. ఈ విషయమై ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలు జరుపటానికీ వీలు ఉండదు.

9. కథల వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపటానికి సాధ్యంకాదు. (అందుచేత కథలపోటీలో పాల్గొనే వారు తపాలాబిళ్ళలు అతికించిన స్వంత చిరునామాకల కవర్లు పంప నవసరంలేదు.)

10. పోటీలకి సంబంధించిన ఏ విషయం గురించీ ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించేముందు తెలుపుతాము.



'తల్లిదండ్రులు'లో హరనాథ్, విజయలలిత.

చిత్రసమీక్ష.

# తల్లిదండ్రులు

నవలని చిత్రీకరించే టెక్నిక్‌లో మనవారు ఇంకా వెనకబడి వుండడం వల్లననుకుంటాను వాటికి అంతగా ప్రజాదరణ లభించడం లేదు. నవల ఎంత ఉత్తమంగా వున్నప్పటికీ—వాటిని చలనచిత్రీకరించే ధైర్యం నిర్మాతల్లో కొరవడుతోంది. ప్రేక్షకులు మంచి కథా చిత్రాలని ఆదరించినప్పుడు నిర్మాతలు ఉత్సాహం పుంజుకుని కొన్ని ఉత్తమ నవలల్ని వెలుగులోకి తెచ్చే అవకాశం వుంటుంది.

పోలాప్రగడ సత్యనారాయణమూర్తి నవల 'కౌసల్య' ఒక పత్రికలో సీరియల్‌గా పడింది. నవలని కె. ఏ. ప్రభాకర్, కె. బాబూరావు 'రాము విజేతా' బ్యానర్‌మీద 'తల్లిదండ్రులు' చిత్రంగా రూపొందించారు. ఈ సోదరుల ఉత్తమాభిరుచికి ఈ చిత్రం ఒక మంచి ఉదాహరణ!

ఒక చిన్న విషయంపై తల్లిదండ్రులు విడిపోతారు. ఒక్కగానొక్క కొడుకు తల్లి క్రమశిక్షణలో పెరిగి పెద్దవాడవుతాడు. ఆ తండ్రి ఆధీనంలో మరొక కుటుంబానికి ఆదరణ దొరుకుతుంది. ఎవరు ఎవరి ఆదరణలో వున్నారో అనే విషయం ఇంట్రవెల్‌కి ముందు తెలిసిపోతుంది గనక — ప్రేక్షకులు పాత్రల బంధుత్వాన్ని అర్థం చేసుకోడానికి కొంత ఇబ్బందిపడినా మొత్తంమీద తర్వాతి కథ తేటతెల్లమైపోతుంది. ముగింపులో చచ్చిపోయిందనుకున్న కథానాయకురాలు (?) తిరిగిరావడం కథకి ఒక చక్కని మలుపు.

సమాన స్థాయిగల రెండు పాత్రలలో హరనాథ్, శోభన్‌బాబు పోటాపోటీలుగా నటించి చిత్రాన్ని రసభరితం చెయ్యడానికి ప్రయత్నించారు. సంధ్యారాణి పాత్ర చిన్నదైనప్పటికీ ఆమె నటన ప్రేక్షకుల హృదయాల్లో నిలిచిపోతుంది. జగ్గయ్య ప్రతిభావంతమైన నటన చిత్రానికి హైలైట్. వైవిధ్యమైన పాత్రలో సావిత్రి నటన తారస్థాయి నందుకున్నది. చంద్రకళ, విజయలలిత, నాగయ్య, రేలంగి, చంద్రమోహన్, అల్లు రామలింగయ్య, విజయ మొదలైనవారు తమ తమ పాత్రలని సమర్థవంతంగా పోషించి చిత్రాన్ని రక్తి కట్టించారు.

కె. బాబూరావు దర్శకత్వం మెచ్చుకోతగ్గ రీతిలో వుంది. పిచిసెట్టి సంభాషణలు రాసిన ఈ చిత్రానికి నిర్మాత కె. ఏ. ప్రభాకర్. తల్లిదండ్రులు సకుటుంబంగా చూసి ఆనందించతగ్గ చిత్రాల్లో ఒకటి!

—సీతరాజు ●

# సినిమా

## ఊటీలో అక్కినేని, వాణిశ్రీల ప్రేమగీతం

హీరో నాగేశ్వరరావు గృహప్రవేశానికి వచ్చిన వాణిశ్రీని, అక్కడే నాలుగు రోజులు వుండమని నాగయ్య, రుక్మిణిగార్లు కోరడం, వాణిశ్రీ తండ్రి ఎస్వీ రంగారావు అంగీకరించడం జరిగింది. శ్రీ రంగారావు అంగీకరించడానికి ముఖ్యమయిన కారణం ఒకటుంది. తన కూతుర్ని హీరోకిచ్చి పెండ్లి చెయ్యదలచడమే.

గ్రామంలో పెరిగి పెద్దదయిన వాణిశ్రీని హీరో నాగేశ్వరరావు ఊటీకి తీసికెళ్ళి, అక్కడి సుందర ప్రదేశాలను, ప్రకృతి రామణీయకతను చూపెట్టి, ఆమె మనస్సును ఆహ్లాదపరిచారు. ఒక రమ్యమయిన ప్రదేశంలో యుక్తవయస్సులోవున్న యిద్దరు ఏకాంతంగా వుంటే, వాళ్ళ మనస్సు వూరుకుంటుందా? రతీ మన్మథుల్లా వున్న వాణిశ్రీ, నాగేశ్వరరావులు ఊటీలో ప్రేమ సామ్రాజ్యాన్ని సృష్టించారు. కాస్సేపు మాట్లాడుకున్నారు. కాస్సేపు విశ్రమించారు. మరి కాస్సేపు కమ్మగా పాడారు.

'నా హృదయపు కోవెలలో
నా బంగరు కోగిలిలో
ఆనందం నిండేనులే
అనురాగం పండేనులే'

అంటూ హీరో నాగేశ్వరరావు, వాణిశ్రీ యొక్క అందచందాలను, ఆమె రూపురేఖా విలాసాలను తన మనస్సులో ముద్రించుకున్నారని మీకు తెలిసేవుంటుందనుకుంటా. తన గృహప్రవేశానికి వచ్చి, మధురగానంతో తన్ను అలరించిన వాణిశ్రీని పదిమందిలో అభినందించలేకపోయిన హీరోకు యిప్పుడు మంచి ఛాన్సు దొరికింది.

మధువులు కురిసే గానముతో
మమతలు నాలో పెంచితివే



# నిందలతో నిర్వీర్యమై అలమటించే చరిత్రహీనులకు విముక్తి ఎప్పుడు?

## తనకుపట్టుని అంశాల్లో జోక్యం లేనపుడే సాధ్యం!

ఎంత మంది దోషులైనా తప్పించుకో వచ్చును గాని — కనీసం ఒక నిర్దోషికి కూడా శిక్ష పడకూడదని న్యాయశాస్త్రాలు చెప్పే సూత్రాలు సిద్ధాంతాలు గీతలాంటి అనాథలకు అందుబాటులో లేనపుడు సామాజిక జీవితం దుఃఖ పూరితమే అవుతుంది.

సెక్సుకు సంబంధించిన విషయాలు కోర్టులో విచారణ జరిగేప్పుడు న్యాయం కంటే వాద ప్రతివాదనలతో సూటీపోటీ మాటల్తో ?ంచ పరచడమే అధికంగా వుంటుంది. గీతకు కూడా సమాజంలో ఈ విషమస్థితే ఎదురైంది.

కాని-జారిన కాలు కూడదీసుకొనే అవకాశం సుతరామూ ఇవ్వ నిరాకరించే ఈ సంఘం నిర్దయగా గీతను కులట, పతిత. వేశ్య అని నిందించింది.

"నీ తల్లి.... సాధ్వి కాపురంచేసిన ఈ గృహానికి అలాంటి పిల్లను కోడలుగా తిసుకు రావడానికి నీ మనసెలా వొప్పింది-బాబూ" అంటూ తండ్రి మాణిక్యాలరావు ఆక్షేపించాడు

ప్రభాకర్ మృతిచెందాడని తెలిసినపుడు-భోగాలరావులాంటివ్యక్తి అదనుచూచి శీలం అపహరించేందుకు పెదబెబ్బులిగా సమాయత్తమైనప్పుడు- ఆ అనాథ ఏం చేస్తుంది?

ఈ స్థితిలో సంఘంలో ఆమెకున్న స్థానమేమిటి?

## ఈ అనుమానాలకు అంతెక్కడ?

సాటి మానవులు - నిరంతరం పెట్టే అగ్నిపరీక్షలకు తట్టుకొని నిలబడగలుగుతుందా?

ఈ సితిలో ఎదురయ్యే అవమానాలను, అన్యాయాలను ఎదుర్కొని - "నీకు భార్య దొరికింది గాని నాకు కోడలు దొరకలేదన్నాను - ఆనాడు. కాని దేవతలాంటి



కోడలు నాయింటి కొచ్చిందని ఈనాడు గ్రహించాను" అని మామ చేతనే అనిపించడానికి గీత ఎదుర్కొన్న పరీక్ష లెన్ని!

ఇంతటి కఠోర సత్యాన్ని ఎల ~~పించ గలిగింది!

శ్రీపద్మ

# అగ్నిపరీక్ష



# సినిమా

నీగననను మెంచిన మిసుణముతో
వామనసును నిలువున దోచితివే ...

అంటూ వాణిశ్రీని తన బిగి కౌగిలిలో హీరో యిముద్దుకున్నారు. 'కట్' అన్నారు దర్శకుడు పుట్టన్న. ఈ శృంగార సన్నివేశం ప్రొడ్యూసర్స్ కంబైన్స్‌వారి 'ఇద్దరమ్మాయిలు' చిత్రంలో కనిపిస్తుంది. ఈ పాటను దాశరథి వ్రాసారు.

ఈ చిత్రంలో వాణిశ్రీ వైవిధ్య స్వభావాలు కలిగిన రెండు పాత్రలను విశిష్టంగా పోషించింది. ధనవంతురాలిగా, పేదపిల్లగా వాణిశ్రీ ప్రదర్శించిన హావభావాలు ఆమెను ఒక గుణచిత్ర నటిగా రూపొందించాయనే చెప్పాలి. కన్నడంలో 'కప్పుబెళుపు' యొక్క తెలుగు రూపమే యీ 'ఇద్దరమ్మాయిలు' చిత్రం. కన్నడ చిత్రానికి దర్శకత్వం నెరపిన శ్రీ ఎస్. ఆర్. పుట్టన్న తెలుగు, తమిళ వెర్షన్లను కూడా డైరెక్టు చెయ్యడం ముదావహం. తెలుగు చిత్రానికి నరసరాజుగారు మాటలను మహదేవన్ సంగీతాన్ని, మారుతీరావు ఛాయను నిర్వహిస్తున్నారు కలర్‌లో నిర్మించబడుతున్న యీ చిత్రంలోని ప్రధానపాత్రలను నాగేశ్వరరావు, ఎస్వీ రంగారావు, గుమ్మడి, శోభన్‌బాబు, వాణిశ్రీ, సూర్యకాంతం, రమాప్రభ, రుక్మిణి, నాగయ్య, అల్లురామలింగయ్య మరియు రాజబాబుగార్లు పోషిస్తున్నారు.

సెప్టెంబరులో విడుదల చెయ్యాలని నిర్మాతలు చెప్పారు.

## తానొకటి తలిస్తే...

విజయనిర్మల కృష్ణను తప్ప మరెవ్వరినీ పెండ్లి చేసుకోను అని నాగభూషణం (ఆమె తండ్రి) దగ్గర మొండికేసింది. కానీ ఆమెతండ్రి తన కూతుర్ని కృష్ణంరాజుకు నిశ్చయం చేసాడు. కృష్ణ తన యింట్లో నౌకరుగా వుండబట్టే, యీ తిప్పలు కొని తెచ్చుకున్నట్టయిందని నాగభూషణం యెంచి అతగాడ్ని తన యింటి నుండి పంపడానికి ఒక ప్లాన్ వేసాడు, 'నీకు డబ్బు కావాలంటే యెంతయినా యిస్తాను. నా కూతుర్ని ప్రేమించడం మానుకో. అవసరమయితే నీకు దండం పెడతా. మానావం, ప్రాణం నీ చేతిలో వుంది' అని నాగభూషణం హీరో కృష్ణ దగ్గర వాపోతాడు. 'నావల్ల మీ గౌరవానికి మచ్చరావడం యిష్టంలేదు. కానీ నేను డబ్బుకు కక్కుర్తి పడే నీచుడ్నికాను' అని చెపుతూ మేడ వైపు చూస్తాడు అప్పుడే విజయనిర్మల మేడ మెట్లు దిగి వస్తూవుంటుంది. ఆమె మనస్సులో తనపై చెడ్డ భావం కలిగించా లనుకుని 'ఇవ్వండి.' అని నాగభూషణం దగ్గర డబ్బు తీసుకున్నాడు! ఆ దృశ్యాన్ని



'శ్రీదేవి'లో
రోజారమణి, కే. ఆర్. విజ

విజయనిర్మల చూచింది. మనస్సు చివుక్కుమని లోపలికి వెళ్ళింది హీరో కృష్ణ డబ్బును నాగభూషణంకు తిరిగి యిచ్చేసి గంభీరంగా వెళ్తాడు.

హీరో కృష్ణను సత్యనారాయణ, నెల్లూరు కాంతారావులు ఒక గుహలో కట్టి పడేసారు ఈ విషయం విజయనిర్మలకు తెలిసింది. గబ గబ వచ్చింది. తన ప్రియుడ్ని విడిపించా లనుకుంది. 'నీ ప్రియుడు బ్రతకాలంటే నువ్వు కృష్ణంరాజును పెండ్లాడాలి' అని షరతు పెడతారు. 'సో, అలాగే అని ఒప్పుకుంది. తను పెండ్లికి అంగీకరించినట్టు తన తండ్రికి చెప్పింది.

'పెళ్లి కుదిరిందమ్మా
పెళ్లి కుదిరింది.
వాన్ని ప్రేమ గెలిచింది
నా పెళ్లి కుదిరింది' అంటూ

విజయనిర్మల పాడుతుంటే, ఆమెకు తెలియకుండానే కన్నీళ్లు బొట బొట రాల సాగాయి. 'కట్' అన్నారు దర్శకుడు పి. పిల్లయ్య. ఈ బరువయిన సన్నివేశం పద్మశ్రీ ప్రొడక్షన్స్‌వారి 'అల్లుడే మేనల్లుడు' చిత్రంలో కనిపిస్తుంది.

## సినిమా డైరీ

● మాధవి కంబైన్స్‌వారి షూటింగు హైదరాబాదు సారథిలో జులై 14 నుండి 22 వరకు జరిగింది ఈ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు లక్ష్మి, నాగేశ్వరరావులు నాయకీనాయకులు

● జగపతి ఆర్ట్సు పిక్చర్స్‌వారి "దసరా బుల్లోడు" షూటింగు సారథి స్టుడియోలో జులై 24 నుండి 31 వరకు జరిగింది శ్రీ వి బి రాజేంద్రప్రసాద్ దర్శకత్వంలో నాగేశ్వరరావు, వాణిశ్రీలు గాక చిత్రంలోని నటీనటులందరూ పాల్గొన్నారు.

● కౌముదీ ఆర్ట్సు పిక్చర్స్‌వారి శ్రీకృష్ణవిజయము షూటింగు ప్రసాద్ స్టుడియోలో జులై 19 నుండి 26 వరకు జరిగింది శ్రీ కామేశ్వరరావు దర్శకత్వంలో రామారావు, జమున, జయలలితలు నటించారు

● శ్రీ లక్ష్మి ప్రొడక్షన్‌వారి "రౌడీరాణి" షూటింగు జులై 23 నుండి 30 వరకు పిర్కాడులకి జరిగింది శ్రీ కె ఎస్ ఆర్ దాసు క్లయిమాక్సు దృశ్యాలను అక్కడ చిత్రీకరించారు. విజయలలిత, సత్యనారాయణ, రాజబాబులు పాల్గొన్నారు

● డి ఎల్. ఎన్ చలనచిత్ర నిర్మిస్తున్న క్రొంగం చిత్రం యొక్క మొదటి పాట జులై 24న విజయ గార్డెన్స్‌లో జరిగింది శంకర్ సంగీత సారధ్యంలో ఎల్ ఆర్. ఈశ్వరి పాడింది. ఈ చిత్రానికి పి సుబ్రహ్మణ్యం దర్శకుడు

తప్పక చూడండి!

టైగర్ ప్రొడక్షన్స్ సమర్పించు

# అఖండుడు



దర్శకత్వం: వి. రామచంద్రరావు B.A.(HONS)

నిర్మాతలు: వెలువూరు కాంతారావు, సహనిర్మాత: S. H. హుస్సేన్

కథ: సి. యస్. రావు B.A.(LITT.)

పాటలు: మహారథి

సంగీతం: చలపతిరావు

కెమెరా: V S R స్వామి M.A.

కళ: రాజేంద్రకుమార్ B.A.

కూర్పు: N S ప్రకాశం

NAVRANG

పూర్ణా ఫిలింస్



'రౌడీరాణి'లో విజయలలిత, రాజబాబు

ఆచార్య ఆత్రేయ వ్రాసిన యీ పాటను సుశీలచేత రాగభావయుక్తంగా సంగీత దర్శకుడు శంకర్ పాడించారు. శ్రీ వి. వెంకటేశ్వర్లు నిర్మించిన యీ చిత్రం విడుదలకు పురకలు వేస్తోంది. షూటింగు, రీ-రికార్డింగు పూర్తయింది ఈ చిత్రానికి భమిడిపాటి కథ, మాటలను సమకూర్చారు అతి త్వరలో శ్రీ ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది.

# సినిమా నాటికీ నేటికీ వున్నతేడా ఏమిటి?

ఇప్పుడు మన దేశం అరాచకం, అన్యాయాలతో పెడదారిలో వెడుతూ వుంది నాటికీ, నేటికీగల వ్యత్యాసాన్ని అభ్యుదయ కవి శ్రీశ్రీ యీ క్రింది విధంగా వ్రాసారు ఈ పాటను 'రౌడీరాణి' చిత్రానికిగాను సుశీల బాలసుబ్రహ్మణ్యంలు పాడారు

ఒకప్పుడు మనదేశం ఎలా వుండేదో నటి విజయలలితద్వారా దర్శకుడు. కె. ఎస్. ఆర్. దాసు చెప్పించిన తీరు.

'మనదేశంలో వున్నారు
మహానుభావులు ఒకనాడు
దేశంకోసం తమ సర్వస్వం
త్యాగం చేసారు; నీతికి నిలచి
భారతజాతికి ప్రాణం పోసారు' అని

మనదేశాన్ని ప్రశంసిస్తుంటే, రాజబాబు అడ్డుతగిలి తగ్గమ్మా తగ్గు, యిప్పుడు మనదేశం నువ్వు చెప్పినదానికి విరుద్ధంగా తయారైంది అని నేటి పరిస్థితులను వివరించాడు. ఎలాగో తెలుసా?

'స్వార్థంకోసం ప్రజల సుఖం
ఫలహారం చేస్తారు
అవినీతికి మన భారత
జాతిని అహుతి చేస్తారు' అంతకాదు

యింకా చాలా వుంది అని రాజబాబు పొడిగించబోతుంటే 'కట్' అన్నారు దర్శకుడు కె. ఎస్. ఆర్. దాసు. ఈ నీతిని ప్రబోధించే దృశ్యాన్ని 'రౌడీరాణి' చిత్రంలో చూడొచ్చు అట్లూరి శేషగిరిరావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి విశ్వప్రసాద్ మాటలను,

## మీకు తెలుసా?

హీరో నాగేశ్వరరావుగారు స్నానానికి సున్నిపిండిని వుపయోగిస్తారట సబ్బును వాడరట

నటి వాణిశ్రీ మాధవనాయర్ కాలనీలో ఒక పెద్ద భవంతిని కట్టిస్తూంది. ఫ్లాట్ సిస్టమ్‌లో నిర్మించబడుతున్న ఈ భవనం అద్దెకు ఇవ్వబడుతుందట.

దర్శక నిర్మాత శ్రీ ఆదుర్తి నిర్మించిన 'దర్పణ్' చిత్రానికి జమ్మూ కాశ్మీరు ప్రభుత్వం వినోదపు పన్నును మినహాయించిందట

సరళ అనేడి పేరుతో ఒక గాయని, ఒక నర్తకి వున్నారు ప్రజలు గాయనిని ఆడమనడం, నర్తకిని పాడమనడం జరుగుతూ వుందట



'ఇద్దరమ్మాయిలు'లో వాణిశ్రీ, నాగేశ్వరరావు

ASP/GIC-1

ప్రొటీన్
కార్బోహైడ్రేట్స్
కాల్షియమ్ పాంటోథినేట్
విటమిన్ ఎ
ఐయొడిన్
ఐయర్న్
విటమిన్ బి12
నికోటినమైడ్
విటమిన్ ఇ
కాల్షియమ్
విటమిన్ సి
పొటాషియమ్
లివర్స్
ఫాస్ఫరస్
సోడియమ్ క్లోరైడ్
ట్రేస్ ఎలిమెంట్స్
విటమిన్ బి1
విటమిన్ డి
రిబోఫ్లావిన్
కోలిన్
పైరిడాక్సిన్
విటమిన్ కె
ఫోలిక్ ఏసిడ్

# మీ శరీరానికి 23 "ఆహారాలు" ముఖ్యము



## పాలలో 9 ఉన్నాయి

## కాంప్లాన్‌లో మొత్తం 23 ఉన్నాయి

(ప్రొటీన్, విటమిన్, ఖనిజాలతో కలిపి)




ఒక కప్పు కాంప్లాన్‌లో సంపూర్ణ, సంతులిత ఆహారము ఉంది మీకు కావలసినంత చక్కెర, మీకు ఇష్టమైన ఇతర ప్లేవరింగ్ పదార్థము—కాఫీ, కోకో, వనిల్లా, కేసర్ మొదలైనవి—కలుపుకొని త్రాగండి. (అయితే, నారింజ లేక నిమ్మరసముతో మాత్రము త్రాగకూడదు.)

కాంప్లాన్ అవసరము ఎందుకంటే చూచుటకు సమృద్ధముగ ఉన్న ఆహారములలో కూడ ఒకటి లేక ఇంకా ఎక్కువ ముఖ్యమైన పదార్థములు లోపించవచ్చును. అతి శ్రేష్ఠమైన, సహజాహారము, పాలు, కూడా లోపపూరణము చేయజాలదు. ఒక్క కాంప్లాన్‌లో మాత్రమే 23 ప్రాణాధారమైన 'ఆహార' పదార్థములు ఉన్నాయి.

పెరిగే పిల్లలకు, పనిలో ఉన్న పెద్దవారికి, గర్భిణి లేక పాలిచ్చు స్త్రీలకు, వయస్సు మెళ్లినవారికి, అలగాళ్ళకు కాంప్లాన్ చాల అవసరము

కాంప్లాన్‌లో ఉన్న 23 పోషక పదార్థములు, అవి మీకు ఏవిధంగా సహాయపడతాయి
ప్రొటీన్ శరీరాణువులను తయారు చేయుటకు, మరమ్మతు చేయుటకు
లివర్స్ శక్తికి ఏకాగ్ర మూలము.
కార్బోహైడ్రేట్స్ శరీరము చురుకుగ పనిచేయు నిమిత్తము.
కాల్షియమ్ ఆరోగ్యమైన పళ్లు, ఎముకల వృద్ధికి
ఫాస్ఫరస్ శరీరములో ద్రవములకు, ఎముకలకు, పళ్లకు అవసరము.
సోడియమ్ సహజ రక్త ప్రక్రియ నిర్వహించుటకు.
క్లోరైడ్ (సిఎల్ రూపములో) కండరములు, పనిచేయుటకు; ముఖ్యముగా తిమురులను అరికట్టును.
పొటాషియమ్ దీని లోపమువలన మానసిక ఉదాసీనత, కండరముల బలహీనత కలుగుతుంది.
ఐయర్న్ (ఇనుము) ఆరోగ్యకరమైన రక్తము కొరకు
ఐయొడిన్ థైరాయిడ్ సంతృప్తంగా పనిచేయుటకు అవసరము. దీనిలోపమువలన బరువుకు సంబంధించిన సమస్యలు కలుగుతాయి; గొంతుమీద పెద్దకాయ లేస్తుంది (గాయిటర్)
విటమిన్ ఏ కళ్ళను, ఇంకా పెదవులనుండి గర్భము వరకుగల అవయవములను కప్పిన పొరను, ఆరోగ్యంగ ఉంచుతుంది.
విటమిన్ బి1 పెరుగుదలకు, బలమైన నరములకు, బెరిబెరి రాకుండా అరికట్టుతుంది.
రిబోఫ్లావిన్ నోరు, నాలుక: కళ్ళు—ఈ అవయవములను ఆరోగ్యంగ ఉంచుతుంది.
నికోటినమైడ్ చర్మమును ఆరోగ్యంగ, కళకళలాడుతూ ఉంచుతుంది
కాల్షియమ్, పాంథోథినేట్ నరములను, కండరములను ఆరోగ్యంగ బలంగా ఉంచుతాయి
కోలిన్ కార్యము ఆరోగ్యంగ పనిచేయుటకు ఇది అవసరము.
పైరిడాక్సిన్ బి6 కండరములను సడలిస్తుంది
విటమిన్ బి12 అనీమియా (రక్తము లేమి)ను అరికట్టుతుంది.
ఫోలిక్ ఆసిడ్ క్రొత్త రక్తకణములను తయారు చేయుటలో ఉపయోగపడుతుంది
విటమిన్ సి శరీరములో రోగసంక్రమణను అరికట్టు శక్తిని పెంపొందిస్తుంది స్కర్వి (అవణ రక్తవ్యాధి)ని అరికట్టుతుంది.
విటమిన్ డి బలమైన ఎముకలకు, పళ్ళకు.
విటమిన్ ఇ జనన సంబంధ కార్యములకు
విటమిన్ కె మామూలుగా గడ్డలు కట్టుటకు తోడ్పడుతుంది.
ట్రేస్ ఎలిమెంట్స్ శరీరము విటమిన్లను లోగొనుటకు, గ్రంథుల ఆరోగ్యంగ పనిచేయుటకు ఇవి ముఖ్యము

గ్లాక్సో
రిసెర్చి యొక్క
ప్రపంచ-వ్యాప్త ఉత్పత్తి




# కాంప్లాన్® — అనగా సంపూర్ణ ఆహారము

ఆహార లోపములనుండి మిమ్ములను కాపాడుతుంది.

# మగతారల ఆధిక్యత!

'అన్ని రంగాలలోను ఆడవాళ్లు ముందుకి వస్తున్నా, సినిమారంగంలో మాత్రం మగవాళ్లదే పైచేయి. వాళ్లదే ఆధిక్యత. ఎందుచేత నంటారూ?' అని అడిగా నొకాయన.

'తెలుగులో రామారావు, నాగేశ్వరరావు, తమిళంలో ఎం. జి. ఆర్, శివాజీలవలెనే హిందీలో దిలీప్‌కుమార్ రాజకపూర్, దేవానంద్, రాజేంద్ర కుమార్, హాలీవుడ్ చిత్రాలలో మార్లన్ బ్రాండో, రాక్ హడ్సన్, గ్రెగరీపెక్, ఒమర్ షరీఫ్, పీటర్ ఓటూల్ మొదలైనవారంతా కూడా వారి వారి రంగాల్లో ఎంతో ఆధిక్యతను కలిగివున్నారు. సినిమా పరిశ్రమలో మగతారలకే విలువ ఎక్కువ' అన్నారు, ఇంకొకరు.

ఈ విషయంమీద పరిశ్రమలో కొందరిమధ్య ప్రముఖంగా చర్చ జరిగిందీ మధ్య.

* * *

ఆడవారలకు ఆధిక్యతలేదని అనటం అన్యాయమే అవుతుంది ఒకరకంగా. మన ప్రసిద్ధ నటీమణులు శ్రీమతులు భానుమతి, అంజలీదేవి, యస్. వరలక్ష్మి, సావిత్రి, జమున, జానకి — వీరందరూ ఎవరికివారు ప్రతిభ ఉన్న తారలు. ఒక ప్రత్యేకత సంతరించుకున్నారు. సహజమయిన అందచందాలు చేసా నటనలో విశేషమయిన కృషిచేసి తమకొక ప్రత్యేకతను సృష్టించుకో గలిగారు. అటు ప్రజల్లోనూ, యిటు పరిశ్రమలోనూ ... ఒక ప్రత్యేకమయిన 'ఫీలోయింగ్' ఉంది వారికి. పైన పేర్కొన్న వారిలో ఒక శ్రీమతి జమున తప్ప — మిగిలినవారు అప్పుడపుడు తెరపై కనిపిస్తున్నారు. శ్రీమతి భానుమతి ఇపుడు ఏ తెలుగు చిత్రంలోను కనిపించటంలేదు. హాస్య నటుడు శ్రీ చలం నిర్మిస్తున్న 'మట్టిలో మాణిక్యం' చిత్రంలో బానుమతి నటిస్తున్నారని ఈ మధ్య ఆ చిత్రదర్శకుడు బి. వి. ప్రసాద్ చెప్పారు. ఇది ఆమె అభిమానులకు ఎంతో సంతోషదాయకమైన వార్త.'

* * *

అయితే ఆనాడు (ఈనాడుకూడా) వారికున్న ఆధిక్యత యిపుడు కొత్తగా వస్తున్న ఆడతారలకు లేదు. పైన పేర్కొన్న తారలు విశేషమయిన కృషి చేయటంవల్లనే మగతారలతో దీటుగా నిలిచి ఆధిక్యతను సంపాయించుకో గలిగారు.

కొత్తగా వచ్చిన (వస్తున్న) వారంతా పాత్ర పోషణపట్ల శ్రద్ధాసక్తులు కనపరచి కృషిచేస్తే 'ఎవరి ఆధిక్యత హెచ్చు?' అనే ప్రశ్న ఉత్పన్నం కానేకాదు.

— మోహన్ కుమార్.

## సినిమా

సత్యం సంగీతాన్ని, కన్నప్ప ఛాయను నిర్వహిస్తున్నారు. ఇంతవరకు విజయలలిత నటించిన పాత్రలన్నీ ఒక ఎత్తు. రౌడీరాణి పాత్ర ఒక ఎత్తు. వీర, శృంగార, శోక, కరుణ, భయానక రసాలను ప్రదర్శించే అవకాశం ఈ చిత్రంలో విజయలలితకు పొలకకం ఆమె నట జీవితానికి మైలురాయిగా వుండగలదని ఊహించబడుతూంది. తెలుగులో వాడియావారి నాడియా బ్రాండ్ చిత్రాన్ని నిర్మిస్తున్న లట్సూరి పూర్ణచంద్రరావు 'శాక్షిరాణి'ని లరవైరోజుల్లో పూర్తి చెయ్యడం ముదావహం. చిత్రంలో కనిపించే ముఖ్య పాత్రలను సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, నెల్లూరి కాంతారావు, రాజబాబు, జ్యోతిలక్ష్మి గర్లు పోషించారు.

## మంత్రాలకు చింతకాయలు రాల్తాయా!

పద్మనాభానికి వశీకరణ యంత్రాల మీద, తాయెత్తులమీద విపరీతమయిన నమ్మకం. పద్మనాభానికి మేనత్తకూతురు ఒకతె వుంది. ఆమె పేరు గీతాంజలి. మేనత్తకూతుర్ని కాదని, వాణిశ్రీ వెంట బడ్డాడు పద్మనాభం. వాణిశ్రీకి పద్మనాభంమీద జాలితప్ప మరేభావం లేదు. ఒక శుభ ముహూర్తాన హీరో నాగేశ్వరరావు వాణిశ్రీని తన అర్ధాంగిని చేసుకుంటారు. ఈ విషయం పద్మనాభానికి తెలిసింది. 'దురాశ దుఃఖము చేటు' అని పద్మనాభం తెలుసుకున్నాడు. పాపం కాళ్లీడ్చుకుంటూ గీతాంజలి యింటికి వచ్చి చేరాడు. గీతాంజలి తన బావను ఎగతాళి చేసింది; ఏమనో తెలుసా?

తంత్రాలబావయ్యా రావయ్యా, నీ
మంత్రాలకు రాలవయ్యా చింతకాయలు

పద్మనాభానికి ఒళ్లు మండింది. చాలించు నీ వెక్కిరింపు అంటూ మండలించాడు.

మాయదారి చుప్పనాతి
మరదలు పిల్లా

చాలించు నీ ఏగతాళి
టక్కరి పిల్లా

అంటూ గీతాంజలిని వాటేసుకుపోయే సమయంలో 'కట్' అన్నారు. దర్శకుడు మధుసూదనరావు. ఈ దృశ్యాన్ని అశోక్‌మూవీస్ వారి 'పవిత్రబంధం' చిత్రంలో చూడొచ్చు.

ఈ బ్యానర్‌లో 'సుమంగళి' చిత్రం విడుదలయింది. 'పవిత్రబంధం' వీరి రెండవచిత్రం. ఈ చిత్రానికి శ్రీ టి. గోవిందరాజన్ నిర్మాత, టి. వి. ఎస్. శాస్త్రి సహనిర్మాత, ముఖ్యపాత్రలను నాగేశ్వరరావు, వాణిశ్రీ, కాంచన, పద్మనాభం, గీతాంజలి, కృష్ణంరాజు, నాగయ్య, పేరుమాళ్లు, రావికొండలరావు, జి వరలక్ష్మి ధరించారు. నవయుగా విడుదలచేసే యీ చిత్రానికి ఆరుద్ర మాటలను, రాజేశ్వరరావు సంగీతాన్ని, రామకృష్ణ ఛాయను, సత్యం కూర్పును నిర్వహిస్తున్నారు.

* * *

'మంచికుటుంబం' చిత్రాన్ని సలక్షణంగా రూపొందించిన వి. మధుసూదనరావు దగ్గర్నుండి ఆ 'ఇంటి గౌరవం' కాపాడే బాధ్యతను 'బుద్ధిమంతుడు' బాపుకు శ్రీ మల్లికార్జునరావు అప్పగించారు. తనకిచ్చిన బాధ్యతను సక్రమంగా నెరవేర్చడానికై బాపూ ముళ్లపూడి వెంకటరమణ, కోదండపాణి, ఎస్. కృష్ణారావు, శ్రీ హరిరావుగార్ల సహకారాన్ని పొంది, 'ఇంటి గౌరవం' ప్రతి కంటికి వచ్చగా కనిపించే విధంగా బరువు బాధ్యతలను నిర్వహించారు. ఈ చిత్రంలో నాగభూషణం, శోభన్‌బాబు, చంద్రమోహన్, అశోక్‌కుమార్, సాక్షి రంగారావు, రామచంద్రరావు, కాకరాల, జగ్గారావు, మాష్టర్ విశ్వేశ్వరరావు, 'షావుకారు' జానకి, అరుణ, జయకుమారి, లక్ష్మికాంతమ్మ, ఆశా, సత్యవతి, విజయభానులు ముఖ్య సభ్యులుగావుండి తమకిచ్చిన బాధ్యతను పరిరక్షించారని తెలుస్తోంది. నవయుగద్వారా ఆగస్టులో ఈ చిత్రం మనందరిముందు వుండగలదని తెలుస్తోంది.

# సమాజంలో స్త్రీ స్థానం ఎంత?

భగవంతుడు మానవజాతిని సృష్టించాడు ఆచారాలు, సంప్రదాయాలవేవి మనం యేర్పరచుకున్నవే 'ఏ రూల్ ఈజ్ ఎ రూల్ ఫర్ ఆల్' అని అంటామే గానీ వాడుకలో అలా కనిపించడంలేదు.

పురుషుడు తప్పు చేస్తే పర్వాలేదట.

కాని అదే తప్పు స్త్రీ చేస్తే అపరాధమట విధి వైపరీత్యంవల్ల, పరిస్థితుల ప్రాబల్యంవల్ల నైతిక పతనం పొందిన ఒక కళాశాల విద్యార్థిని తన జీవిత రథాన్ని ఎలా నడుపుతుంది అనేది సమస్యను శ్రీ ఆదుర్తి 'దర్పణ్' చిత్రంలో ఎలా పరిష్కరించారో తెలుసుకోండి ప్రపంచంలోని అన్నిదేశాల సమాజాలు ఎదుర్కొంటున్న యీ సమస్యను చిత్రించడానికి పూనుకున్న శ్రీ ఆదుర్తి సాహసమే సాహసం అని చెప్పాలి బాబూమూవీస్ కంబైన్స్ బ్యానర్ క్రింద శ్రీ ఆదుర్తి తనే స్క్రీన్‌ప్లే వ్రాసి, డైరెక్టు చేసి నిర్మించిన ఈస్టుమన్ కలర్ హిందీ చిత్రంలో వహీదారెహ్మాన్ నాయికగా నటించింది కాత్యాయినీ ఫిలింస్‌వారు శ్రీఫిలింస్ ద్వారా విడుదలచేసే 'దర్పణ్'లో సునీల్‌దత్తు, రెహమాన్, సంధ్యారాణి, సోనియాసహానీ, ముక్రీ ముఖ్య పాత్రధారులు.

*　　*　　*

# సినిమా

ఇటీవల ఒక చిత్రం ప్రదర్శింపబడింది అందులో ఒకపాటవచ్చింది ఆపాట ఒక ప్రేక్షకుడికి నచ్చలేదట అతగాడు యేదో బూతు మాట్లాడినాడట ఆ బూతుమాట చెవినిపడ మరొక వ్యక్తి ఆ ప్రేక్షకుడ్ని కొట్టాడట కొట్టిన వ్యక్తి, పరిశ్రమలో ముఖ్యుడయితే, కొట్టబడిన వ్యక్తి ఒక ప్రముఖ హీరో అభిమాన సంఘంలో అధ్యక్షుడట ఈ ఘర్షణ పడడం పరిశ్రమకు శ్రేయస్కరం కాదని ప్రముఖు అభిప్రాయపడ్డారట. 'ఎవరిదేం పోయింది కూలిపోయేది మేమేగా' అన్నారట కొందరు నిర్మాతలు. ఈ సంఘటన యింతటితో ఆగుతుందా? లేక జనంలో అలజడిని లేదీస్తుందా? —శ్రీనివాస్ ●

**అవీ ఇవీ:**

జూన్ నెల 22 వ తేదీ నుండి 25 వరకు భారత హెవీ ఎలక్ట్రికల్స్ క్లబ్ రామచంద్రాపురం, హైదరాబాద్ వారిచే నిర్వహింపబడిన సాంస్కృతి కోత్సవములలో రావి బ్రదర్స్ అండ్ ఫ్రెండ్స్ వారిచే ప్రదర్శింపబడిన దొంగాటకం' నాటికకు ఉత్తమ ప్రదర్శనకు ఉత్తమ రంగాలంకరణకు, ఉత్తమ దర్శకుడిగా రావిశర్మకు, ఉత్తమ నటిగా వి కాంతిమాలకు, ఉత్తమ సహాయనటుడుగా రావిశర్మకు బహుమతులు లభించినవి రచన కీ శే విశ్వనాథ కవిరాజు

*　　*　　*






లార్ సేల్స్ కార్పొరేషన్, బొంబాయి వారు, లార్' అనే కేశ సంహారిణిని ప్రవేశపెట్టారు 'లార్' తక్కిన ఎన్నో సాధనాలవలె చర్మం పూదనేకాక లోపలికి చొచ్చుకునిపోయి రోమాల్ని పెకలించివేస్తుందని తయారు చేసే వారు అంటున్నారు సాధారణంగా బ్యూటీ క్లినిక్‌లలో రు 2 పుచ్చుకునే సౌందర్యపోషణ పద్ధతులకి బదులు దీని రు 5 లకి ఆదాచెయ్యవచ్చుననికూడా తయారు చే వారు అంటున్నారు 'లార్‌కోల్డ్ వాక్స్' ఈ కే సంహారిణి పేరు . . ●



'అల్లుడె మేనల్లుడు'లో కృష్ణంరాజు జ్యోతిలక్ష్మి సత్యనారాయణ

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty Street, Madras 1. Chief Editor. S. Sambhu Prasad.

# కాఫీధర పెరుగుదల
# నరికట్టుట చౌకధరకు
# మేలురకం
# మిశ్రమ కాఫీపొడి



మార్కెటులో కాఫీ ధరలు పెరిగిపోతూంటాన్ని గమనించి కాఫీ బోర్డు ఈ పెరుగుదలను అరికట్టడానికి తోడ్పడ నిశ్చయించుకున్నది.

1970, జూలై 15 నుంచి కాఫీ బోర్డు తన అన్ని కాఫీ డిపోలద్వారాను మేలురకపు మిశ్రమ కాఫీ పొడిని మాత్రమే 500 గ్రాములు రు. 4-68ల నికరపు ధరకు (స్థానిక పన్ను మరియు అమ్మకపు పన్ను చేరకుండ) అమ్ముతున్నది. ఈ ధర వచ్చే ఆరు నెలలవరకు ఇలాగే ఉంచబడుతుంది.

100 గ్రాముల, 200 గ్రాముల సీలువేయబడిన ప్యాకెట్లలో ఒక్కొక్కదానిమీద ధర ముద్రవేయబడి లభించే ఈ కాఫీపొడి నాణ్యమైన గింజలు కాఫీ విషయం కూలంకషంగా తెలిసిన వారిచే తాజాగా వేయించబడి, మరపట్టించబడిన మేలురకం మిశ్రమమై యుంటుంది.

మీకు కావలసిన మొత్తం కాఫీ పొడిని దిగువ తెల్పిన ఇండియా కాఫీ డిపోలలో ఎక్కడనైనా కొనుక్కొనవలసినదిగ మిమ్ము ఆహ్వానిస్తున్నాము.

- స్టేషన్ రోడ్డు, (ద్వారకా టాకీస్ ప్రక్కను) అదోని
- 5-9-324, మెయిన్ రోడ్డు, గన్ ఫౌండ్రీ, హైదరాబాద్
- 10/164, లక్ష్మీవారపేట, రాజమండ్రి
- ఏలూరు రోడ్డు, విజయవాడ
- పారిజాత బిల్డింగ్, 11-100, మెయిన్ రోడ్డు, విశాఖపట్నం
- స్టేషన్ రోడ్డు, వరంగల్




కాఫీ బోర్డు
బెంగుళూరు

FDSCB-1451 TE A R

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

మమతలు పెనవేసుకున్న మనుషుల్లోనే కలతలు రేగడం సహజం-
అర్థం చేసుకుని అనర్థం కాకుండా చూడడం మనుషుల ధర్మం.
ఉత్తమ కథా సంవిధానం కల కుటుంబ గాథా చిత్రం!



రామ విజేతా ఫిలింస్

# తల్లితండ్రులు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: కె. బాబూరావు   నిర్మాత: కె. ఏ. ప్రభాకర్

డిస్ట్రిబ్యూటర్స్
ఆంధ్ర: జ్యోతి
సీడెడ్: నవభారత్
నైజాం: ఉషా
మైసూర్: విజయ

JOTHEE